# శ్రీమదధ్యాత్మ గేయ రామాయణం






డా. పడాల రామకృష్ణారెడ్డి,
ఎమ్.ఏ., పి.హెచ్.డి.

ప్రథమ ముద్రణ : 1997

ప్రతులు : 500

వెల : **75/-**

ప్రతులకు :
డా. పడాల రామకృష్ణారెడ్డి
M.A , Ph.d.
కొంకుదురు,
(వయా) పందలపాక-533 345
తూ॥ గో॥ జిల్లా.
☎ 65868 STD 08857

ముద్రణ :
శ్రీ రత్నా ప్రింటర్స్
ముత్తంగివారివీధి,
రాజమండ్రి-1.
ఫోన్ : 76345

# అంకితం

శ్రీశ్రీశ్రీ విజయదుర్గా పీఠాధిపతి

## శ్రీ గాడ్ గారికి

అభివాదములతో

డా. పడాల రామకృష్ణారెడ్డి.
ఎం.ఏ., పి.హెచ్.డి.

# నా మాట

శ్రీమద్రామాయణం పవిత్రగంగా ప్రవాహం. ఇందులో మునిగినవారందర్నీ పునీతుల్ని చేస్తుంది. దైవపరంగానేకాదు, నిత్య జీవితంలో ఎన్నోసమస్యలకు పరిష్కారాలు ఇందులో దొరుకుతాయి. అందులో ముఖ్యంగా అధ్యాత్మరామాయణంలో.

వ్యాసప్రణీతమైన యిది తెలుగులో ప్రచారంకాలేదు. ఎవరువ్రాసినా వాల్మీకిరామాయణాన్ని అనుసరించే వ్రాశారు. అది రసపోషణ, అలంకారశైలి, మనిషిని ఆకట్టుకునే కల్పనలతో మహా కావ్యంగా మలచబడ్డంవల్ల సామాన్యులకుచేరువయ్యింది. అందులో రాముడు మానవుడే - కాని ఉత్తమ మానవుడు. అంటే ఆదర్శం ప్రమాణం.

అధ్యాత్మరామాయణానికి మోక్షం ప్రమాణం. పాత్రలు, కథా సంవిధానం తత్త్వబోధనకు ఆలంబనంమాత్రమే. అందువల్ల ఇది సామాన్యప్రేక్షకుడిదగ్గరకు పోలేదు. కానీ రామాయణ ప్రసంగంచేసే పండితు లెవరూ దీన్ని స్పృశించకుండా సాగలేరు. కారణం రామాయణరహస్యమంతా యిందులోనేవుంది - దీనిలో రాముడు దేముడు. అయితే మనుషులందరిలాగే కష్టాలూ, నష్టాలూ, విచారాలూ, సంతోషాలూ, ఆనందాలూ, అనుభూతులూ అన్నీ అనుభ విస్తాడు. దేవుడుకివి వుంటాయా ? మరి మనిషిగా పుట్టాకా మనిషి లాగే ప్రవర్తించాలిగదా ! లేకుంటే మనిషిగా ఎందుకు పుట్టినట్టు ? మనుషులో కలిసిపోయి చెబితేనే తనసందేశం మనుషులు తమదిగా

భావించి మహైక్యంతో స్వీకరిస్తారు. అందుకే యీ మానవావతారం. కాబట్టి అవతార పురుషుడంటే సరిగ్గా అతుకుతుందేమో! సమాజంలో అవతారపురుషులుగా భావించబడేవాళ్ళకు అతీతశక్తులున్నా మామూలు బ్రతుకుసాగించడం లోకవిదితం. వానిని మరీ అవసరమనుకున్నప్పుడు మాత్రమే ప్రదర్శించారు.

ఇంతకీ యీ రామాయణం నేను ఎందుకు తెలుగులో యిలా వ్రాశాను అనేది మీకుతెలుపుదామని ప్రారంభించిన పీఠికయిది. కలలాంటి కబుర్లు కాదుగాని గత డిశంబరులో ఎవరో నన్ను రామాయణం వ్రాయమని అస్తమానూ ప్రేరేపిస్తున్నట్టు అనిపించేది. బుర్రకు ఏకాంతం కాశేవారికినా యీ ఆలోచన మెదడును వాలిచేసేది. ఇదే ఇంగ్లీషులో మహాకవి 'మిల్టన్' 'పేరడైజ్‌లాస్ట్' అనే పవిత్రగ్రంథం వ్రాస్తూ చెప్పిన "డివైన్ మ్యూజ్" అనుకుంటాను. రాత్రులు ఏదో అదృశ్యశక్తి అతన్ని తట్టిలేపి చెబుతున్నట్టుండేదట.

రామాయణం వ్రాయడమంటే ఒక మహాయజ్ఞం చేయడమే. ఆంధ్రులు చేసుకున్న పుణ్యం బ్రహ్మశ్రీ పురాణపండ రామమూర్తిగారు తెలుగు వాడుగా పుట్టడం, ఆయన కంచుగాత్రంతో అద్భుతంగా ఉపన్యసించడమే గాకుండా పురాణాలకు మంచి వ్యాఖ్యానాలుకూడా వ్రాసిన మహాపండితులు, యాదృచ్ఛికంగా మావూరు పంచాయతీ లైబ్రరీలో అధ్యాత్మరామాయణంపేర వారువ్రాసిన వ్యాఖ్యానసహితగ్రంథం చదివాను. వెదకబోయినతీగ కాళ్ళకు

తగిలినట్టయింది. మనకు తెలియని గొప్పవిషయాలెన్నో యీ అధ్యాత్మ రామాయణంలో ఉన్నాయని అర్థమయింది. అప్పటిదాకా నాకు రామాయణం బాగా తెలుసనే అనుకునేవాణ్ణి. నాకు రామాయణం ఏమీ తెలియదని తొలిసారి అర్థమయింది.

జనం చాలామంది నాలాగే వున్నారు. అందుకే రోజూ పుక్కిటి పురాణాలతో రామాయణంమీద ఎవరికితోచినవిమర్శలు వారు చేసేస్తున్నారు. నాకర్థమయిందేమిటంటే ఇది రామాయణ పరమార్థం విస్మరించిచేస్తున్న సాముగరిడీలని. అసలు 'రామతత్త్వం' అధ్యాత్మ రామాయణం చదివితేనే తెలుస్తుంది.

చిన్నప్పుడు మాఅమ్మ నన్ను ఒడిలోకూర్చుండబెట్టుకుని భజనచేయిస్తూ "భక్తి ముక్తి దాయకం రామనామ తారకం" అని పాడించిన పాట పల్లవి సారాంశమే ఈ గ్రంథ సందేశం.

ఇక వ్యాసుని మాటల్లో చెప్పాలంటే ఇది వ్రాసినా, చదివినా, విన్నా కలిగే లాభాలూ, శుభాలూ, సుఖాలూ, సౌఖ్యాలూ అనంతం. ఎవరేది కావాలనుకుంటే అది అవుతుంది. ప్రాణుల రాగవిరాగాలూ, చావుపుట్టుకలూ, లౌకిక అలౌకిక మార్గాలూ, సుఖదుఃఖాలూ, మిట్ట పల్లాలూ, వానికి కారణాలూ, ఉత్తమజీవన పద్ధతులూ, సాంకేతిక శాస్త్రీయ సంగతులూ, ఆత్మ దేహ విచారణ ఇలా ఎన్నో నిండినిబిడీకృతమై వివేకాన్నీ, విజ్ఞానాన్నీ వెదజల్లుతోంది అధ్యాత్మరామాయణం. నీవెవరో తెలుసుకోవడం నీతరంకాదు. ఇది ఏకాంచెం శ్రమలేకుండానే నీకుతెలియజెబుతుంది అప్రయత్నంగా -

ఇంతగొప్ప గ్రంథాన్ని సామాన్యులదాకా తీసుకుపోవాలనే దీక్ష, కాంక్ష యీ రచనకు నన్ను పురికొల్పాయి. నేను జానపద కళలపై పరిశోధనచేసి ఆంధ్రయూనివర్శిటీనుండి 'డాక్టరేట్' పట్టా తీసుకున్నవాణ్ణిగనుక నాదృష్టి ఎప్పుడూ జానపదులపైనే వుంటుంది. అందుకే వాళ్ళబాణీలో గ్రంథంలోని శ్లోకభావాల స్వేచ్ఛానుసరణతో సరళంగా గేయకావ్యంగా మలిచాను. ఎన్నో రామాయణాలొచ్చాయి పద్యరూపంలోనో గద్యరూపంలోనో. కాని గేయరూపంలో ఆసాంతం ఎవ్వరూ వ్రాసినట్టులేదు. ఈనాడు ఆధునిక సాహిత్యప్రక్రియ గేయం. జానపదుల వరుసలకుకూడా అతిసన్నిహితం కాబట్టి అందరూ సుకరంగా వచనంలా చదువుకోవడానికీ, పాటలా పాడుకోవడానికీ వాహనంగా యీ గేయప్రక్రియనెన్నుకున్నాను- అదికూడా సంభాష ణాత్మకంగా. దీన్ని సామాన్యులకు దగ్గరచేయడంకోసం వారివాడుక లోని ప్రయోగాలు, ప్రాంతీయపదాలు చాలవరకు యథాతథంగా వాడేను. విచిత్రం! 1996 జనవరి ముక్కోటినాడు రచన ప్రారంభిం చాను శ్రీ వెదురుపాక విజయదుర్గ పీఠాధిపతి 'గాడ్'గారి సన్మానం తీసుకుని, కలం పట్టుకుంటే నాకుతెలియకుండానే నడిచిపోతోంది. ఆలోచన్లూ, శబ్దాలూ నేనుముందంటే నేనుముందంటూ ఉరకలేసు కుంటూ పోటీపడి మరీ ముందుకొస్తున్నాయి. రాత్రి 3 గంటలయినా కాలం తెలియడంలేదు. కలంవేగం ఆపడం నాతరం కావడంలేదు. మొదలుపెట్టినప్పుడు ఇంత బృహద్గ్రంథం నేను వ్రాయలేనేమో అని శంకించాను, ఎందుకైనామంచిదని అదేరోజు 'హనుమాన్ చాలీసా' మండలదీక్ష ప్రారంభించేను.

ఆశ్చర్యం ! సరిగ్గా 40వరోజుకు 1996 ఫిబ్రవరి 9 నాటికి, అంటే మండలకాలం పూర్తయ్యేనాటికి 'మంగళం' వ్రాశేశా. పోతనగారు వ్రాసిన "పలికెడిది భాగవతమట పలికించెడువాడు రామ భద్రుండట" అనేపద్యం నాపట్ల ఇందులో నూటికి నూరుపాళ్ళా నిజంలాగుంది. ఎంత ఆలోచించినా నామీద దీనిప్రసన్నత నా ఊహ కందడంలేదు. సరే ఏదోఅనుకోండి. ఎవళ్ళఅనుభవం వాళ్ళది. "నేనుసైతం ప్రపంచాగ్నికి సమిధనొక్కటి ఆహుతిచ్చాను" అనేదే నామాట.

"అధ్యాత్మ రామాయణమే తదద్భుతం<br>
వైరాగ్య విజ్ఞానయుతం పురాతనం<br>
పఠంతి, శృణ్వంతి, లిఖంతియే నరాః<br>
తేషాం భవేస్మిన్నపునర్భవో భవేత్"

అని వ్యాసుడుచెప్పినట్లు ఈ అధ్యాత్మరామాయణం 'వ్రాసినా' అన్నదానికివచ్చేపుణ్యం నాదే. ఇక 'చదివినా,' 'విన్నా' అనే వాని పుణ్యం చదివి, విని మీరుమూటగట్టుకోండి.

భవదీయుడు

1-3-96

డా. పడాల రామకృష్ణారెడ్డి<br>
ఎం. ఏ. పి హెచ్. డి.



# ఆనంద బాష్పాలు

కావ్యమా ! అధ్యాత్మ గేయ రామాయణం
కవి ! సకలకళా సాగరుడు
దైవ ప్రేరణతో రూపు దిద్దుకున్న గ్రంథరాజం ఇది.
దీనికి తిరుగులేదు.
రామాయణం కేవలం కథమాత్రమేకాదు
వేదమూలమైన పరబ్రహ్మ స్వరూప నిరూపణం
దాని పరమప్రయోజనం.
నాకు తెలిసినంతవరకు రామకృష్ణారెడ్డిగారు
పుట్టుకతో కవి.
గ్రామీణ జానపద దేశీ స్వభావాన్ని సహజంగా
ఆకళించుకొన్నారాయన.
జీవనాడినిగుర్తించి మాటవిలువా పాటశక్తి
పరికట్టినవారు.
గేయం ఆయన ఊపిరి.
నిరంతర సాహిత్య కృషీవలుడు.
చైతన్యానికి మారుపేరు ఆయన.
నేర్చుకున్న పాండిత్యపాటవాన్ని ప్రక్కన బెట్టి
ఉబికివచ్చిన నిసర్గసుందరమైన స్వీయగేయ ధారతో
ఈగ్రంథాన్ని సుసంపన్నం చేసిన రామకృష్ణారెడ్డిగారిని
మనసారా అభినందిస్తున్నాను.
ఈ గ్రంథానికి శ్రీశ్రీశ్రీ విజయదుర్గ పీఠాధిపతులు
వెదురుపాక "గాడ్" మహోదయుల ఆశీస్సులు
లభించడం బంగారానికి సువాసన అబ్బినట్లు.

- డా. ఇజ్జాడ వెంకట్రావు ఎం.ఏ.పి.హెచ్.డి.
ఆంధ్రోపన్యాసకులు - పి. ఆర్. ప్రభుత్వ కళాశాల, కాకినాడ.

# మెచ్చుకోలు

మిత్రులు డా. పడాల రామకృష్ణారెడ్డిగారు బహుముఖ ప్రతిభా సంపన్నులు. ఇప్పటికే అనేకరచనలు చేసినవారు. ఇప్పుడు వ్యాసప్రోక్తం అయిన అధ్యాత్మరామాయణాన్ని "జానపద" బాణీలో గేయకావ్యంగా సంతరించారు.

ఈ గేయ రామాయణానికి "అధ్యాత్మ' అనే విశేషణం వాడడంలోనే ఈ గ్రంథ విశిష్టత తెలుస్తున్నది. రామాయణ కథతోపాటు నిత్యసత్యాలైన భక్తిమార్గాలు, పూజాక్రమం, భగవద్విశ్వాసం, ప్రాపంచికపు బైశ్వర్యాల అశాశ్వతత్త్వం, భోగ విముఖత, దైవభావన, ఆవాహన వంటి ప్రత్యేకఅంశాలపై దృష్టి పెట్టి మరీ చెప్పిన కావ్యం ఇది -

పూర్వ - ఉత్తర రామాయణ కథ యావత్తూ ఇందులో చెప్పేరు. గేయం చక్కగా ఒకేదరువు (తాళం) ఆధారంగా నడిచింది. రచన చాలా సరళంగా సాగింది. సామాన్యులకుకూడా చాలా సులువుగా అర్థమౌతుంది.

అనవసరంఅయిన వర్ణనావైపుల్యం లేకుండా కథ గబగబా నడిచిపోతూ, పఠితనుఆకట్టుకుంటూ శ్రద్ధగాచదివిస్తోంది. కథావైలక్షణ్యం ఈ క్రింది అంశాల్లో గోచరిస్తున్నది.

(1) అరణ్య వాసంలో "అసలు సీత" అగ్నిదేవుని ఆశ్రయించి అంతర్హితురాలు కాగా ఆమెస్థానంలోవచ్చిన 'ఛాయ సీతనే' రావణుడు అపహరించాడు.

(2) రాముడు దుందుభి తలనుమాత్రమే విసిరేశాడు

(3) రావణుడికి ఒక కలవచ్చింది - ఎవడో ఒక వానరుడు అశోక వనంలో ఒక వృక్షాగ్రం ఎక్కి కూర్చున్నట్లు

(4) రావణ వధానంతరం సీతకు "అగ్నిపరీక్ష" రాముడు తానుగా విధించలేదు. "పావని ! నీ విశుద్ధతను ప్రజకు విశదపఱచు" అని మాత్రమే రాముడంటే సీతాదేవే స్వయంగా అగ్నిపరీక్ష ఏర్పాటుచేసుకుంది.

ఇల్లాంటి సంఘటనలు సాధారణ రామాయణ కథకన్నా కొంచెం భిన్నంగాఉన్నాయి. అదే దీని ప్రత్యేక వైలక్షణ్యం.

ఇక రెడ్డిగారు ప్రయోగించినభాష జానపదసాహిత్యానికి ప్రాణభూతంఅయిన గ్రామీణ వ్యవహారికం. చక్కగా అమరింది.

"మిత్రులు రామకృష్ణారెడ్డిగారు రామాయణం వ్రాసి పుణ్యం కట్టుకున్నారు" అన్నది యథార్థం. శుభమ్ !

— "అష్టావధాని" గాడేపల్లి కుక్కుటేశ్వరరావు M.A.
తెలుగు యూనివర్శిటీ అవార్డు గ్రహీత
రాజమండ్రి.

# ఇది గోదావరి నీరు

ఆపతరము కాని ఆలోచనలు వేగ
మావహింప వ్రాసినట్టి దిద్ది
చూపతరము కాని సూక్ష్మ వేదాంతముల్
పాప నాశనముగ చూపెనిద్ది

మహా సహస్రావధాని
డా. గరికిపాటి నరసింహారావు
ఎం. ఏ. ఎం. ఫిల్; పి.హెచ్.డి.
కాకినాడ.



# అభినందన

"మంచికి మారుపేరైన
మనిషి కథే రామకథ"
అని అన్నాను ఒక చలనచిత్ర గీతంలో.
ఆ రామకథ అసంఖ్యాక భాషల్లో, అనేక ప్రక్రియల్లో,
హృదయంగమంగా రూపుదిద్దుకుంది.
ఆ దిశలో డా. పడాల అధ్యాత్మరామాయణాన్ని గేయ
చ్ఛందస్సులో అనువదించాడు.
ఉత్తర రామాయణ కథాసమేత సమగ్రరామాయణం
ఈ కృతిలోని వస్తువు.
సరళ సరళంగాసాగే శైలిలో, త్రిశ్రగతిలో కథన ప్రధా
నంగా చక్కగాసాగిపోయింది ఈ అనుకృతి.

అధ్యాత్మరామాయణాన్ని సామాన్యులైన అక్షరాస్యులకు కూడా మనోహరంగాఅందించిన డా. పడాల రామకృష్ణారెడ్డి కృషికి నా అభినందన.

పద్మభూషణ్ డా. సి. నారాయణరెడ్డి. ఎం. పి.
ఎం. ఏ. పి. హెచ్. డి; డి. లిట్
జ్ఞానపీఠ పురస్కార గ్రహీత
ఆంధ్ర సారస్వత పరిషత్తు,
హైదరాబాదు.

శ్రీ విజయదుర్గా దేవ్యై నమః

శ్రీ శ్రీ శ్రీ విజయదుర్గా పీఠం
వేదురుపాక

# ఆశీస్సు

శ్రీ మద్రామాయణగాథ ఎందరు ఎన్నిసార్లుచెప్పినా సరి క్రొత్తరూపంలో కన్పిస్తుంది. ప్రతి పఠనానికీ సరిక్రొత్త అర్థం స్ఫురిస్తుంది. ఆసేతుహిమాచలపర్యంతం రామరాజ్యస్థాపన జరగాలని పురాణ కాలంనుంచి నేటివరకు భారతదేశలక్ష్యం నిర్దేశించిన మహత్తరవ్యక్తి చరిత్రే రామాయణ గాథ. వ్యాసప్రణీతమైన ఈ మహాకావ్యాన్ని ఎందరోమహనీయులు గతంలో గ్రంథస్తంగావించి ప్రజలకు రామకథను అందుబాటులోనికితెచ్చు ప్రయత్నం చేసేరు.

ఎందరు ఎన్ని ప్రయత్నాలుచేసినా అవన్నీ పండిత ప్రశంశ, పండిత ఆదరణలతోనే సరిపెట్టుకున్నాయి.

అట్టితరుణంలో రామతత్వం, రామాయణ పరమార్థం సామాన్యప్రజానీకానికి అందుబాటులోకితెచ్చి సామాన్యులు ఒక దాశరథీశతకం వలెనో, ఓ కృష్ణ శతకం వలెనో, రామదాసు త్యాగరాజుల కీర్తనల వలెనో నిత్యం పాడుకొనునట్లు, అక్షరజ్ఞానమున్న ప్రతితెలుగుజానపదుడు పాడుకొనగల సులభజానపదశైలి కావ్యంగా శ్రీమదధ్యాత్మ గేయ రామాయణం నిలుస్తుంది.

ఈ విధంగా రామాయణమును మహత్తర టానిక్కుగా మలిచి జానపదులకు అందుబాటులోనికి తెచ్చిన డా. పడాల రామకృష్ణారెడ్డి

తాను ఏనాడో ఆంధ్రవిశ్వ విద్యాలయంనుండి జానపదకళలపై పొందిన డాక్టరేటును చరితార్థం చేసుకున్నాడు.

నా బాల్యమిత్రుడు, సహాధ్యాయి, సోదరతుల్యుడు డాక్టరు పడాల రామకృష్ణారెడ్డికి శ్రీ విజయదుర్గాదేవి సకల శ్రేయస్సులు అందించి అతని కలంనుంచి మరెన్నో మహత్తర పురాణగాథలు వెలువరించు శక్తి ప్రసాదించుగాక!

ఐ. ఐ. సుబ్రహ్మణ్యం (గాడ్)
శ్రీశ్రీశ్రీ విజయ దుర్గా పీఠాధిపతి,
వేదురుపాక.



# విషయ సూచిక

| నెం. | విషయం |
|---|---|

ు

| నెం. | విషయం | పేజి |
|---|---|---|
| 86. | సింహిక ఛాయాగ్రహణం | 106 |
| 87. | లంకా ప్రవేశం | 106 |
| 88. | లంకిణీ భంజనం | 107 |
| 89. | జానకీ దర్శనం | 107 |
| 90. | రావణాగమనం | 108 |
| 91. | సీత హెచ్చరిక | 109 |
| 92. | సీతాదేవి శోకం | 110 |
| 93. | త్రిజట స్వప్నం | 111 |
| 94. | హనుమంతుని స్వీయ పరిచయం | 113 |
| 95. | అంగుళీయక ప్రదానం | 114 |
| 96. | కాక వృత్తాంతం | 115 |
| 97. | అశోకవన విధ్వంసం | 115 |
| 98. | అక్షకుమార మరణం | 116 |
| 99. | బ్రహ్మాస్త్ర బంధనం | 116 |
| 100. | హనుమత్సందేశం | 117 |
| 101. | రావణ ప్రతిక్రియ | 119 |
| 102. | లంకా దహనం | 120 |
| 103. | మధువన విధ్వంసం | 120 |
| | **VII యుద్ధకాండ** | |
| 104. | లంకాపుర వర్ణనం | 122 |
| 105. | రావణ మంత్రాంగం | 123 |
| 106. | విభీషణ హితోపదేశం | 124 |
| 107. | విభీషణ శరణాగతి | 125 |

# ఇందులో వాడిన ప్రాంతీయ వాడుక పదాలు

| నెం. | మాట | అర్థం | వాడుక ప్రాంతం | పేజి |
|---|---|---|---|---|
| 1. | ని బాంచను | ని బానిసను | తెలంగాణ | 9 |
| 2. | కాల్మొక్తా | కాలికి మ్రొక్కుతా. | ,, | 9 |
| 3. | ఈడ | ఇక్కడ | రాయలసీమ | 21 |
| 4. | చంద్రి | చండిరి | తెలంగాణ | 26 |
| 5. | మంచిగ | బాగుగ | ,, | 43 |
| 6. | లిఖించిండు | లిఖించాడు | ,, | 65 |
| 7. | గట్లే | అట్లే | ,, | 77 |
| 8. | పారొచ్చెను | పరుగున వచ్చెను | తూర్పు | 84 |
| 9. | బాంచన్ దొరా?... | | | |
| 10. | తోడెల్లిరి | తోడుగా వెళ్ళిరి | సర్కారు | 95 |
| 11. | ఏందిర | ఏమిర | రాయలసీమ | 107 |
| 12. | పల్లక | మెదలకుండా | తూర్పు | 110 |
| 13. | తొంగుంటివ? | పడుకొంటివ ? | ,, | 110 |
| 14. | బుల్లీ | అమ్మాయీ ! | సర్కార్లు | 110 |
| 15. | వామ్మో ! | ఓయమ్మో ! | తెలంగాణ | 110 |
| 16. | వొల్లకున్న | ఒప్పుకోకున్న | తూర్పు | 110 |
| 17. | వారెవ్వా | వహ్వా | సర్కార్లు | 110 |
| 18. | కునుకు | నిద్ర | తూర్పు | 111 |
| 19. | మందుకొట్టి నిదరోయిరి | మద్యంత్రాగి నిద్రపోయిరి | సర్కార్లు | 111 |
| 20. | జర | కొద్దిగా | తెలంగాణ | 128 |
| 21. | నేరుగ | తిన్నగ | రాయలసీమ | 145 |
| 22. | బయలెల్లిరి | బయలుదేరిరి | తూర్పు | 149 |
| 23. | ఏగిరముగ | వేగముగా | ,, | 150 |
| 24. | ఎల్చొచ్చిరి | వచ్చిరి | ,, | 150 |
| 25. | బాబా | ఔను ఔను | తెలంగాణ | 158 |
| 26. | ఊసు | మాట | సర్కార్లు | 165 |
| 27. | ఒగ్గి | వదలి | తూర్పు | 167 |
| 28. | కుడువ వస్తి | తినగ వచ్చితి | సర్కార్లు | 178 |

# పూర్వకాండ

## గోమాత ఘోష

శ్రీ వాణీ వల్లభుండు బ్రహ్మనిండు కొలువునుండ
ధేనువొకటి వచ్చినిలిచె కనుల నశ్రువుల రాల్చుచు
ఏమయ్యెను గోమాతా ? ఏడ్చుచుంటివేమి తల్లి ?
తేఱిచూడ గోమాతా ! కాదు కాదు భూమాత—

భారగ దుఃఖము కన్నుల నీరుగ ప్రవహించుచుండ
పలికెనామె "ప్రజాపతీ ! ఈ భారము మోయలేను"—

"ఏమిజరిగె ? ఏమిజరిగె ? ఎఱిగింపుము ధరిత్రిరో
అభయమిచ్చుచుంటినమ్మ అవనీ ! నీ బాధేమిటి ?"—

"దుష్టుడు రావణుఁడు సకల శిష్టజనుల హింసించుచు
క్రూరకృత్యములు అనంత ఘోరములను సలుపుచుండె—

ఆతని దుష్కర్మల కట అంతులేదు మహాప్రభో"
అని విలపించెడు ధాత్రిని ఓదార్చుచు గతము తలచె—

## కుబేర జననం

బ్రహ్మకు మానస పుత్రుడు పులస్త్యుండు తపము జేయ
మేరుపర్వతము దగ్గఱ ఏఱుకొనెను తపోభూమి
తృణబిందను రాజర్షికి చెందినట్టి దావనము
అక్కడ ఒక ప్రక్కన తన వసతిని ఏర్పఱచుకొని
తపమును ప్రారంభించెను పులస్త్యుండు కఠోరముగ—

ఆ వనము మనోహరము  అందాలకు అది నిలయం
కిన్నర గంధర్వయక్ష  కింపురుషాదుల కన్యలు
నృత్యగీత వాదనముల  విహరించగ సాగి రచట
ఋషి సల్పెడు తపోనిష్ఠ  కది భంగము కలిగించగ
కోపించిన పులస్త్యుండు  శపించెనా వనసీమను
తనకంటను బడిన కన్య  వెంటనె గర్భము దాల్చని
గంధర్వులు, దేవకన్య  లిది ఎఱింగి రామనిరి
తృణ బిందుని పుత్రిక కది  తెలియక వచ్చిన దచటికి
ముని కంటను బడెను వెంట  నే గర్భము ధరించింది
నివ్వెఱపోయిన వనిత  నాన్నా ఇది యేమిటనుచు
తండ్రికి వివరింప నతడు  ధ్యానయోగముద్రితుడై
మునిపులస్త్యు శాపఫలం  ముదిత గర్భమని ఎఱింగి
ఆతని ప్రార్థించి తనయ  నతని కిచ్చి పెండ్లిజేసె—
వారికి పుట్టిన బిడ్డడు  'విశ్రవసుడు' మునీశ్వరుడు
భారద్వాజుని పుత్రిక  పరిణయ మాడగ వారికి
"వైశ్రవణుడు" పుట్టె వాని  మఱోపేరె కుబేరుండు.—

## కుబేరుని లంకావాసం

అతడు తపో నిరతుండై  ధాతను మెప్పించినాడు
వాని కోర్కెపై విధాత  ధనపతిగాజేసి తోడు
పుష్పక మను దివ్యవిమా  నముసుకూడ ఇచ్చి పంపె—
వినయముగా 'కుబేరుండు  విశ్రవసు'నకంత జెప్పి
సుఖనివాస యోగ్యంబగు  స్థలము చూపమని అడిగెను

విశ్వకర్మ నిర్మిత వి ఖ్యాతనగర మొకటున్నది
లంకా పట్టణముపేర రాక్షసులకు కట్టి యిచ్చె
దామోదరు భయమువలన దితి సుతులాలంక వీడి
రసాతలము నందు వారి ఉనికిని స్థిరపరచుకొనిరి
నేటివరకు ఆ పురమును ఎవ్వరాక్రమించ లేదు
నీవుపోయి నిశ్చింతగ నెలవు జేసి కొమ్మనగా
ధనాధిపుడు లంకజేరె లంక దివ్య ధామమయ్యె—

## రావణ జననం

కొంతకాల మిట్లు గడువ వింతకోరికొకటి పుట్టె
పాతాళమ్మున దాగి బ్రతుకుచున్న 'సుమాలి'కి
మర్త్యలోకమందు జరుగు ముచ్చట్లను చూడాలని—
ధరాతలముపైకివచ్చె ధనదుడు కన్పడె వానికి
లంకానగరము నందు సకలభోగములతోడను—

అంతే ఆ వైభవములు ఆతని విభ్రాంతు జేసె
తన వెంబడి వచ్చినట్టి కూతురు 'కైకసి'ని పిలిచి
'అమ్మా నీ వైవాహిక వయసు మీఱి పోతున్నది
ఎందఱు యోధులు వచ్చిన కాదని పొమ్మన్నావు
కోమలి నీ యవ్వనాన్ని కొఱగాకుండ జేసి
భర్తలేని అనాథగా బ్రతుకు బండగా నీడ్చుట
తండ్రిగ నే చూడలేను తల్లీ నామాట విను
'విశ్రవసుడు' తపోధనుడు వరించుమా మహాత్ముని
కుబేరుండు వంటి ఘనులు నీ కడుపున పుట్టగలరు

లేకల్లీ బయలుదేఱు" అని పలికిన జనకునితో
'అల్లే' అని ఆశతోడ 'కైకసి' ముని వద్దకు జని
లజ్జతోడ అతని ముందు తల వంచుకు నిలబడగా
కనులు తెఱచి విశ్రవసుడు కన్నె భావమును గ్రహించి
"అసుర సంధ్య సంతతి నా శించి వచ్చినావు గాన
దారుణ కర్ములు పుత్రులు ఇరువురు పుట్టెదరు నీకు"
అను ఆ ముని వాక్యములకు కైకసి వ్యాకులము చెంది
"వేల్పువంటి మహామునిని వరియించిన సాధ్వి నేను
క్రూరులైన పుత్రుల నే కనుటా యిది ఏమికర్మ ?
కనికరించు నాథా !" అని కాళ్ళ వేళ్ళ బడి వేడగ
తొలుత పుట్టు యిరువురకేది తప్పదు తప్పించలేను
తృతీయుండు పరమభక్త భాగవతుండౌతాడనె—
కైకసి కడుపున వరుసగ రావణుండు, కుంభకర్ణ,
విభీషణ, శూర్పణఖ. కుంభీనసి పుట్టినారు—

## రావణు తపస్సు

కుబేరుండు ఒక దినమున కన్న తండ్రి కడకు వచ్చె
కైకసతని తేజస్సుకు కడు అబ్బురమును చెంది
సవతికొడుకు వైశ్రవణుని రావణునికి చూపించి
నీవు కూడ అంతవాడ వవ్వాలని కోరింది—
అతనితో సమానమేటి ! అధికుడనయ్యేద చూడని
తమ్ములతో రావణుండు తరలెను గోకర్ణానికి
ప్రాణాయామము ప్రత్యాహార ధారణలబూని

యమ నియమాసనములతో ధ్యాన సమాధుల మునిగి
వీరతపము సాగించిరి పదివేలుగ వత్సరాలు
తపము కఠోరముగ జేసి రావణుండు తన శిరముల
హోమగుండ మందు వేసి వ్రేల్చెను వరుసగ తొమ్మిది
పదవతలను ఛేదించుట కుద్యుక్తుడు కాగానే
బ్రహ్మ వచ్చి మెచ్చితి నీ కేమి వరము కావలెనన
"తృణ ప్రాయులు నరవానర జాతుల నే సరకుగొనను
గరుడులు, నాగులు, యక్షులు, దేవత రాక్షస గణముల
వారిచేత మరణముండ రాదు నాకు" అని కోరెను
తథాస్తనుచు స్వయంభువు తలలు తిరిగి ప్రసాదించె—
కుంభకర్ణ! నీకేమిటి కావలె తీర్చెదననగా
సురలందరు హడలిపోయి గీర్వాణిని వేడుకొనిరి
శారదతని నాలుకపై చేరెను తడబడెను మాట
ఆఱునెలలు భోజనము ఒక్కరోజు నిద్రనుటకు
ఆఱునెలలు నిద్ర ఒక్క రోజు భోజనమ్మనగా
వారిజభవు డట్లే యని విభీషణుని ప్రశ్నించెను
"దేవా నాబుద్ధి యెప్పుడు ధర్మమునందే నిలుపుము"
అన లెస్సని సంతసించి అమరత్వము కూడ నిచ్చె—
పాతాళములో దాగిన దైత్యులకీ వార్త తెలిసి
'జయ హోయ్ నాయక' అంటూ ఉఱుకులతో పరుగునొచ్చి
"మురిపించెడు యీ లంకా పురి మనదే పద" అనగా
అంకెవేసి అసురేశుడు లంకపైన దాడివెడలె
కుబేరుండు పాఱిపోయి శంభుని ప్రార్థింప శివుడు
అలకాపురి వసతినిచ్చి దిక్పాలక పదవొసంగె—

## రావణ పరిణయం

రావణుండు లంకకు రా జ్యాభిషి క్తు డయ్యాడు
దితి పుత్రుడు మయుడు అతని పుత్రిక త్రిభువన సుందరి
ముద్దుగుమ్మ, బుద్ధిమతి, మనోహరి, 'మండోదరి'
ఆ రమణిని రావణుండు పరిణయమాడెను వేడ్కగ—

బలికి మనుమరాలు 'విద్యు జ్జ్వాల' ను కన్యనుదెచ్చి
కుంభకర్ణునకు జీవిత భాగస్వామిని జేసెను—
గంధర్వుడు 'శైలూషుడు' కొమరిత 'సరమ'ను తమ్ముడు
విభీషణుని పత్ని జేసి వివాహమ్ము గావించెను—

కాలకేయ వంశజుడగు 'విద్యుజ్జిహ్వు'న కిచ్చి
సోదరి శూర్పణఖ పెళ్ళి సాదరముగ జరిపించెను—

'మధువు' అనే అసురవరుడు ముదమున 'కుంభీనసి'ని
లేవనెత్తుకొని పోయెను రావణుండు దండెత్తెను
'కుంభీనసి' ప్రార్ధనవిని కనికరించి విడిచిపెట్టె—

## మేఘనాధుని జననం

మండోదరి గర్భిణియై మగబిడ్డను ప్రసవించగ
పుట్టగనే మేఘముపలె ఉఱుముల గర్జించెనతడు
అది విని అందఱు ఆతని మేఘనాధుడన్నారు—

## ఇంద్రజిత్తు విజయం

వరగర్వముతో అసురుడు రావణుండు బయలు దేఱి
దేవర్షుల బ్రహ్మర్షుల కిన్నర కింపురుషాదుల
ముల్లోకంబులవారిని తల్లడిల్ల జేయసాగె

కూడదంచు కుబేరుండు భ్రాతృప్రేమ కబురుపంప
భ్రష్టా ! నోర్మూయమనుచు దౌష్ట్యముతో కత్తిదూసి
పుష్పక విమానమతని నుండి బలిమి లాగుకొనియె—
దీనితోడ తృప్తిపడక దేవేంద్రుని జయించుటకు
స్వర్గముపై దండెత్తగ సురపతి ఓడించుట విని
ఉగ్రుండై మేఘనాథు డుఱుములతో పరుగునొచ్చి
ఘోర యుద్ధమొనరించి ఇంద్రుని బంధించి తెచ్చె
నాటి నుండి ఇంద్రజిత్తు గామాఱెను అతని పేరు
ఇది విని హిరణ్యగర్భు డింద్ర జిత్తు చెంతకొచ్చి
కోరిన వరములనిచ్చి సురరాజును విడిపించెను—

## నందీశ్వర శాపం

కొడుకు బలము తోడయ్యెను నేడు రావణాసురునకు
గర్వముతో కైలాసపు గిరిని చేత పైకెత్తి
నందీశ్వరు నీసడించి పరిహాసము చేయబోవ
నరవానర యోధులచే నిహతుడవగు మని శపించె—
'నికృష్టులు నరవానర జంతువులా నను చంపుట !'
అహ్హాహ్హా అని నవ్వుచు అవహేళన మొనరించి
కన్ను మిన్ను గానకుండ కిష్కింధకు దాడివెడలె—

## వాలి సుగ్రీవుల వృత్తాంతము

కిష్కింధకు చక్రవర్తి వానర రాజగు వాలి
వాలి చాల బలవంతుడు వాని జననమే చిత్రము
సర్వదేవతల వాసము మేరు పర్వతము అందు

మధ్య శిఖరమే బ్రహ్మకు మహా సభామందిరము
చతుర్ముఖుండొకనాడు యోగముద్ర లోనుండగ
బ్రహ్మానందము పొందెను బాష్పమ్ములు జాలువారె
కరమున వానిని బట్టి కించిత్ ఆలోచించి
నేలపైన విడువగ ఆ నీరు వానరుండాయెను
వత్సా నీ పిచ్చటనే విహరించుచు వినోదించు
నీకు శుభము కలుగునంచు నలువాశీర్వాద మొసగె—

వానరు డొక నాడొంటిగ వనమున తిరుగుచు నుండగ
శిలల మణుల శోభిల్లెడు స్వర్ణ సరోవరము గాంచె
దప్పిక గొని దానిలోని నీరు త్రాగుటకు వంగగ
ఆతని ప్రతి బింబమందు మరోకోతిగా కనబడె—

దానిబట్టగావలెనని వానరు డందున దూకెను
చిత్రము! పైకొచ్చుసరికి సుందరాంగిగా మారెను—

సత్యలోకమున కేగెడి సురరాజా సమయమందు
దారిలోన యీ మెనుగన కామోద్రేకము పొంగగ
స్ఖలనంబై వీర్యమామె శిరమునబడి నేలజారె
ఆ వీర్యము నుండి పుట్టె నీ వాలి బలశాలి—
అంతలోన అటు వచ్చిన అర్కుడామె అందమునకు
స్ఖలించంగ ఆమెవక్ష స్థలము మట్టి వసుధనంటె
దానినుండి మహోవీరు డుద్భవించె సుగ్రీవుడు—
పసికందులతోడనామె నిశిరాగా నిదురపోయె
తెల్లవారి చూడగనా నాతి కోతిగా మారెను

పూర్వ రూపమును పొందిన కపివరుడా కొమరులతో
పరమేష్టిని దర్శించగ పితామహుడు వానరుని
రాజుచేసె కిష్కింధకు రాజ్యము పాలించుమని
కాలాంతరమున కొడుకు వాలి పాలనమునకొచ్చె—

విక్రముడతి పరాక్రముడు బాహుబలుడు బలాఢ్యుండు
యోధుండగు వాలితోడ రావణుండు తొడ గొట్టెను
ఆసమయము నందు వాలి సంధ్యోపాసన నుండెను
ఇదే అదనుగా నెంచి ఆతని భుజముల సందుకు
హస్తములను పోనిచ్చి అదిమిపట్ట ప్రయత్నింప
పసిగట్టిన వాలి చంక గట్టిగ నొకమారు నొక్కె
కీచు మంచు గతిగానక గిజగిజలాడుచు దనుజుడు
నీ [1]బాంచను [2]కాల్మొక్తా నంచు వాలి శరణు వేడ
కరుణించిన వాలి మైత్రి కరమందించెను వానికి—

ఈ రీతిగ జరిగినట్టి చరితను దర్శించి స్రష్ట
నేడాతని సంహరింప నారాయణుడే దిక్కని
దేవతలందరి తోడను పీతాంబరు కడకరిగెను—

## విష్ణుమూర్తి అభయం

"నారాయణ వాసుదేవ మధుసూదన త్రివిక్రమ
హృషీకేశ పద్మనాభ దామోదర సంకర్షణ
ప్రద్యుమ్నా అనిరుద్ధా అధోక్షజా నారసింహా
పురుషోత్తమ జనార్దనా అచ్యుత కేశవ మాధవ"
అని నుతించి ప్రణమిల్లి వినిపించెను ధాత్రి వెతలు

అసురరాజు రావణుని అకృత్యములకు భువిపై
అడ్డు ఆపులేనందున అలమటించి పోతుంటిమి
స్వామీ రక్షింపు డనుచు సాష్టాంగముగా పడిరి—

హరి లెమ్మని ఆదరమున వారి కభయమిచ్చి పలికె
పూర్వము కశ్యపుడు నన్ను పుత్రునిగా వరము బడసె
ఆ కశ్యపుడిప్పుడు భువి దశరథునిగ జనన మందె
అతని కొడుకుగా పుట్టి మీ వెతలను కడతేర్చెద
యోగమాయ జనకునింట సీతగ జన్మించ గలదు
వానర యోనుల యందు విరివిగ మీ అంశలతో
వీరుల నుత్పత్తి చేసి పోరున సాయపడుండన
సై యని జై జైయంటూ సురలు తరలి వెళ్ళారు—

ఆధ్యాత్మగేయ రామాయణం
పూర్వకాండ సమాప్తం



# బాలకాండ

## పుత్రకామేష్టి

దశరథుడను మహారాజు అయోధ్యాధిపతి వీరుడు
త్రిభువనముల సత్యవచను డను కీర్తిని పొందినాడు
కానీ బిడ్డలు పుట్టక కులగురువు వశిష్ఠువేడ
'రాజా ఏల విచారము ? ఋష్యశృంగు రప్పించి
సంతు కొఱకు నీవు పుత్ర కామేష్టిని జరిపించిన
విక్రమ సంపన్నులైన వీరులు పుట్టెదరు' అనెను —

ఋష్యశృంగు ప్రార్థింపగ వచ్చి పీఠమధిష్ఠించె
వశిష్ఠాది మహర్షులు, ఋత్విజులు, మునిశ్రేష్ఠులు
యాగము నిర్విఘ్నముగా పరిసమాప్తి గావించిరి—

హోమగుండ మందునుండి హుతాశనుడు ప్రసన్నుడై
పాత్ర నిండ పావనమగు పాయసమ్ము నింపితెచ్చి
"వరప్రసాద మిది రాజా ! పరమాత్ముడు పుట్టునీకు
దీనిని నీ సతుల కిచ్చి తినిపింపుము" అని యిచ్చెను
దశరథుడా పాయసమును దేవేరుల కివ్వ బిలువ
వచ్చిన కౌసల్య, కైక లకు పంచెను చెఱిసగముగ
ఇంతలోన సుమిత్రయు సంతానార్థియి రాగా
తన భాగములో సగము నామెకిచ్చె కౌసల్య
కైక కూడ ప్రేమతోడ తన భాగము సగమిచ్చెను—

# శ్రీ రామ జననం

పాయసమును భుజియించిన పత్నులు గర్భము దాల్చిరి
పదియవ నెల దొల్లబడెను ప్రసవించెను కౌసల్య
నీలమేఘవర్ణముతో నాలుగు భుజములు కలిగి
శంఖచక్రగదా పద్మ వనమాలాభూషితుడై
చైత్ర శుక్ల నవమినాడు రవి మేషము నందుండగ
నక్షత్రము పునర్వసు కర్కాటక లగ్నమందు
కమల నాభుడుద్భవించె కౌసల్యా గర్భమ్మున—
పరమాత్మని చూసి తల్లి ప్రేమమీర ముద్దాడి
'దేవ దేవ నమస్తేస్తు శంఖ చక్రగదాధరా
పరమాత్మాఒచ్యుతోఒనన్త పూర్ణస్త్వం పురుషోత్తమ'
దేవా నీ దివ్యరూప సందర్శన భాగ్యముతో
తరించింది నాదు జన్మ తరతరాల కోర్కెదీఱె
లోక సంగ్రహమ్మకొఱకు నా కడుపున పుట్టితివా!
నా స్తన్యము గ్రోలి తండ్రి నా ఆర్తిని దీర్చుమనగ
ప్రసన్నుడై నరాకృతిని ప్రాకృతినిగ హరిమారెను—
రమ్య మంగళాకారము బుష్యానంద స్వరూపము
రమ యతి ఇతి రామ గనుక రామాయనె వశిష్ఠుండు-
హరిణేక్షణ కైక కూత భరతునిగనె సంబరాన
భారము న్వహించు వాడు కాగలడని భరతుడనిరి—
కడమ భార్య సుమిత్రకును కడుపుపండె కవలలగనె
లక్ష్మణ శత్రుఘ్నులనుచు నామకరణములు జేసిరి
సల్లక్షణ సమున్నతుం డౌ నని లక్ష్మణుడనిరి

శత్రు హంతకుండగునని శత్రుఘ్నుం డని పిలిచిరి
కౌసల్యా సగభాగము కైకేయీ సగభాగము
ఇరుభాగములకు ఆమెకు ఇద్దఱు బిడ్డలు పుట్టిరి—

కౌసల్యా భాగమునకు లక్ష్మణు డుదయించినాడు
అందుకె కౌసల్య సుతుని అనుసరించె లక్ష్మణుడు—

కైకేయీ భాగమునకు పుట్టిన శత్రుఘ్నుండు
కైకబిడ్డ భరతునికి మిత్రపాత్రుడయ్యాడు
ఆయినను నలుగురు బిడ్డల దొకే మాట ఒకేబాట
ఆట పాటలన్నింటను అన్నమాటె దాటని గిరి—

కౌమారము సమీపింప ఉపనయనము జరిపించిరి
వశిష్ఠుండు గురువుగాగ వివిధ విద్యలను నేర్చుచు
ప్రత్యూషమ్మున లేచి ప్రాతఃవిధిగా రాముడు
పిత్రాదుల పూజించి పురజన సంక్షేమ మరసి
తరతమములు లేక జనుల తలలో నాల్కై మెలగగ
సకల సద్గుణాభిరాము డహో మాదు భావి ప్రభువు
అనుచు ప్రజలు శ్రీరాముని వేనోళ్ళను పొగడుచుండ
మహారాజు మది ముదమున మురిసి పరవశించుచుండె—

## విశ్వామిత్రుని ఆగమనం

కౌశికుడొకనాడు రామ దర్శనమును కాంక్షించి
సాకేతకు విచ్చేయగ స్వాగతమని దశరథుండు
అభివాదముచేసి అర్ఘ్య పాద్యాదుల పూజించి
వచ్చిన కారణ మడుగగ విశ్వామిత్రుడు చెప్పెను—

'పితృదేవ గణప్రీతికి క్రతువును ప్రారంభించితి
'మారీచ', 'సుబాహు'లనెడు రాక్షసులిరి పాడుచేయ
వచ్చుట గమనించి వారి వధసేయగ వలసియుండె
రామలక్ష్మణుల యాగము రక్షింపగ పంపుమయ్య'
అను మాటల కులికిపడి ముని వశిష్ఠు సంప్రదింప
వశిష్ఠుండు గతకాలపు దేవరహస్యము తెలిపెను
'శృణు రాజన్ దేవ గుహ్యం గోపనీయం ప్రయత్నతః
రామో నమానుషోజాతః పరమాత్మా సనాతనః'
"బ్రహ్మ ప్రార్థనమ్ము విని భూభారము తొలగింపగ
నారాయణు డీ జగతిని శ్రీరాముడుగా పుట్టెను
గతకాలము నందు నీవు కశ్యప ప్రజాపతివి
నీదు భార్య కౌసల్య నాటి 'అదితి' పృథ్వీశా!
మీకు బిడ్డగా జనింప మురహరి నానాడు కోర
నాటివరము నెఱవేర్చగ నేడు పుట్టె మీ బిడ్డగ
లక్ష్మణునిగ పుట్టినట్టి పుత్రుడాది శేషుండు
శౌరి శంఖ చక్రములే భరతుడు శత్రుఘ్నుండును
యోగమాయ సీతగ జన్మించె మిథిల జనకు నింట
సీతారాముల కిప్పుడు సంధానము జరుపుటకై
గాధి తనయు డరుదెంచెను గోపనీయ మిది రాజా"—
అనగా విని దశరథుండు తనయుల దరిజేర్చుకొని
మూర్ధాఘ్రాణమ్ము చేసి మునివరునకు ఒప్పగించె—

### తాటక సంహారం

కొంత దూరమేగగ ముని చింతజేసి బాలకులకు
క్షుత్ పిపాస నాశక బల అతిబల విద్యలు నేర్పెను

రయమున గంగను దాటిరి రక్కసి తాటకి వనమది
"అత్రాస్తి తాటకానామ రాక్షసీ కామరూపిణీ
బాధతే లోక మఖిలం జహితా మవిచారయన్"
సకల పాతకీ తాటకి సాధుహింస సలుపుచుండె
పాపభీతి వలదు ఆమె పాపదర్శినీ దుర్ముఖి
విల్లునెక్కు పెట్టు మంచు విశ్వామిత్రుడు పలుకగ
ధీరుడు రాముడు పెద్దగ ధనువున టంకృతి చేసెను—

కోపముతో రాకాసి క్రూరాకృతి భీకరముగ
జడలు విరియబోసుకుని అడవంతా దద్దరిల్ల
వికటాట్టపు హాసమ్ముల వికృతమగు చేష్టలతో
విచ్చుకత్తులను బూని వచ్చుచుండ రఘురాముడు
గుఱిగా బాణము వదిలెను గుండెకు తగిలెను సూటిగ
అంతే హా రామాయని నెత్తుఱు కక్కుచు చచ్చెను—

విస్మితుడై ముదముతోడ విశ్వామిత్రుడు రాముని
శిరమును ముద్దాడ సమ స్తాస్త్ర విద్య లెఱిగించెను—

## సుబాహు వధ

రాజర్షగు మునివరుండు, రామలక్ష్మణులు ముప్వురు
సుప్రభాత మగుసరికి సిద్ధాశ్రమమును జేరిరి
వీరలు పహారా నిలువగ విశ్వామిత్రుడు యజ్ఞము
ప్రారంభము గావించెను పిశాచాల కది తెలిసెను
మధ్యాహ్నము కాగనే మారీచ, సుబాహులొచ్చి
ధారగ పైనుండి వ్యర్థ పదార్థముల వెదజల్లుచు

రక్తం, మాంసం, ఎముకలు జోరుగ కురిపించుచుండ
ధనుర్ధారి శ్రీరాముడు ద్విశరముల సంధించెను —
విచిత్రముగ ఒక బాణము వాయువేగమున ధీకొని
నూఱుయోజనముల వఱకు మారీచుని విసరివేసె
ఆ విసఱుకు మారీచుడు అంభోరాశిని పడెను
ద్వితీయాగ్ని మయ బాణము సుబాహుణ్ణి వధించెను
తక్కిన రాక్షసులంపఱ లక్ష్మణుండు హతమార్చెను
జగాకంటకుల జంపి యాగరక్షణము జేసిన
రామలక్ష్మణుల శిరముల రాలెను దివినుండి పూలు—
మూడురోజు లనంతరము ముగ్గురు పయనం బాయిరి
దారిని విశ్వామిత్రుడు శ్రీరామా ! అని పిలిచి
"దర్శించే కార్యమిపుడు దిఙ్మాత్రముగా తెలిపెద
మిథిలానగరము జనకుని రాజధాని మనగమ్యము
జనకు నింట మహేశ్వరుడు తన చాపము నుంచినాడు
వీరులైన వారలకు దర్శనీయ మాధనుస్సు"
అని చెప్పుచు నడచుచుండ అహల్యాశ్రమము వచ్చెను—

## అహల్యా శాప విమోచనం

అదిగో గౌతమపత్ని అహల్యచట శిలగ నుండె
మధురమైన ఫలపుష్పము లెన్నో ఆ సీమనుండ
మృగములునూ, పక్షులునూ దరిదాపులరాకుండెను
విచిత్రముగ నున్నదనుచు విస్మయము మందెను రాముడు
వెనుకనున్న వృత్తాంతము విశ్వామిత్రుడు చెప్పెను —

"విశుద్ధుండు గౌతముండు ప్రసిద్ధుండు మునిశ్రేష్ఠుడు
సర్వధర్మశాస్త్రకర్త స్వీయాచరణ ప్రవక్త
అతని బ్రహ్మ చర్యమునూ, అద్వితీయ తపము మెచ్చి
బిడ్డనహల్యను యిచ్చి బ్రహ్మ వివాహము చేసెను
అతిలోకపు సుందరి ఆ అహల్యతో గౌతముండు
స్వీయాశ్రమ మందిచ్చట సుఖవాసము చేయుచుండె—

సంక్రందనుడా సుందరి చూసి కామ మోహితుడై
గౌతముడొకనాడు లేచి గృహమువీడి చనగ చూసి
అతనిరూపు దాల్చిఆమె ననుభవించి చనుచుండగ
సరిగా ఆ సమయానికి గౌతముడేతెంచి చూసి
ఎవడవురా దుర్మార్గా! నారూపము ధరించావు?
అధమా! అనృతమాడిన అధోలోకమే ప్రాప్తి
అన నింద్రుడు భీతిలి తను దేవరాజునని చెప్పి
రక్షించుము నీచకార్య మొనరించిన దుష్టుడనన
కోపముతో గౌతమముని శపించెనా శచీపతిని
యోనిలంపటమున దగిలి మునిపత్నిని రమించావు
కావున నీ దేహమంత వేయి యోను లగుగాకని—

గడగడ వణకుచు కంపిత గాత్రముతో ఎదుటనున్న
సతినికూడ విడువకుండ శాపమిచ్చె నీరీతిని
దుర్వృత్తికి పాలుబడిన దుష్టురాల! భ్రష్టురాల!
ఆశ్రమమున పాషాణము నాశ్రయించి పడియుండుము
శీతాతప వాతాగత బాధలన్ని భరించుచూ

పరమేశ్వరు ధ్యానించుచు పశ్చాత్తప్తవు కమ్మ
ఈ ఆశ్రమ మికనుండి జంతు పక్షి హీనంబగు
రాముడు సోదరుని గూడి రాగలడొక నాడిచటకు
నీకాశ్రయమైన శిలకు వాని పాదధూళిసోకి
నీపాపము నాశాపము అన్ని పటాపంచలగును
అని వచించి శాపవిమో చనముగూడ ప్రసాదించి
హిమవత్ పర్వతశ్రేణుల తపమునకై తరలిపోయె—
నాటినుండి ఆమెఇచట ఏప్రాణికి కనిపించక
శిలారూపిణిగ మారి ఆశ్రమమున పడియున్నది"
నీ పాదాంబుజ స్పర్శను శాపవిమోచన మొసగన
అమ్మా! నే రాముండను అభివాదము తల్లీ! అని
అడుగిడ నా పాషాణము అహల్యగా మారిపోయె—
గౌతమముని వాక్యమ్ములు స్మృతి పథమునగోచరింప
జగన్నాథ! నీదుపాద పద్మధూళితో నేను
చరితార్థత చెందినాను పరమాత్మా ప్రణుతులివే
"నమస్తే పురుషాధ్యక్ష! నమోస్తు భక్తవత్సల!
నమస్తేస్తు హృషీకేశ! నారాయణ నమోస్తుతే"
అని రాముని ప్రస్తుతించి ప్రదక్షిణలు గావించి
రామాజ్ఞను పొంది భర్త ధామానికి వెడలిపోయె—
'ఇక మన గమనము మిథిలకు' అనుచు ముందు ముని నడువగ
రామలక్ష్మణులు ఆతని అనుసరించి పోసాగిరి
దారిలోన భాగీరథి దాటవలసి వచ్చినది
నావికుడా రాఘవుని నావనెక్కనీయననెను—

ఏమన 'ఇతడడుగిడగా నావనాతిగా మాఱిన
బాబో నా బ్రతుకంతా నాశనమైపోతుంది
నావలేక నాపిల్లల పెంచలేను బాబయ్యా
మొన్న నితని పాదస్పర్శ రాతినాతి చేసెనట
కర్రముక్క యిది యెంత! బుర్రున బుల్లెమ్మయితే!'—
'మరి ఏవిధి నది దాటుట?' అని ముని ప్రశ్నింపగనే
'స్వామీ ఆ ప్రభుపాదము ధూళి నన్ను కడుగనిండు'
అని నిషాదు డను మాటల లోని భావమును గ్రహించి
రామ పాద పంకజముల ప్రక్షాళన కనుమతించె
భక్తిని పాదములు కడిగి నీళ్ళు శిరముపై జల్లుకు
ప్రేమ రామ చరణాలకు మ్రొక్కి రేవు దాటించెను—
కోసల రాకుమారులు కుశికుని తనయుని వెంబడి
మిథిలచేరి మునులు వాస ముండుచోట కేగ వారు
స్వాగతమొసగిరి పెద్దగ విశ్వామిత్రుని రాకకు—
జనకునికీవార్త తెలిసి జనులందఱి తోడవచ్చి
ప్రణామమ్ము లాచరించి పూజించెను ప్రశ్నించెను

## శివధనుర్భంగం

'వేయి సూర్యకాంతులతో వెలుగుచున్న వీరలెవరు?
నరులా సురులా నిజముగ నరనారాయణులా వీరు?'—
'దశరథ పుత్రులు వీరలు రామలక్ష్మణులు వీరలు
నాదు యజ్ఞ సంరక్షణ కొఱకు వీరి దెచ్చుకొంటి
పరిమార్చెను తాటకిని, మారీచుని తఱిమికొట్టె

మట్టుబెట్టి సుబాహుని  మనిషినిజేసె నహల్యను
నీదరి ఈశ్వర చాపము  సందర్శించగ వచ్చిరి
శివధనుస్సు తెప్పించి  సోదరులకు చూపుము' అనె—

తోడనె జనకుడు మంత్రికి  తెప్పించగ ఆనతిచ్చి
'రాముండా ధనువునెత్తి  నారిని సారించినచో
సద్గుణ ఖని నాదు పుత్రి  సీతనిచ్చి పెండ్లిజేతు'
అనుచుండగ ఐదువేల  బలశాలురు మోసుకొచ్చి
పశుపతి చాపమ్ము సభా  ప్రాంగణమున నిలబెట్టిరి—

ధనువు చూడ శ్రీరాముని  దేహమంత పులకరించె
కట్టు పంచె బిగగట్టి  ధనువు నెడమచేతబట్టి
విలాసముగ పైకెత్తి  విల్లుకు నారిని కట్టెను
అంతే బ్రహ్మాండమంత  బ్రద్దలైన శబ్దమాయె
ఫెళఫెళ ఆర్భటులతోడ  ఫెళ్ళున విఱిగెను ధనుస్సు
రాముడు సామాన్య రాజ  కుమారుడా! కాదుకాదు
సాక్షాత్ నారాయణుడని  సభికులు జేజేలు పలుక
కరకంకణ గలగలలు  చరణ కింకిణులు మ్రోయగ
మధుర స్వనము వినిపించగ ముగ్ధమోహనాకృతితో
ఉప్పొంగెడు హృదయముతో వికసిత వదనమున సీత
బంగరు పూమాల దెచ్చి  రాముని మెడలోవేసెను
దేవ దుందుభులు మ్రోగెను  సుమవర్షము కురిసెనపుడు—

## సీతాకళ్యాణం

జనకుని ప్రార్థన విని ముని  దశరథునకు లేఖవ్రాసె
జరిగిన దంతయు తెలుపుచు  పరి జనములతోరమ్మని—

బంధుమిత్ర సకుటుంబము సపరివార సహితముగా
మంత్రులు సామంతులతో మిథిలకు దశరథుడువచ్చె
మేళతాళ సన్నాహము తోడజనకు డెదురేగి
యథావిధిగ పూజించి ఇంటికి తోడ్తెచ్చినాడు
రామలక్ష్మణులు తండ్రికి తల్లులకూ వంగి మ్రొక్క
ముదమున వారలు బిడ్డల మూర్ధమ్ముల ముద్దులిడిరి
విశ్వామిత్ర, వశిష్ఠుల, శతానంద. యాజ్ఞవల్క్య
సన్మునిశ్రేష్ఠుల నెల్లర సమ్మానించెను జనకుడు—

## సీత గతం

"యజ్ఞభూమి విశుద్ధ్యర్థ్యం కర్షతో లాంగలేనమే
సీతాముఖా త్సముత్పన్నా కన్యకా శుభలక్షణా"

'యజ్ఞము చేయంగదలచి నేల శుద్ధిచేయుకొఱకు
భూమి దున్నుచుండనాడు విభ్రాంతిని కలిగించుచు
రత్నఖచిత పేటికొకటి నాగేటికి తగులుకొనెను
తెఱచి చూడ శుభలక్షణ కన్యక కన్పించినది
శరత్కాల చంద్రునివలె చూడ ముచ్చటగనున్నది—
ముద్దులొలుకు నాబాలిక పుత్రికగా పెంచుచుండ
నారదుడొకనాడు వీణ మీటుకొనుచు [3]ఈడకొచ్చి
పరమాత్ముడు భువిమాయా మానుష రూపమునెత్తెను
మాధవునీ మహామాయ శక్తియె నీ పుత్రి సీత
ఇరువురి కళ్యాణమునకు సంఘటనను కల్పించుము
దేవరహ స్యమ్మటంచు దీవనలందించి వెడలె
అప్పటినుండియు సీతను అచ్యుతసతి లక్ష్మిగనే
భావించుచు ముదముతోడ మాయింటను పెంచుచుంటి—

త్రిపురాసుర సంహారము గావించిన పిదప హరుడు
తన ధనుస్సు భద్రముగా మత్పితరుల యింటనుంచె
దాని నెత్తగలుగు వాడు విష్ణువొక్కడే గావున
ఆ ధనువును ఎక్కుపెట్ట గలుగువాని కయోనిజను
పరిణయమ్ము సేతునని ప్రకటించితి నతనికొఱకు
నేటికి నావాంఛదీరె మీ అందఱి దయవలన"
అనుచు సీత గతము తెలుప అందఱు సంతోషించిరి—

వైవాహిక మంటపమున హోమాగ్నిని రగిల్చిరి
సర్వాభరణ విభూషిత సీత శోభతో మెఱయగ
పెండ్లిపీటపై రాముని ప్రక్కను కూర్చుండబెట్టి
శ్రీరాముని పాదమ్ములు జనకుడు కడిగెను స్వయముగ
సీత హస్తమును రాముని హస్తములోనుంచి మదిని
'ప్రీతోభవ' యంచు వధూ వరులను దీవించినాడు
పాణిగ్రహణమహోత్సవము కనుల పండువుగ జరిగెను
దివ్యులు దివినుండి పూల వానజల్లు కురిపించిరి—

## అప్పగింతలు

జనకుని ఔరస పుత్రిక ఊర్మిళ లక్ష్మణుని కోరె
తమ్ముడు కుశధ్వజు కూతులు శ్రుతకీర్తి, మాండవిలు
శత్రుఘ్నుడు, భరతులకు సరిజోడన శుభమనిరి—

నూఱుకోట్ల దీనారము లార్వందల ఏనుగులను
తురగములను రథములను లక్షపైన పదాతులను
అవసరమగు దాసీలను ఆరణమిచ్చె జనకుండు—

కూతుల సయోధ్యకంపు అంపకముల దశవచ్చెను
అనుబంధము త్రెంచుకొనుచు అత్తింటికి పంపునపుడు
తలిదండ్రుల వేదన అతి హృదయ విదారకమెగదా!—
పుట్టిల్లును, తల్లులనూ, ప్రియ జనకుని విడువలేక
కండ్లనీరు గ్రుక్కుచున్న కూతురు సీతను గాంచిరి
తల్లులు ఓదార్చి ప్రీతి గాఢాలింగనమొనర్చి
'అను నిత్యము శ్రీరాముని కనుసన్నల మెలగుమమ్మ
పతివ్రతగ పేరొందుము ప్రజ మన్నన లందుకొమ్మ'
అని బిడ్డను దీవించి అప్పగించి రత్తలకు
మంగళ వాయిద్యమ్ములు మారుమ్రోగె బయలుదేర
అందరు సంభారముతో అరదము లధిరోహించిరి—

## పరశురామ గర్వభంగం

మిథిలను వీడ్కొలందుకు మూడు యోజనములురాగ
ఆపద సూచించు పక్షి లరువసాగె అంబరాన
ఇంతలోనె పెనుగాలి వింతగ విజృంభించెను
ధూళిఎగసి కనులకప్ప త్రోవ తెలియ రాకుండెను—
తోడనె ఒక దివ్యమైన తేజము దూసుకు వచ్చెను
ఆతేజము పరశురామ ఆగమనము సూచకము—
కారుమేఘముల చీల్చుకు క్రూర రౌద్ర రూపముతో
ఒడలెల్లా జడలు కప్ప పరశువు పాణిని ధరించి
పరశురాముడేతెంచెను ప్రళయ మృత్యువుగ నిలిచెను
మునినిగాంచి దశరథుండు ముకుళిత హస్తములతోడ
కాళ్ళనుబడి పుత్రభిక్ష పెట్టుమంచు వేడుకొనెను—

దశరథు దీనాలాపము సరకుగొనక శ్రీరాముని
క్షత్రియాధమా! నేను జమదగ్నికి కుమారుండ
రాముండను నేనుండగ నానామము ధరింతువా?
పాతబడ్డ చాపమొకటి విఱిచి ఘనుడననుకొంటివ?
నీవే నిజముగ క్షత్రియ పుత్రుడవైతే రమ్మ
ఈనా వైష్ణవ చాపము అల్లెత్రాడు కూర్చుమనగ
ధనువందుకు తెప్పపాటు లో బాణము సంధించెను—

రాముని బలశక్తి చూసి నివ్వెఱపడి భార్గవుండు
చేష్టలుడిగి కొయ్యబారి నిర్జీవునిగా నిలిచెను—
'దశరథరాముని సాయక మమోఘమ్మ పరశురామ
బ్రాహ్మణుండ వగుట నీదు ప్రాణమ్మల నేదీయను
దివ్యలోక ప్రాప్తికొఱకు దీర్ఘతపముతో పొందిన
ఫల మున్నది, నీదుపాద ద్వయమున్నది నాశరముకు
బలియివ్వక తప్పదొకటి ఎయ్యది కావలెనీకు?'
అని పలుకుచు నుండనతని తేజము నిస్తేజమయ్యె
అపుడు పరశు రామునకు గతము తలపునకు వచ్చెను—

## పరశురాముని పూర్వగాధ

బాలుడు భార్గవ రాముడు చక్రతీర్థ మునకువెళ్ళి
చిరకాలము నారాయణు గూర్చి తపము చేయుచుండ
సంతోషించిన విష్ణువు సందర్శన భాగ్యమొసగి
'బ్రాహ్మణుడా! లెమ్మ నీదు భక్తిని నేమెచ్చితిని
నాతేజము నీయందున నిక్షిప్తము చేయుచుంటి
నీదు పితృ హంతకుడగు కార్తవీర్యుని వధించి

క్రూరులుగా భూమిపైన మాఱిన రాజుల నందఱ
ఇరువదొక్కమార్లు వెదకి వెదకి వెదకి వధించుము
త్రేతాయుగమున దశరథ పుత్రునిగా నేపుట్టెద
పరాశక్తి నాకుతోడు భూపుత్రిగ పుడుతుంది
మమ్మిద్దఱ నీవప్పుడు మానవులుగ చూడగలవు
నీకిచ్చిన నాతేజం తిరిగి నాడు గ్రహించెదను
ఆపై తపమును జేసి అమరత్వము పొందెదవు
అని చెప్పిన నాటిమాట జ్ఞప్తికొచ్చి చేతులెత్తి
'అహో రామ దాసోహం నారాయణుడవు నీవు
జలము నుండి పుట్టు నురుగు వేఱుగ జలమున కనబడు
అగ్నినుండి పుట్టు ధూమ మగ్ని భాగమే చూడగ
వేఱుగ నట్లే కనబడు విషయము లన్నీ నీవే
మాయ ఆవరించబడిన మనుషులు గుర్తించలేరు
అజ్ఞానము నశించనిదె నిన్ను తెలియు టసాధ్యము
అదే నేడు జరిగినది నాతప్పును మన్నింపుము'

"నమోస్తు జగతో నాథ ! నమస్తే భక్తిభావన !
నమః కారుణి కానంత ! రామచంద్ర ! నమోస్తుతే"

అని రాముని బాణమునకు అతడు లక్ష్యముగ తనదగు
సర్వతపః ఫలమిచ్చెను గర్వ మడగి గిరులకరిగె

అంతట ఆనందముతో అందఱయోధ్యను చేరిరి__

కైకేయికి సోదరుడు 'యుధాజిత్తు' వచ్చి తనదు
మేనల్లుడు భరతుని తన యింటికి పంపగకోరెను
భరతునితో శత్రుఘ్నుని తోడుగ దశరథుడు పంపె
సీతారాము లయోధ్యను ప్రీతిలయలై మెలగుచుండ్రి—

ఆధ్యాత్మగేయ రామాయణం
బాలకాండ సమాప్తం



# అయోధ్యకాండ

## నారద సందేశం

ఒకనాడా శ్రీరాముడు సుఖాసీనుడై యుండగ
సకలలోక సంచారుడు నారదు డరుదెంచినాడు
"అత స్త్వద్దర్శనాదేవ కృతార్థోస్మి మునీశ్వర"
'నారద! వచ్చిన కార్యము ఎఱిగించుము' అనె రాముడు—
'జాగ్రత్ స్వప్న సుషుప్తి అవస్థలకు అతీతుడవు
నిఖిల చరా చరమంతయు నీనుండే పుట్టి పెరిగి
నీపిలుపే తడవుగాగ లయమందును నీలోనే
అజ్ఞానము నిండి జనులు రజ్జు సర్ప భ్రాంతితోడ
అంతా నేనే అనుకొని గోతిలోన పడుచుందురు
ఆత్మజ్ఞానులు మాత్రమె అహము సర్పమని దలతురు
నాకీ సుజ్ఞానమొసగి నెఱబ్రోచిన నీరజాక్ష
పరమాత్మా! పరంధామ! ప్రణామమ్ము లందుకొనుము
ధరణి భారమును దీర్పగ రావణ సంహారమునకు
ఈ మానుష రూపముతో అవతరించినావు గదా!
రాజ్యం, రమణులగూడి ప్రతిన మఱతువేమో అని
గుర్తుచేయమని పంపెను పితామహుడు నన్నిచటకు'—
"శృణు నారదమే కించిత్ విద్యతే విదితం క్వచిత్
ప్రతిజ్ఞాతం చ యత్పూర్వం కరిష్యే తన్నసంశయాః"
'నారద నేనొచ్చిన పని నిరతము జ్ఞాపకముండును
అభయమిచ్చి అవతరించి నట్టి కార్య మెట్లుమఱతు?

ప్రారబ్ధపు కర్మలన్ని పూర్తిగ నశియించగనే
రావణ సంహారముతో అవనిబాధ తొలగించెద
విరించి నీ సమయమ్మున కోరుచుంటి సాయమ్మను'
అన 'నారాయణ'యనుచు అరిగెను నారదమహర్షి—

## శ్రీరామ పట్టాభిషేక సన్నాహము

ఒక్కనాడు దశరథుండు కులగురువు వశిష్ఠు బిలిచి
'వార్ధక్యము పైబడెను వానప్రస్థ సమయమొచ్చె
జ్యేష్ఠుడు గుణశ్రేష్ఠుడైన రాముని యీరాజ్యమునకు
యువరాజుగ పట్టమునే కట్టదలచితిని వెంటనె
రేపే పట్టాభిషేక మహోత్సవము జరుపుటకై
త్వరితముగా సన్నాహం జరిపించుడు గురుదేవా!
స్వయముగ ఇదిచెప్పి మీరు రాముని ఒప్పింపుడనియె—

ఇంతలోనె మంత్రియైన సుమంత్రుండు రాగ జూసి
గురువు లానతిచ్చినటుల సర్వము సమకూర్చుడనెను—

వశిష్ఠుండు సుమంత్రునకు వలసిన సామగ్రి తెలిపి
శ్రీరాముని సౌధమ్మును సందర్శింపగ నేగెను—

వినయుడైన రామునకు విషయము వివరించి చెప్పి
'నేడంతా సీతతోడ ఉపవాసము నెఱపవలె
నియమ విధుల నెఱవేర్చి నేలపై పరుండవలె'—
అని నిష్ఠలనన్ని చెప్పి తన నివాసమును చేరెను—

ఇంతలోన యీ సంగతి పురమంతకు తెలిసిపోయె
సంతోషముతో కోసల వాసులు గంతులువేసిరి

ఎటుచూసిన తోరణాలు   వినువీధిని పతాకాలు
అయోధ్యలో ఆనందం   అర్ణవమై పొంగుచుండె—

గమనించెడు దేవతలకు   గుండెలు బేజారాయెను
రాముడిచ్చటే ఉండిన   రావణ సంహార మెటుల ?
దీని విఘ్నమొనర్చంగ   దిక్కుతోచకపుడు వారు
సాయపడుము తల్లీ అని   సరస్వతిని ప్రార్థించిరి
భర్తకూడ యీ కార్యము   కర్తవ్యము నీ కనగా
వాణి వారి వినతుల విని   మంథర మనమున దూరెను—

## మంథర దుర్బోధ

చిత్తము మాటిన మంథర   కైకేయిని దర్శించి
నిదురపోవు చుంటివేమి ?   నీ చెవికిది సోకలేద ?
రేపే కౌసల్య బిడ్డ   రాముని పట్టాభిషేక
మని పలికిన మంథరకు   కైక రత్నహారమిచ్చె—

"ఇది ఏమిటి తల్లి నీకు   ఇంత సంతసము తగదు
రాబోవు విపత్తు నీకు   అంతు పట్టకున్న దేమి ?
నీదు భర్త దశరథుండు   ఎంత మాయగాడో చూడు
భరతుని దూరముగ పంపి   భాగ్యము రాముని కిచ్చుట
నిన్ను రాజభోగములకు   దూరము చేయుట కాదా ?
మాటమాత్రమైన నీకు   చెప్పినాడ పిచ్చిదాన
రాముని కిది జరిగిన యిక   భరతుడు పరిచారకుడగు
సవతికి ఆనాడు నీవు   దాసిగ పడియుండవలె
ఇంత పరాభవము కంటె   నిజముగ చావే మంచిది

మంద బుద్ధి వదలిపెట్టి  భరతున కిది కట్టబెట్టి
రాజు మనసు మార్చగ  సమకట్టు వెంటనే తల్లీ" —
"అది ఎట్టుల సాధ్యపడును ?  మంథర ఆలోచించవె" —
"ఆ గుర్తుకు వచ్చినది  ఆ వరములు రెండుకోరు
భరతుని పట్టాభిషేక  మొక వరముగ కోరుకొనుము
రాముని పదునాలుగేండ్ల  వనవాసము మరోవరము" —
"కోరిన తీర్చుట కాతడు  సిద్ధపడక యుండునెడల ?" —
"ఆ భయమ్మ నీకు వలదు  గుర్తుతెచ్చుకొమ్మగతము
దేవాసుర యుద్ధమందు  నీవు చేసినట్టిమేలు
అతని రథము ఇరుసుసీల  విఱిగిపోవ నీ వ్రేలును
రంధ్రములో నుంచి రథము  పడిపోకుండగ జేయగ
మెచ్చిన దశరథుడు నీకు  వరములు రెండీయలేద ?
వాని నేడు కోరుకొనుము  ఇవ్వక తప్పదు వానికి" —
సరే యనుచు కైక కోప  గృహము జేరి నగలుతీసి
నలువైపుల విసిరికొట్టి  మలిన వస్త్రములు గట్టి
నేలమీద పండుకొనియె  కాలనాగువలె బుసతో —

## కైక వరములు కోరుట

కొంత తడవు గడవగ దశ  రథుడు వచ్చె శుభము తెలుప
"ఏదీ నా ముద్దుల రా  ణెక్కడ కనుపించ దేమి! "
దాసీలను పిలిచి మీదు  స్వామిని ఏదని అడిగెను —
కోప గృహమునందు ప్రవే  శించుట చూసితి మనిరి —
వృద్ధరాజు భీతిలి ఆం  దోళన నా గదికి జేరి

దుఃఖించెడు ప్రేయసిగని దేహముపై స్పృశించుచూ
"అలంకార రహితముగా మలిన వస్త్రధారణతో
దుఃఖించగ కతమేమి ? కాంతా నీ కోరికేమి ?
పేదల నెవ్వరినైనా ధనికుల చేయాలందువ ?
ధనమదాంధుడెవడైనా విధము తప్పి చరించెనా ?
వధార్హుణ్ణి ఎవనినైన విడిచి పెట్టకోరెదవా ?
ఎవనినైన వధించాల ? తల తీసెద క్షణములలో
నీవు కోర నా ప్రాణము నైన సమర్పించగలను
నీ వాంఛితమును దీర్చెద రామునిపై ప్రమాణము"—

అన కైకకు చలనమొచ్చె కండ్లనీరు తుడుచుకొనెను
"మంచిది ఈ శపథమ్మును మఱవబోకు మహారాజ
దేవాసుర యుద్ధంబున రెండు వరము లిచ్చినావు
ఆ వరములు నేనప్పుడు కోరుకొనక దాచుకొంటి
కోరుచుంటి నవి యిప్పుడు వెఱచి మాట మార్చబోకు
నా పుత్రుడు భరతుని పట్టాభిషిక్తు జేయవలె
పదునాల్గేండ్లడవికి శ్రీ రాముని పంపగవలెను
తక్షణ మీ రెండువరము లమలునునే కోరుచుంటి"—

ఇది విని ఆ రాజు మొదలు నఱకబడిన వృక్షమువలె
వజ్రాయుధ ఘాతముచే విఱిగిపడిన గిరి చందము
కంపిత దేహమున నేల కూలబడెను దశరథుండు
ముఖమున ఏఱుగపాఱెడు కన్నీరును తుడుచు కొనుచు
"స్వప్నమ ! ఇది మతిభ్రమణమ ! కైకేనా కోరినది !
శ్రీరాముని వనము కంపి నేను బ్రతుకలేను సఖీ !

రాజ్యము నీ పుత్రుకిత్తు సందేహంలేదు నిజం
దేవీ దయతో రెండవ వరము తీసుకో వెనుకకు"
అనుచు సజల నేత్రుండై కైక పాదముల బడియెను —
కైక గుండె కరగ కుండె కర్కశ స్వరమున పలికెను
"రాజా నీ విప్పటివలె కన్నమాటలేమాయెను?
నీ విచ్చిన వాగ్దానం మిథ్యేనా సత్యవాది?
సూర్యోదయ మగుసరికి రాముడు అడవికి పోవలె
అట్లు చేయకున్న నేను ఆత్మాహుతి చేసికొందు" —
కైక కఠిన వాక్యములకు దశరథుడతి దీనుండై
స్మృతి రహితుండగ మ్రాన్పడి భూపతితుండై పోయెను —

## పట్టభంగ రాఘవం

అరుణోదయ మయ్యింది వంది మాగధులు వచ్చిరి
కైక వారి వారించెను కైవారము నిలువరించె —
బయట ప్రజల సంబరాలు జై రామా జై యటంచు
స్త్రీ పురుషులు బాలవృద్ధ భేదమ్ములు లేకుండా
రాముని పట్టాభిషేక వేడుక జూడగ వచ్చిరి
కాని మహారాజేడీ! మేల్కొనలేదా ఏమి!
ఆలోచించి సుమంత్రుడు కైక యింటి కరిగెనపుడు —
'అమ్మా! కైకమ్మా! మన రాజుకేమి జరిగెనమ్మ?'—
'ఏమిలేదు రాత్రంతా రామా రామా యంటూ
కనులు మూయనే లేదు అదే అతని అస్వస్థత'
కనుకాతని సత్వరముగ గొనివచ్చుటె మార్గమనగ

"రాజానతి లేకుండా రామునెట్లు రప్పించుట ?"
అని మనమున సుమంత్రుండు సంకోచించుచు నుండగ
కలవరపడి యున్నరాజు పలవరించె రామా ! అని—

తండ్రి కలవరింత తెలిసి తనయుడు పరుగున వచ్చి
పాదవందనము చేసి పితా ఏమి జరిగెననగ
అతని మోము చూసి రాజు ఆలింగన మొనర్చుటకు
పైకిలేచి పడిపోయెను రాముడు ఒడినడ్డుపెట్టె—

మూర్ఛాగతుడగు రాజును చూసి వికల మనస్కుడై
"దుఃఖ కారణమ్మేమిటి తల్లీ!" అని రాముడడుగ
"నీ జనకుని దుఃఖమునకు నీవె కారణము రామా !
అతని దుఃఖ ఉపశమనము నీ చేతులలో నున్నది
సత్యవాది యగు తండ్రిని సత్యప్రతిష్ఠుని జేయుము—

పూర్వము నీ తండ్రి నాకు వరములు రెండిచ్చినాడు
ఆ వరముల తీర్చుభార మంతా నీపై నున్నది
దాని తెలియజేయలేక లజ్జితుడగు చున్నాడు"—

"అమ్మా ! నా తండ్రికొఱకు విషమునైన మ్రింగగలను
ప్రాణమైన తృణప్రాయము గా త్యజించి అర్పింతును
పితాజ్ఞను తెలుపుమమ్మ శంకలేక పాలించెద"—

## పితృవాక్య పరిపాలన

"భరతుని పట్టాభిషేక మహోత్సవము జరుగవలె
పదునాలుగు వత్సరాలు పెద్దకొడుకు వనవాసము"

అనగానే శ్రీరాముడు చిఱుదరహాసము మెఱయగ
"అంతేనా ! యీ మాత్రము దానికింత చింతయేల ?
అట్లే యీ రాజ్యానికి తమ్ముడు భరతుడె రాజు
వెంటనె నే కాననముల కేగెద సందేహించకు"—

దేహమెల్ల కంపింపగ దశరథు మది ద్రవించగా
కనుల నశ్రువులు జలజల రాలుచుండ రామునితో
"రామా ! నే నయోగ్యుడను వివశుడ స్త్రీవశుడనైతి
నాచిత్తం భ్రమించింది అపమార్గం త్రొక్కింది
నన్ను పరాజితుని జేసి రాజ్యము వశపర్చుకొమ్ము"
అని పెద్దగ విలపించుచు పుత్రుకౌగలించుకొనెను —
"నాన్నా ! దీనికి యింతగ పరితపింప పనిలేదు
నాకూ నాతమ్మునికీ భేదము ఇసుమంత లేదు
మిమ్ము సత్యవచనుచేసి మరలివచ్చెదను వేగమె"
అని తండ్రికి వందనమిడి అంతఃపురమున కరిగెను—

## లక్ష్మణ ఆగ్రహం

`శ్రీరాముడు కౌసల్యకు వనవాసము వివరించగ
విలపించుచు తనయా! నిను విడిచి నేను బ్రతుకలేను
అనుచుండగ లక్ష్మణుండు ఉగ్రరూపుడై వచ్చి
'అన్నా! యిది దారుణము వనవాసమ! పరిహాసమ!
వీ అభిషేకము కాదను వారెల్లర వధించెదను
అనుమతీయుమన్నా' అన అనునయమున రాముడనెను
'లక్ష్మణ! ఆగ్రహము తగదు నిగ్రహమ్ము కోల్పోకుము

# శ్రీరాముని తత్త్వబోధ

కనిపించెడు ప్రపంచమూ యీరాజ్యము యీదేహము
సత్యవస్తువులు కావు ఆ సంపాదన వ్యర్థం—

సర్వ భోగములు మేఘము మెఱపులవలె చంచలము
నిప్పుల కాల్చిన ఇనుమున నీటిబొట్టు చిలికించిన
క్షణములోన మాయమగును ఆయువుకూడా అంతే—

పామునోట బడియు కప్ప పురుగులకై నాల్కచాచు
అట్లే మానవుడుకూడ మృత్యుముఖము నందుండియు
అశాశ్వతపు భోగములకు అఱ్ఱులుచాచుచు నుండును—

భోగాదుల ననుభవింప అహర్నిశలు శ్రమింతురు
అర్థాదుల నార్జించుట కెంతో యాతన పడుదురు
నిత్యమైన జీవునకా భోగాదులు చెందబోవు
నశ్వరమగు దేహానికె యీభోగము యీభాగ్యము
ఏమిటి సాధించినది? కాలము వ్యర్థము అయినది—

అగ్నిలోని దాహమ్మును తెలియక పాపం శలభం
దీపముచుట్టూ తిరుగుచు దానిలోన బడి మాడును—

ఆశతోడ మాంసపు ఎఱ గ్రసించంగ గాలానికి
మీనమ్ములు తగులుకొని మరణము పాలగుచున్నవి—

కట్టెలెన్నొ నదినీటను కొట్టుకు పోతూ పోతూ
ప్రవాహమున అచ్చటచట కలిసి ప్రయాణించుచుండు
కొంత దూరమేగుసరికి దేనికదే విడిపోవును
అదేరీతి సంసారం సాగే సాగరయానం—

దప్పిక గొన్నట్టివారు చలివేంద్రము చెంతజేరి
దాహమ్మును తీర్చుకుని తమతమ దారుల బోదురు
అట్లు చేరినట్టివారె భార్య, బిడ్డ, తల్లి, తండ్రి,
సోదరులూ, బంధువులూ, సహచరులూ, స్నేహితులూ—
శోక సంకులము బ్రతుకు సంసారము ఒక స్వప్నము
స్వప్నమందు కనిపించిన సుందర నగరము నిజమా?—
ఐశ్వర్యము కూడ చూడ సూర్యుని నీడే నిజముగ
ఉదయమందు ముందుండును సాయంత్రము వెనకుండును
పెద్దదగును ఒకసారి చిన్నదగును మరోసారి
అట్లే ఇదియును పెరిగి తఱిగి స్థానభ్రంశ మొందు—
రతిసుఖమూ యవ్వనమూ కలలాగున కరగిపోవు
మాయను నిర్మింపబడిన మట్టిబొమ్మలీ తనువులు
తెలియని మూఢులు దీనిని సత్యమనే భావింతురు—
సూర్యుని రాకను పోకను రోజులు గతియించిపోవు
దినదినమూ తఱిగిపోయి తనువు క్షీణమగుచున్నది
దేహము క్షణభంగురము ముందున్నది ముసలితనము
మృత్యువు వాకిట నిలిచి ముద్దుగ రమ్మంటున్నది
ముసలియగుట మృతినొందుట కనుల చూచుచుండికూడ
మూర్ఖుడైన మానవుడు మోహమందు మునుగుచుండె—
పచ్చికుండలో పోసిన నీటివలే ప్రతిక్షణమూ
ఆయువు తగ్గుచునుండగ ఆలోచించడు చిత్తము!—
అజ్ఞానము సంసారపు బంధానికి కారణము
క్రోధము మోక్షపథానికి విఘ్నము కలిగించగలదు

మాతాపిత వధనుకూడ క్రోధము ప్రేరేపించును
క్రోధము నాశనహేతువు కూడదు ఏ స్థితిని కూడ
సోదర దానిని వీడుము శాంతము అలవరచుకొమ్మ—
తల్లీ! యీచెప్పినది ఎల్లరకూ వర్తించును
విషయ తత్త్వ మర్థమైన వియోగమున విలపింపవు
పదునాలుగు వత్సరాలు పరుగున తిరిగొచ్చునమ్మ
సంతసమున ఆశీస్సుల నందజేసి నన్నుపంపు'
అని తల్లిని ఓదార్చి వందనమ్ము లాచరించ
విజయోస్తని కౌసల్య వీడ్కోలిచ్చెను బిడ్డకు—

## దండకారణ్య ప్రయాణం

'అన్నా! నామది నుండిన సంశయముల దీర్చినావు
ఇప్పుడు నేకోరు కోర్కె తీర్చి ధన్యుడను చేయుము
నేనుకూడ నీతోడను వచ్చుట కానతి నొసగుము
నీవిది వలదని అంటే నాప్రాణము లుండబోవు'
అని పలికిన లక్ష్మణుని వెంటరాగ అనుమతించె—
అనంతరము సీతాంతః పురమున కరిగెను రాముడు
జరిగిన సంగతులు చెప్పి అడవి కేగుచుంటిననగ
శ్రీరాముని మాటలను శ్రద్ధగ విని సీత నాథ!
మీ పయనమునకు నేను అడ్డుచెప్పుదాన గాను
కానీ నన్నిచట విడిచి వెళ్ళుట ధర్మముకాదు
నన్నుకూడ వనములకు మీతోడనె రానిండనె—
'సీతా! ఆ అరణ్యముల నడచుట బహు దుష్కరము
కడుపు నింపుకొన అడవిని కందమూలములె దిక్కు

క్రూరజంతు తతికి ఘోర రాక్షసులకు అది నిలయం
ఆశ్రమముల కోర్వలేవు సుకుమారి ఇంటనుండు'—
'నాథా! మీ అండనుండ రక్షణ భయమేల నాకు?
భోజనమా! మీరు తినెడి దెల్ల నాకు అమృతమే
మీతో దర్భలశయ్యయు మహదానందమె స్వామీ
నాకోరిక మన్నింపుడు కాదని నను చూడరింక—
స్థిరనిశ్చయ మిట్లు తెలుప సీతా! సిద్ధము కమ్మనె—
తుదిసారిగ తండ్రిశలవు పొందగోరి శ్రీరాముడు
సీతా లక్ష్మణ యుతుడై కైక మందిరము వైపుకు
నడివీధిని నడచుచుండ నిరోధించి పురజనులు
కైకా దశరథులపైన కత్తులు దూయగసాగిరి—

## వామదేవ ఉవాచ

ఇది చూసిన 'వామదేవ' మునిశ్రేష్ఠుడు ముందుకొచ్చి
"ఆగుడు ప్రియజనులారా! అవతారుడు శ్రీరాముడు
మత్స్యరూపమును ధరించి 'మనువు'ను రక్షించినాడు
కూర్మరూపమున మూపున 'మంథరము'ను పైకెత్తెను
వరాహముగ రూపమెత్తి ధరను పైకి తెచ్చినాడు
నారసింహుడై హిరణ్య కశిపుని నిర్జించినాడు
వామనుడై జన్మించి 'బలి'ని పాదమున ద్రొక్కెను
క్షత్రియ భూభారమణచ 'పరశురాముడై పుట్టెను
రావణాది రాక్షసులను సంహరింప నేడు పుట్టె
కావున వనమున కేగుట తప్పనిసరి రామునకు
ఎవ్వరినీ నిందింపగ రానిది విధికృతమే యిది"—

అని వారల వారింపగ ప్రజాబంధ విముక్తుడై
దరహాసముతో రాముడు దశరథు సందర్శించి
"జనకా! వన గమనమునకు జనకజ లక్ష్మణులు కూడ
రాదలచిరి పోవననుమ తించి ప్రభూ! మముబంపుడు
అన శోకము అతిశయింప తన్ను నింద జేసికొనుచు
రథము కొఱకు ఆనతిచ్చె దశరథుండు దీనముగా—
రామలక్ష్మణులు సీత రథముపైన వెళ్ళుచుండ
కంటికి మింటికి ధారగ కోసల రాజేడ్వసాగె—
సాగిపోవు రథము చూసి శోకించుచు పురజనులు
సరగున ఆ రథము వెనుక పరుగులు తీయగసాగిరి—
'తమసా' నది చేరి వెనుక తరలివచ్చు వారి చూసి
"సోదరి సోదరులారా! మీ ప్రేమకు జోహారులు
ఇక ముందుకు రావలదు సత్యవాక్కు నిలుపనిండు"
అని చేతులు జోడించి త్వరగ తిరిగి రాగలనన
బరువెక్కిన గుండెలతో ప్రజలు అయోధ్యకు మరలిరి—

## గుహుని ఆతిథ్యం

రథము వేగ మినుమడింప గంగాతీరము చేరెను
'శృంగిబేర' పురమచటికి అతి చేరువలో నున్నది
దాని రాజు 'గుహుడు' సఖుడు మిత్రుడు శ్రీరామునకు
ఎదురు వచ్చి భక్తితోడ సాష్టాంగముగా బడెను
రాజా నీ వెక్కడికో వేఱుగ పోనేల నాదు
రాజ్యమరణ్యము లోనిదె దాని నీవు ఏలుకొనుము
రాజధాని నగరమునకు రమ్మని ఆహ్వానించగ

"నేస్తమ ! పదునాలుగేండ్లు నగరము, గృహము నిషేధము"
అని మృదువుగ ఎఱుకజేసి మఱ్ఱిపాలు తలరాసుకు
జడల ముడుల బంధించెను లక్ష్మణు డట్లే జేసెను—

రాత్రికి జలముల త్రాగి దర్భలపై నిద్రించగ
ధనుర్బాణముల ధరించి లక్ష్మణుండు కాపుండెను
తెల్లవారగా రాముడు కాలకృత్యములు ముగించి
గమనము సాగింతుననగ గుహుడు నావ గొనివచ్చెను
సీతను తానెక్కించి గుహుని హస్త మూతగగొని
రాముడు అధిరోహించెను లక్ష్మణుండు అనుసరించె—

ఆవలి ఒడ్డుకు చేరిన నావనుండి దిగగానే
రామా ! నేకూడ వత్తు నని గుహుండు వెంటబడగ
ఆ ప్రగాఢ ప్రేమ చూసి గాఢాలింగన మొనర్చి
"రాజా ! నామాట విను రాగల మరలను ఇచటకు
తిరిగి వెళ్ళునప్పుడు నే తప్పక నిను కలిసెదను"
అన విని మాటాడలేక వెనుకకు మరలెను గుహుడు—

## ఋష్యాశ్రమముల సందర్శన

రాముడు సీతాలక్ష్మణ సహితుండై నడచి నడచి
భారద్వాజాశ్రమమును చేరెను విశ్రాంతి కొఱకు
ఆ ఋషి వారికి భక్తిని అర్ఘ్యపాద్యముల నొసంగి
"మీ రాకను మా ఆశ్రమ మంతా పావనమయ్యెను
అభినందన లివిగో" యన ప్రతిపందనమిడె వారలు—

ఆ రాత్రిని అచట గడిపి తెలతెలవాఱుచు నుండగ
ముని బాలురు కట్టిన చిఱు తెప్పపైన 'యమున' దాటి

వాల్మీకాశ్రమము చేర ఆ ముని ఎదురుగ వచ్చి
మము బ్రోవగ వచ్చితివా! ఓ మహాత్మ! ఓ ముకుంద!
నీదు నామ మహాత్మ్యము వర్ణింపగ వశముకాదు
దానికి నా జీవితమే ప్రబల సాక్ష్యమీ జగతిని

## వాల్మీకి పూర్వ వృత్తాంతం

బ్రాహ్మణ వంశమున బుట్టి భ్రష్టజనుల జట్టుబట్టి
శూద్ర స్త్రీని పెండ్లాడి సతీసుతుల పోషించగ
చోరవృత్తి స్వీకరించి దారులు కొట్టగ సాగితి—
—బడిత చేతబట్టుకొని బాటసారులను ఆపి
దోచుకొనుచు ఒకరోజున సప్తర్షులు రాగజూసి
లోభవశుడనై వారల వద్దనున్న చిఱుపాత్రల
అపహరింప వెంటబడి ఆగుడాగు డని కేకిడ
ఆగి మునులు "ఎవరు నీవు? ఏమిటికావలె" అనిరి—
"దారిదోపిడీదారుసు దౌర్జన్యము నా వృత్తి"—
"ఏలనయ్య పాపవృత్తి? ఎందుకు పాల్పడితి విట్లు?"—
"దారాపుత్రుల పెంచగ ఈ దారిని ఎన్నుకొంటి"—
"మంచిది ఓ మనిషి నీ వింటికేగి వారినడుగు
నీవు చేయు ఈ పాపం పంచుకొందురో లేదో!
తెలుసుకొని వారి మాట తిరిగివచ్చి మాకు చెప్పు
నీవు వచ్చువఱకు మేము ఇచ్చటనే నిలుచుందుము"—

అట్లే అని యిల్లుచేరి భార్యాబిడ్డల నడుగగ
"ఏమిచేసి తెచ్చిననూ మాకేమిటి సంబంధము ?
పాపమున్న అది నీదే మా కెట్టుల చెందునయ్య ?"—

భార్యాపుత్రాదుల యీ భాషణవిని దిమ్మదిరుగ
"ఛీ ఛీ నే జేయుపనికి ఇదా నాకు ప్రతిఫలము !"
అని మనమున విరాగినై మునుల మరల దర్శించి
ఓ మహర్షి శ్రేష్ఠులార ! రక్షింపుడు శిక్షింపుడు
పాపపంకిలుడ నేనని పాదమ్ములపై బడగా
మహామునులు, జాలిదలచి మంత్రము నుపదేశించిరి
మోక్షమంత్ర మిది నిషాద ! 'మరా' 'మరా' అను అనిరి—
అట్లనుటను ఆ నామము 'రామ' 'రామ'గా మారెను
ఏకాగ్రతతో జపింప బాహ్యస్మృతి నశించెను
బహుకాలము గడచుసరికి పుట్టలు పోసినవి పైన
కొన్నాళ్ళకు సప్తర్షులు తిరిగివచ్చి తట్టిలేపి
"మునీశ్వరా ! వల్మీకము నుండి బయట పడితివిపుడు
వాల్మీకిగ నేటినుండి వఱలుము ధరపై" అనిరి—
ఇది రామా నా చరితము మార్చె నన్ను నీ నామము
నీ దరిశన భాగ్యముతో నాదు జన్మ తరించింది
అని తన కథ చెప్పుచుండ ఆనందాశ్రువులు రాల
రాముని పాదారవింద ములను వానితో కడిగెను—

శ్రీరాముడు పులకితుడై వాల్మీకికి ప్రణమిల్లి
ఈ వనమున కొంతకాల ముండదలచితిని స్వామీ !

తాత్కాలిక వాసమునకు చోటు చూపుడని అడిగెను—

రామా నీ వుండుటకు చోటుకు లోటేమిటని
గంగానది చిత్రకూట పర్వతముల మధ్యమందు
శిష్యులచే కుటీరమును నిర్మింపగజేసి చూప
5మంచిగనున్నది చాలని మకామచట స్థిరపరచిరి—

## దశరథ మరణం

శ్రీరాముని విడిచిపెట్టి సుమంత్రుండు వెనుదిరిగి
అయోధ్యలో అడుగుపెట్టి దశరథునకు వార్త తెలిపె—

"మంత్రీ ! శ్రీరామచంద్రు డిప్పుడెక్కడున్నాడు ?
లక్ష్మణ సీతారాముల నెక్కడ విడిచితివి ? వారు
పాపాత్ముడనైన నన్ను ఏమని నిందించినారు ?
హా రామా ! హా లక్ష్మణ ! హా సీతా ! భూజాతా !
మీ వియోగదుఃఖముతో మేను నిలుప లేకుంటిని"
అని విలపించెడు రాజును సుమంత్రుండు ఓదార్చి
విడిచి వచ్చునంతవఱకు జరిగినదంతా చెప్పెను—

మహారాజ ! మా కొఱకై విచారించదగదు మీరు
పితృ ఆజ్ఞ పరిపాలన నెఱపెడిఎడ మామదికి
నగర భవనములకంటె వనమే ఆనందమని
రాముడు తనమాటగ మీ కందజేయమని కోరెను
మౌనమె తన సందేశము గా లక్ష్మణస్వామి వెడలె
అత్తమామలకు సీత ప్రణామములు చెప్పెననెను—

## కౌసల్య ప్రశ్న

తోడనె దుఃఖము కట్టలు త్రెంచుకొనగ కౌసల్య
తట్టుకొనగలేక భర్త చర్య నిట్లు ప్రశ్నించెను
"రాజ్యము నీ దొక్కనిదే కసుకెవ్వరి కిచ్చికొనిన
అభ్యంతర మేమిలేదు అడిగేవారెవరుండరు
నీకూ నాకూ బిడ్డడు రాముడు అతనడవికంప
ఏకపక్షముగ నీవే వరమిచ్చుట యిది తగునా ?"—

శూలమువలె యీ ప్రశ్న సూటిగ గుండెల తాకెను
గాయముపై కారమ్మను చల్లినట్లుగా నుండెను
"పట్టమహిషి కౌసల్యా ! నీవేనా యిట్లనినది !
నా ప్రాణము నిశ్చయముగ యీ దేహము వీడగలదు
అదిగో ఆ ముని శాపము ముందుకొచ్చి నిలుచున్నది"—

## ముని శాపం

యౌవనంపు పొంగున ఒక రాత్రి జంతువేటలోన
నదీతీర అరణ్యమున నడచుచుండ శబ్దమొచ్చె
జంతువొకటి నదిలోదిగి జలము త్రాగుచున్నట్టుల—

ఏనుగు నదిలో నీరు త్రాగుచున్నదని త్రెంచి
శబ్దవేధి శరమును సం ధించితినా ధ్వనివైపు
అంతే హా చచ్చితినని మనిషిగొంతు వినిపించెను
చెంతకు వెళ్ళితి చూసితి దంతికాదు మునిబాలుడు
భయవిభ్రమ సంభ్రమముల ఆ బాలుని సమీపించి
"విప్రవర్యా ! గజభ్రాంతిని విడిచితి చీకటిలో శరమును

నేనూ అయోధ్యరాజు దశరథుండు నాపేరు
అయ్యో! నే బ్రహ్మహత్య పాతకమున కొడిగట్టితి"—

"రాజా! భయపడకు నేను బ్రాహ్మణ బాలుడనుగాను
తపసుసున్న వైశ్యుడను బ్రహ్మహత్య భయములేదు
నా తలిదండ్రులు వృద్ధులు అంధులు మునిదంపతులు
దాహముచే పీడితులై ఉదకము తెమ్మని పంపిరి
ఘటమును నది నీటముంచి పూరించుచునున్న తఱిని
బుడబుడమను శబ్దమొచ్చె బాణమొచ్చి నన్నుతాకె
ఇందున నీ తప్పులేదు విధి చేసిన ఘోరమిది
మంచినీటికై వారలు పరితపించుచున్నారు
ఆలోచనమాని నీవు అతి శీఘ్రముగా వెళ్ళి
నీరమిచ్చి దప్పితీర్చి వారల రక్షించుమయ్య"

అని తన ప్రాణముల విడువ నడకల తడబడుచు నేను
జలకలశము చేతబట్టి మునిదంపతులను చేరితి
అడుగుల సడి విని బిడ్డడు వచ్చినాడు కాబోలని
"ఏమి నాయనా యింతగ జాగుచేసితివి?" అనగా
వరదగ కన్నీరుపాఱ వారి కాళ్ళపై బడితిని—

ఎవరయ్యా! నీవు మాదు తనయుడు కానట్టున్నది?
ఎక్కడుండె మాబిడ్డడు ఏమాయెను ఆతనికన
జరిగినదంతా చెప్పి దురపిల్లుచు నుండనంత
కుమారుణ్ణి కోల్పోయిన వార్త విన్న మఱుక్షణమున
హా పుత్రా! అని మూర్ఛిలి సొమ్మసిల్లి తెప్పిఱిల్లి

పుత్రశోకమున మావలె నీవును మరణించెదవు
అని శపించి ప్రాణములను విడిచిరి ఆ దంపతులు__
వారల శాపముఫలమే రాముని ఎడబాటు నాకు
అదిగో అది పైలోకపు పిలుపే వినబడుచున్నది
హా రామా! హా రామా! అనుచు రాజు మరణించెను__

## భరత శత్రుఘ్నుల రాక

వృద్ధరాజు మరణవార్త వశిష్ఠునకు ఎఱిగించిరి
భరతాదుల రమ్మనమని గురుదేవులు కబురంపిరి
వాయువేగమున బిడ్డలు వాలిరి పురి అయోధ్యలో
పట్టణమెటు చూసిననూ పాలిపోయి నట్లున్నది
రాజేడీ! రాముడేడీ! ఏమిటి యీ నిశ్శబ్దము!
కైక మందిరమునకేగ సుఖాసనము చూపించెను
మాతృభక్తితో తల్లికి వందనమిడి అడిగిరిట్లు
"నాన్నగారు నిన్ను విడిచి నిముషమైన ఉండలేరె!
ఎక్కడ కనుపించరేమి? ఎందుకు మము పిలిపించిరి?"__
"పుత్రా! మీ తండ్రి ధర్మ విశారదుడు పూజ్యుండు
అశ్వమేధ యాగాదులు చేసినట్టి పుణ్యధనుడు
పుణ్యాత్ములకే లభించు లోకానికి వెళ్ళినారు"
అనగానే భరతుండు స్మృతిహీనుడై పడెను__

## భరతుని విషాదం

కొంతసేపు కాగానే తెప్పరిల్లి దురపిల్లుచు
"నాన్నా మము దుఃఖసాగ రమున ముంచి పోయితివా?

అన్న రామునికి నన్ను అప్పగించకే పోతివ !''
అని విలపించెడు భరతుని చెంతకేగి కైకనుడివె
"వత్సా ! ఖేదము మానుము స్వస్థత చేకూర్చుకొమ్మ
సామ్రాజ్యము నీకొఱకై సాధించితి చింతించకు''—
"నాకేమియు వలదు తల్లి నాకేమిటి చెప్పె తండ్రి ?''—
"నీ కేమియు చెప్పమనుచు నా కేమియు చెప్పలేదు
హా రామా ! హా లక్ష్మణ ! హా సీతా ! ఇదేమాట
అంటూ దేహము త్యజించి పరమపదించిరి అంతే''—
"ఏమీ ఆ సమయమ్మున అన్న దగ్గఱలేడా ?
వదినా లక్ష్మణులు కూడ ఏమయ్యిరి ఎటకెళ్ళిరి ?''—
"రాముని పట్టాభిషేక మవ్వాలని నీ తండ్రి
తెలుపగ నగికాదని నా బిడ్డకు యివ్వాలంటిని
రాముని పదునాలుగేండ్లు వనవాసము కోరుకొంటి
ఆతడు గతమున యిచ్చిన వరములనే వాడుకొంటి
దాననతడు కోసలకు అధీశుడవు నీవనెను
రెండవ వరము ప్రకారము రాముడు అడవులకేగెను
రామునితో సతి సీత, భ్రాత లక్ష్మణుడు కూడా
అడవులకై ఆనాడే అనుసరించి పోయారు
వెళ్ళినదాదిగ నిత్యము రామా రామా యంటూ
అదేపనిగ అఱచుటచే అసువులు ఆతని బాసెను''—
భరతుండిది వినగానే పిడుగుపడిన వృక్షమువలె
భూపతితుండై నేలను ఘోరున విలపించసాగె
కైక అతని లేవదీసి "ఏమిటి దుఃఖింతువేల ?

ఈ విశాల సామ్రాజ్యము సంక్రమింప శోకమేల ?"
అని పలికెడు తల్లిచూసి "రాక్షసి ! ఏమనుచుంటివి ?
భర్తను చంపిన పాతకి నిన్నుచూడ పాపమౌను
నీ కడుపున పుట్టుటచే పాపము ననుకూడనంటు
విషము త్రాగి ప్రాణాలను విడుచుట యుక్తము నాకిక"
అని కైకను దూషించి కౌసల్యా గృహము కేగి
"అమ్మా ! నను నమ్ముము నే పాపము ఎఱుగ నిందు
అన్నలేని అయోధ్యను చూడగ నా తరముకాదు"
అని జల జల కంటినీరు కార్చెడు భరతుని చూసి
"పుత్రా ! నీ శీలము నే నెఱుగనిదా దుఃఖింపకు
నీవు దూరమందుండగ యీ ఘోరము జరిగిపోయె
కైక కూడ యీ కోరిక లేల కోరెనో తెలియదు
అంతా విధి ఘటన దీని తప్పింపగ ఎవరితరము ?"
అని ఓదార్చుచు నుండగ వశిష్ఠుండు అఱుదెంచెను—

## వశిష్ఠుని ఉపశమనం

"భరతా దుఃఖింపవలదు మరణము అతి సహజక్రియ
వృద్ధుడు మీ తండ్రి ఆత్మ జ్ఞాని సత్య పరాక్రముడు
ఇహలోకపు సుఖములన్ని అనుభవించినట్టి ఘనుడు
అశ్వమేధ యాగాదుల నొనరించిన మహామహుడు
కేవల పురుషోత్తమునే కొడుకుగ గన్నట్టివాడు
మహనీయుడు మహోన్నతుడు పుణ్యవరేణ్యుడు చూడగ
దేవేంద్రుని అర్ధాసన మధిష్ఠింపనేగె నతడు
దీనికి చింతించుటయా ? తగదు నీదు విచారము—

నీవేమిటి శోకించుట దశరథాత్మ కొఱకేనా ?
లేకాతని శరీరమ్ము కొఱకా యీ శోకమంత ?
ఆత్మకొఱకు అయితే అది మరణించగలేదు వినుము
జన్మ జరా నాశనములు లేనిది తలగని దాత్మ
శరీరమ్ము కొఱకైతే నాశనప్రకృతి దానిది
నాశనమగు దానికొఱకు శోకించుట వ్యర్థముగద !
తల్లయినా తండ్రయినా ఎవరైనా మృతులైతే
మూర్ఖులు మాత్రమె గుండెలు బాదుకొనుచు ఏడ్చెదరు
జన్మించిన దాది మృత్యు వెప్పుడు వెన్నంటి యుండు
ఐహికమగు జీవితము అతిస్వల్పము అత్యల్పము
ఇప్పటికి అనేకకోట్ల వత్సరాలు వచ్చిపోయె
పరిమితమగు వ్యవధిమించి బ్రతుకుట ఎవ్వరితరము ?
"చల పత్రాంత లగ్నాంబు బిందువత్ క్షణ భంగురమ్"
కదలుచున్న ఆకుచివర నున్న నీటి బిందువు వలె
ప్రాణము క్షణమున పోవును పోయేకాలము తెలియదు
జన్మాంతర కర్మలచే జీవుడు యీ దేహ మొందె
నేటికర్మ ఫలితముగా మరో దేహమందు చేరు
జీర్ణ వస్త్రమును త్యజించి నూతన వస్త్రము కట్టిన
చందమె యిది తలచి చూడ అంతకంటె వేఱుగాదు
దేహాత్మల బంధమింతె శోకమువీడుము భరతా !
ఉత్తర క్రియలకు పూనుము దహన క్రియల నాచరించు"
అన విని అజ్ఞానము విడి భరతు డంత్యక్రియల జరిపె__

## భరతుని రాజ్య తిరస్కారం

రాజనీతి మర్మజ్ఞులు. ధర్మజ్ఞులు, శాస్త్రజ్ఞులు,
మంత్రులు, సామంతులు, పుర సభతీరిచి భరతునితో
జాగుసేయ తగదు నీదు జనకునాజ్ఞ నెఱవేర్చుము
కోసల సింహాసనమును అధిష్ఠించు మన భరతుడు

"పెదలార ! మీకు చెప్ప తగినవాడ గానుగాని
నాకీ రాజ్యము వలదు అన్న రాముడే రాజు
మీరందఱు రేపుదయము నా తోడను కలిసి రండు
అరణ్యమున కేగి అన్న రాముని ఒప్పించి తెచ్చి
రాజ్యము నభిషేకించుట కర్తవ్యము మన కిప్పుడు
ఘాతకి కైకేయి తప్పు తెచ్చిపెట్టె నీ ముప్పు
తల్లినైన లెక్కజేయ తక్షణమే చంపి యుందు
అన్నగారు శ్రీరాముడు స్త్రీ హత్యను సహించడు
మాఱుమాట పలుకకుండ మనమంతా వెళ్ళవలెను"—

భరతుని నిజ భ్రాతృ భక్తి సంభ్రమమును కలిగించగ
సాధు సాధు యనుచు జనులు వనయాత్రకు పయనమైరి—

## భరతుని వన ప్రయాణం

సపరివార సహితుండై శృంగిబేర పురము జేర
దూరములో గుహుండు చూసి తన వారిని శాసించెను
"కైక కొడుకు సేనలతో ఇటకెందుకు వచ్చుచుండె !
పరిశుద్ధాత్ముడె అయితే పరివారము దేనికట !

అతని భావ మెట్టిదో గని దాని బట్టి నడుప వలెను
శ్రీరాముని యందు భక్తి విశ్వాసము కలిగియున్న
క్షేమముగా గంగానది దాటిందము స్నేహముగా
కాకుంటే ప్రతిఘటించి గంగదాట నీయవలదు"—

భరతుడు దగ్గఱకొచ్చెను నారచీరలను గట్టి
ముఖము చూడ దుఃఖముతో మసకబారి నట్లుండెను
రామ నామమే ఆతని పెదవులు పలుకుచునుండెను
అర్థమయ్యె గుహునకపుడు వ్యర్థపు శంకలు తనవని
ప్రియము మీఱ అతనిచేరి పరిచయమ్ము చేసికొనెను—

"మిత్రుడ! గుహుడా! రాముడు ఎక్కడనున్నాడిప్పుడు?"—

"చిత్రకూట పర్వతము మందాకిని నదుల నడుమ
వాల్మీకాశ్రమ ప్రాంతము వద్ద వారి నివాసము"—

"అన్నను దర్శించుటకై మన సాత్రము పడుచున్నది"—

"త్వరగ నదిని దాటించెద దారి చూప నే వచ్చెద"
అని వారికి తోడుగ ఆ గుహుడు కూడ బయలుదేఱె —

భారద్వాజాశ్రమమును దారిలోన దర్శించిరి
భరతుని భక్తిని జూసి భారద్వాజులు మెచ్చిరి
"ఈనాటికి యిక్కడాగి రేపు వెళ్ళుదురుగాని
ఈ రేయికి మీరు నాకు అతిథులుగా నుండి పొండు"—

భారద్వాజుడు పిలువగ కామధేనువే వచ్చి
వడ్డించెను పంచభక్ష్య పరమాన్నములను తృప్తిగ

ప్రాతః కాలమున లేచి మునికి వందనము చేసి
భ్రాతృప్రేమ ముప్పిరిగొన భరతాదులు పయనమైరి —

## పాదుకా పట్టాభిషేకం

శ్రీరాముని ఆశ్రమమ్ము దరిదాపుల చేరినారు
నేలను శ్రీరామపాద చిహ్నములను చూసి భక్తి
కనులకద్దుకొనుచు వారు కుటీరమున కాలిడిరి —
భరతుని చూసిన రాముడు ప్రేమను బాహువులసాచి
పాదమ్ముల బడిన వాని లేపి కౌగిలించుకొనెను —
దప్పిక గొన్నట్టి గోవు లెట్లు జలాశయము జూసి
ఉప్పొంగునో అట్లే ఆ తల్లుల మదులుప్పొంగెను —
కౌసల్యా, కైకేయీ సుమిత్రలకు వందన మిడి
ముని వశిష్ఠు పాదాలకు రాముడు సాష్టాంగ పడెను —
"నాన్నగారు సుఖులేనా ? ఏమి చెప్పమని చెప్పిరి ?" —
"నీ వియోగ దుఃఖముతో నిత్యము నిను తలచుకొనుచు
హా రామా ! హా లక్ష్మణ ! హా సీతా ! అని పలుకుచు
కలవరించి పలవరించి జనకులు స్వర్గస్థులైరి" —
ఈ మాటలు వారి చెవికి కర్ణశూలములు కాగా
రామలక్ష్మణులు, సీత స్మృతి విహీనులై పడిరి —
కొంత తడవు గడువ లేచి చింతించుచు రోదించుచు
"అనాథులుగ మమ్ము చేసి అరిగితివా తండ్రీ !" అని
విలపించెడు వారల నట వశిష్ఠుండు ఓదార్చగ
రామ లక్ష్మణులు గంగను మునిగి తర్పణము లిచ్చిరి—

అవిసి ఫలము చూర్ణముతో పిండి ముద్దలను జేసి
మధురముగా మలచి పిండ ప్రదానమ్ము గావించిరి —

మఱునటి దినమున భరతుడు రాముని దగ్గఱ కూర్చొని
"అన్నా ! మా అందఱకూ తండ్రివి నీవే నేడు
రాజ్యభారమును గొనుట జ్యేష్ఠ పుత్రు ధర్మముగద !
మా ప్రార్థన మాలకించి క్షత్రియ ధర్మప్రకారము
అభిషిక్తుడవై మమ్ములఁ ఆనందింపగ జేయుము —

సామ్రాజ్యము చేబట్టి భూమండలమును జయించి
వివిధ యజ్ఞములు చేసి వీరులైన పుత్రులగని
రాజ్యభార మొప్పగించి అటుపైగద వనవాసము ! —

కైకను నా తల్లనుటకు సిగ్గు పడుచునున్నాను
ఆమె తప్పు సైరింపుము మాప్రార్థన మన్నింపుము"
అని అగ్రజు పాదాలను శిరముతోడ స్పృశియించెను —

పాద పతితుడైన వాని పైకి లేపి శ్రీరాముడు
అంక మందు చేర్చుకుని ప్రేమతోడ వీపు నిమిరి
"వత్సా ! మనతండ్రిగారు అయోధ్యను నీ కిచ్చిరి
ఈ దండక వనవాసము నాకిచ్చిరి తండ్రి ఆజ్ఞ
ఎన్ని కష్టములు వచ్చిన దీనిని కాదనరాదు
పిత్రాజ్ఞను ధిక్కరించి నరకానికి పోరాదు
నీవారాజ్యము నేలుము నే దండక వనమేలెద" —

"అన్నా నీ వన్నది అది నిజమే యగు సమస్థితిలో
కానీ ఆ సమయములో నాన్న మూఢుడయ్యాడు

జ్ఞాన శూన్యుడున్మత్తుడు కాముకుడు స్త్రీవశుడు
అట్టి వాని మాటలను పాటింపగ పనిలేదు" —

"భరతా ! యిటు తర్కముతో తండ్రిని నిందించరాదు
నిజముగ మన తండ్రి గొప్ప సత్యవచనుడని తెలియుము
గతమున ఇచ్చిన వరముల నెఱవేర్చుట తప్పగునా ?
జనకు నాజ్ఞ మీఱి మనము రఘుకీర్తిని చెఱచరాదు" —

"అట్లయితే అన్నా ని న్ననుసరించి నే వత్తును
లక్ష్మణునకు వలెనె నాకు నీ సేవా భాగ్యమొసగు
కాదందువ నీముందే ప్రాణాలను త్యజించెదను"
అని భానుని కభిముఖముగ ఎండలోన కూర్చుండెను —

తమ్ముని దీక్షను జూసి విస్తుబోయి శ్రీరాముడు
గురుదేవునివైపు చూసి అరకంటను అర్థించెను
విజ్ఞుడైన వశిష్ఠుండు విధి విధాన మెఱుక బఱచ
భరతుని ప్రక్కకు బిలిచి రామ జననమును దెలిపెను.
భూమాతా విలాపము, బ్రహ్మదేవ ప్రార్థనము,
విష్ణువు అంగీకారము, రామునిగా ఉద్భవము,
కైకేయీ వరమడుగుట, దశరథుండు చెల్లించుట
వంటివి దేవతల పనులె వాగీశ్వరి ప్రేరితములె
వచ్చిన పనికాకుండా రాముని రమ్మని పిలుచుట
దేవకార్య విఘాతము తెలిసి పట్టు విడువు మింక
రావణ సంహారమైన పిదప నతడు రాగలడన
వాశిష్ఠము తలకెక్కెను విశుద్ధుడై భరతుండు
రామ సమీపము జేరి పాదాలను పట్టుకొని

పాదుకలను ప్రసాదింప అర్థించెను ప్రార్థించెను
"నీకు మారుగా వానిని అర్చించెడు భాగ్యమిడుము
నీ ఆగమనమ్ము వఱకు వీనిని సేవించుచుందు" —

రాముడు అత్యంత ప్రేమ అతనిపైన ప్రసరించి
పాదుకలను ప్రసాదించి సాగనంపు చుండునంత
భరతుడనెను వినమ్రుడై "అన్నా ! పదునాలుగేండ్లు
గడచిన మఱుదినమున నీ వయోధ్యలో లేకుండిన
అగ్నియందు ప్రవేశించి అశువుల నే విడుట నిజము" —
రాముడు "తప్పక వత్తును" అని తమ్ముని వీపు తట్టె —

## కైక పశ్చాత్తాపం

కైక ఖేదమంది మదిని వగచుచు కన్నీరుగాఱ
"రామా నే దుర్బుద్ధిని నీ కన్యాయము దలచితి
కర్మమూట గట్టుకొంటి కరుణాకర శరణు శరణు" —

అనగా శ్రీరాముడు పిన తల్లిని సముదాయించి
"నీ తప్పేమియు లేదు నీదు ప్రేమ నే నెఱుగుదు
అమ్మ కంటె అధికముగా నీవేనను పెంచినది
దేవ కార్య నిమిత్తము వాణి నాలుకందు చేర
నీ వట్టుల పలికితివి నీదేమున్నది తల్లీ ?
పదునాల్గేండ్లగుటతోనె నేను వత్తు మిమ్ము జూతు"
అనుచు ఆదరమున వారి ననునయించి సాగనంపె —

# భరతుని దీక్ష

భరతుడు నంది గ్రామము స్థిరవాసము చేసుకుని
కోసల సింహాసనమున రామపాదుకలబెట్టి
పుష్పాక్షత గంధాదుల రాజలాంఛనముల రామ
పాదుక పట్టాభిషేక మొనరించెను ప్రజల ముందు
కందమూలముల భుజించి జటావల్కముల దాల్చి
బ్రహ్మచారిగా నేలను పండుకొనుచు ప్రతిదినము
పాదుకలకు రాచకార్య మెల్ల చెప్పి పాలించుచు
రామాగమనము కొఱకై రోజులు లెక్కించుచుండె —

## అత్రి మహాముని ఆశ్రమ సందర్శన

చిత్ర కూటమున రాముని వాసము తెలిసి అనేకులు
గుంపులు గుంపులుగ నటకు నిత్యము రాసాగినారు
వారితోడ ఆశ్రమము అవిశ్రాంత తీర్థమాయె
అయినా యిక్కడవుంటే వచ్చిన పని ఏమికాను ?
అందువలన దాని విడిచి ముందుకు పయనం బాయిరి—

దారిలోన అత్రిముని ఆశ్రమమును దర్శించిరి
యోగదీక్ష మునిగియున్న అత్రిమహా మునిని గాంచి
"నేనూ దశరథ రాముడ" అని వందన మాచరించె —

అత్రి కనులు విప్పి చూసి హరియె ఆతడని గ్రహించి
ముఖ్యాసనముల వారిని మువ్వుర కూర్చుండ బెట్టి
కందమూల ఫలములిచ్చి ఘనసత్కారము చేసెను —

"నాదు భార్య అనసూయ వృద్ధురాలు లోనున్నది
ధర్మనిరతి తపోమయి ధర్మవత్సలాదేవి
అమ్మా సీతమ్మా ! నీ వామెను దర్శింపుమమ్మ"
అని ముని చెప్పుట తడవుగ సీత లోని కరిగి ఆమె
పాద పద్మములకు మ్రొక్కి చెంతను కూర్చుండ నంత
అనసూయానందముతో గాఢాలింగన మొనర్చి
ఆదరమున శిరము నిమిరి అనురాగముతో ముద్దిడి
విశ్వకర్మ నిర్మితమగు రెండు కుండలమ్ములనూ
నిర్మల భక్తిని కూడిన రెండు దుకూలమ్ములనూ
శుభముకోరి దివ్యమైన అంగరాగముల నొసగెను —
"అంగ రాగ మహిమ వలన తఱగదు నీ దేహశోభ
కమల ముఖీ ! పతివ్రతగ ఘనకీర్తిని గాంచుమమ్మ"
అని దీవనలిచ్చి పంపె అతిథులుగా నా పథికుల —

ఆధ్యాత్మ గేయ రామాయణం
అయోధ్య కాండ సమాప్తం



# అరణ్యకాండ

## విరాధ వధ

"సోదర ! దండక వనము రాకాసుల కాకరము
పరిసరములు ముందు వెనుక పరిశీలించుచు పోవలె"
అని చెప్పుచు నడుచుచుండ మడుగొక్కటి కాన్పించెను —

కడుపునిండ నీరు త్రాగి గట్టుసగల చెట్టుక్రింద
క్షణకాలము విశ్రమింప రాక్షసుడొక్కడు వచ్చెను
ఎడమ భుజమునున్న అతని శూలము నిండా నిలువుగ
మానవ కంకాళమ్ములు గుదిగ్రుచ్చగ బడియున్నవి
వచ్చిన ఆ భీకరుండు విరాధుండు ప్రశ్నించెను
"ఎవరు మీరు ? ఘోరాటవి నేల తిరుగుచున్నారు ?"—

"రాముడు నా పేరు నాదు తమ్ముడు లక్ష్మణుడితడు
ఈమెనాకు ధర్మపత్ని సీతా సౌభాగ్యవతి" —

"అయితే ఆ పడతి నిచట విడిచి పాఱిపొండు మీరు
లేనియెడల మిమ్మందఱ తినివేసెద క్షణములలో"
అని గర్జించెడు విరాధు బాహువులను ఛేదించి
రాముడతని పాదయుగము ముక్కలు ముక్కలు చేసెను —

పడియు పట్టు విడువకుండ పామువలే ప్రాకుకొనుచు
వారల తినుటకు పెద్దగ నోరు తెఱచి వచ్చుచుండ
కరవాలముతో రాముడు నఱికి వేసె విరాధుని—

వెంటనె ఆతని దేహము కోటి కాంతులను చిమ్ముచు
సుందర మూర్తిగ మాఱెను చూడగ నాశ్చర్యమాయె
'రాజీవ దళాయతాక్ష! రామా! విద్యాధరుడను
దూర్వాసుని శాపముతో దుష్టరాక్షసుడనైతిని
పాప శాప విముక్తిని పొందితి నీ వలన ప్రభూ!
నీ వనుమతి నిచ్చినచో నాకలోకమునకేగెద'
అని ప్రార్థింపగ రాముడు అట్లే అని సాగనంపె—

## శరభంగాశ్రమ సందర్శన

అనంతరము శుభములిచ్చు శరభంగాశ్రమము చేర
స్వాగతమని మునీశ్వరుడు శ్రీరాముని స్పృశియించి
"సృష్టిస్థితి లయకారా! పరమాత్మా! పరంధామ!
ఘటములలో జలములందు సూర్యుడెందఱిగ నున్నను
వాస్తవమున కన్నింటను కనిపించునదొక సూర్యుడె
అట్లె బ్రహ్మ విష్ణు శివుల ఏకరూపమగి నీవే
నీదర్శన భాగ్యమునకు నేటివఱకు వేచియుంటి
నా కోరిక నెరవేఱెను నా జన్మము ధన్యమయ్యె
స్వార్జితమగు నా తపస్సు శక్తి నీకు ధారబోసి
తత్పుణ్యము కారణమున తనువు ముక్తిపొంది నేను
బ్రహ్మలోక మేగవలయు పావనగుణ రామ"యనుచు
సర్వతపో ఫలమొసంగి సత్యలోకమున కేగెను —

## అగస్త్యాశ్రమ దర్శనం

కొందఱు ముని జనములు కో దండ రాము దర్శించి
రాక్ష సాధములు వారిని హింసించెడు విధము తెలిపి

"తాపసులను రక్షింపుము తారకరామా !" అనగా
అభయ మిచ్చె దాశరథి తప్పక తా వచ్చెదనని —
అన్నమాట ప్రకారముగ ఆశ్రమముల దర్శించుచు
రాక్షసులను హతమార్చుచు రాముడు ముందుకు సాగెను
అగ్ని జిహ్వ, సుతీక్ష్ణాది మహర్షులను సేవించి
దశ వర్షమ్ములు తిరిగి అగస్త్యాశ్రమమ్ము చేర —
"రమ్ము రమ్ము రఘురామా ! గుణధామా ! శ్రీరామా !
అతిథిగ నీ రాక మాకు ఆనందమ్మనుచు వారి
అన్ని పుణ్య విధులతోడ అర్చించెను అగస్త్యుండు —
పురందరుడు రామునికై తన దరినుంచిన చాపము
అక్షయమగు తూణీర ద్వయమును ఖడ్గములనిచ్చి
"రామా ! రాక్షస కూటమి నంతటినీ మట్టుబెట్ట
నీవొచ్చిన కార్యమ్మును నేనెఱుగుదు భక్తప్రియా !
పావనగౌతమి ఒడ్డున పంచవటీ ఆశ్రమము
ఇటకు రెండు యోజనములె నీవనికది ప్రశస్తము
అని దారులు విశదపఱచి సత్కరించి పంపించెను—

## జటాయువు స్నేహం

పంచవటీ మార్గములో పర్వత శిఖరమువలె నొక
వృద్ధపక్షి కనిపించెను విస్మయమ్ము కలిగించెను
ఇతడెవడో రాక్షసుండు తమ్ముడ ! ధనువిటుతెమ్మన
"రామా ! రక్కసుడగాను నీ తండ్రికి స్నేహితుడను
పంచవటీ నివాసము జటాయువు నాపేరు

నీ రాకను వినియుంటిని నీకొఱకే వేచియుంటి
మీరిద్దఱు వేటకేగ రక్షణెవరు సీతమ్మకు?
స్వీకరించి ఆ భారము సాయపడగ నే వచ్చితి''—

మంచిది నీ సద్బుద్ధికి మనసా నా కృతజ్ఞతలు
ప్రియవాదీ! రమ్మటంచు పంచవటికి చేరుకొనిరి—

గోదావరి తీరమందు పర్ణశాల నిర్మించగ
సీతా లక్ష్మణులతోడ శ్రీరాముడు స్థిరపడెను—

## శూర్పణఖ నాసికా కర్ణ ఛేదనం

దండక వనమందున ఖర దూషణ త్రిశరాదులతో
సంచరించు శూర్పణఖ శ్రీరాముని చూసినది
కందర్పుని తలదన్నే సుందరరూపమును గాంచి
కామరూపమున చక్కని కాంతగ కులుకుచువచ్చెను
''శూర్పణఖను నే రావణ చక్రవర్తి సోదరిని
జనస్థానము నావాసము మునిజనములు సావాసము
నరుడా ఏ దరివాడవు? నీ వృత్తాంతము ఏమిటి?'' —
''అయోధ్యాధిపతి పుత్రుడ శ్రీరాముడు నాపేరు
ఈ సుందరి నాభార్య జనకనందినీ సీత
అదిసరి నీ పనియేమి అసురభామినీ తెలుపుము''—

''రామా! నీ దివ్యసుంద రాకారము స్తవనీయము
ఈవేళను నిన్నుచూసి తాళజాలలేకుంటిని
అబ్బా! ఈ దేహమంత తృష్ణదహించేస్తున్నది
రామా! నా పెదవుల నీ అధరము ముద్దాడనిమ్ము

శృంగారపు రసఝురిలో ప్రియా తేలియాడింతును
మదనా నేనాగలేను మరుని తాప మోపలేను
కైపుదీర కౌగిలించు కొని రమించు కామార్తను" —
"ఏమనుచుంటివి భామా ! ఏకపత్నీవ్రతుడ నేను
నీ కోరిక అన్యాయము, అక్రమము, అధర్మము
పత్నికలిగి యున్న నన్ను పాపము ఆ మాటడుగుట" —
"అయితే అటు దూరముగా నీవలెనే ఉన్నదెవరు ?
కంతుడా ? వసంతుడా ? జయంతుడా ? మన్మథుడా ?" —
అతడు నాకు సోదరుడు లక్ష్మణుడాతని పేరు
వనలక్ష్మి సోయగముల విలోకించుచున్నాడన
రయమున పరుగిడి ఆతని రతికోరుచు పైబడగా
నేను రామ దాసుడను నియమవ్రత శీలుడను
నీ సొగసులు నీ వగలూ నాదగ్గఱ పనికిరావు
ఒడలు దగ్గఱుంచుకొని వచ్చిన దారిని పొమ్మన
గిఱ్ఱున వెనుదిరిగి వచ్చి గుఱ్ఱుగ రాముని జూసి
"నీకు భార్యయుంటగదా నీవు నన్ను కాదంటివి ?
ఆమెను భక్షించి నాకు అడ్డును తొలగించుకొందు" —
అని రాక్షసిగా మాఱి జానకిపై విఱుచుకుపడె
రాముడామె నిలువరించి "తమ్ముడ ! తగు బుద్ధిచెప్పు"
అన లక్ష్మణుడా రక్కసి ముక్కుచెవులు కోసివేయ
ఆక్రందన మొనరించుచు ఖరుని చెంత కరిగినది —

## ఖరదూషణాదుల వధ

ఖరదూషణు లామెకు పిన తల్లి కొడుకు లసాధ్యులు
ఏడ్చుచు వచ్చిన ఆమెను ఓదార్చి విషయమడుగ

జరిగిన దంతయు వదనగ పూసగ్రుచ్చినట్లు చెప్పి
రిపుల సంహరించి వారి రక్తము జుర్రగ వలెనన
ఢిల్లున లేచిన ఖరుడా నరుల నిపుడె చంపెదనని
రామవధకు అసురసేన రణభూమికి తరలించెను —
వచ్చెడు రాక్షసులపైన శరవర్షము కురిపించి
ఖరదూషణ త్రిశరాదుల శిరముల ద్రుంచెను రాముడు —
చుప్పనాతి శూర్పణఖ రొప్పుకొనుచు రోజుకొనుచు
రక్తసిక్త వదనముతో రావణు పాదాల బడెను —
"లెమ్ము లెమ్ము శూర్పణఖా ! ఏమిటి యీ దారుణము ?
ముక్కు చెవుల కేమాయెను ? ఎక్కడ జరిగెను యీపని ?
ఏమిటి వికృత రూపము ? ఎవరు చేసిరీ ఘోరము ?
ఇంద్రుడ ? యముడా ? వరుణుడ ? కుబేరుడా ? పేరు చెప్పు
వాడి తలను క్షణములలో వేయి చెక్కలుగ జేసెద" —
"అన్నా అట పంచవటిని చేరిరి ముగ్గురు నరులు
రామలక్ష్మణులు పేరులు మగధీరులు మహరాజులు
అందుపెద్దవానిభార్య కుందనంపుబొమ్మ సీత
అద్భుతసౌందర్యరాసి అలవికాదు వర్ణింపగ
దేవకన్యలందఱునూ బలాదూరు ఆమెముందు
ఆమెను నీ ప్రేయసిగా గొనితెచ్చుటకే బోవగ
రామాజ్ఞను లక్ష్మణుండు ముక్కుచెవులు కోసినాడు
ఖరదూషణ త్రిశరాదులు రామునిచే నిహతులైరి —
విశ్వమోహినీ నెలత విలాసములగని సీత
అన్నా ఆ పూబోడిని పొందని మగ బ్రతుకేటికి ?

ఆ రాముని వధియించు ఆమెపొందు అనుభవించు"
అని యిచ్చిన ప్రేరణకు రావణుండు తలవూపి
అంతరంగమందు యిట్లు ఆలోచించగ సాగెను—

"నరుడా రాముండెంత! ఖరుని సంహారించుటయా!
వీరుడు బహు బలాఢ్యుడు ఖరుడు నిహతుడగుటేమిటి!
అంత శూరుడా రాముడు! అసమాన్యుడు నరుడెట్లగు?
రాముడు నరుడనుట తప్పు నారాయణుడే కావలె
వానిచేత చంపబడిన వైకుంఠము పొందగలను
అటులగాక రాముడు సామాన్య మానవుడె అయితే
పీచమడచి సీతదెచ్చి ప్రియరాలుగ జేసికొనెద"
అని యోచనచేసి చేసి మారీచుని చెంతకరిగె —

## మారీచునితో మంత్రాంగం

మారీచుడు రామునిచే సాగరమున విసరబడిన
నాటినుండి భయముతోడ నీటిలోనె దాగియుండె
రావణుడాతని లేపి జరిగినదంతా చెప్పి
"రాముడిపుడు మన శత్రువు వానిపనికి ప్రతిక్రియగా
సీతను నే నపహరింతు సాయపడుట నీవంతు
మాయామృగ రూపంలో రామలక్ష్మణుల దూరం
తీసుకుపోవుట నీపని సీతను తెచ్చుట నాపని"
అనగానే మారీచుడు అదలి చేష్టలుడిగి పలికె
"సోదర యీ ఉపదేశము చేసిన వాడెవడు నీకు?

లంక నాశనముకొఱకే లిఖించినాడు యీ పథకం
వాడే మన నిజ శత్రువు రామునికంటే ప్రథముడు—

విశ్వామిత్రుని యజ్ఞం సంరక్షింపగ వచ్చి
సుబాహుణ్ణి చంపి నన్ను సాగరమున బడవేసెను
మది క్రోధము వదలక నే సూదికొమ్ములను ధరించి
మృగములతో కలిసి మరల మడియించగ వెడలనపుడు
నాచేష్టల గుర్తించి నాపై బాణము వేయగ
తిరిగి సంభ్రానబడి దాగియుండి బ్రతుకుచుంటి
ధీరవిక్రముడు రాముడు వీరశూర పరాక్రముడు
వలదాతనితోడ మనకు వైరము రాక్షసరాజా ! —

అయినా ఒకనాడు నేను మునీశ్వరులు అనవింటిని
సురల ప్రార్థనమ్ము విని నారాయణుడే యిచ్చట
రాముని అవతారమెత్తె రావణాదులను వధించ
అతడు మానవుడు కాడు నీవాతని తలచవద్దు" —

"మారీచా ! నీ బోధలు మాని నాదు మాట విను
పరమాత్మే అతడయితే పరమానందమె నాకు
అతడే నను వధియించిన పరమపదము పొందగలను
నేనాతని వధియించిన సీత నాకు దక్కుతుంది
మాఱాడక మారీచా ! మాయలేడిగా మాఱు
కాదందువ నిన్నిక్కడె వధియించే నే వెళ్ళెద"
ఈ మాటలకదిరిపడిన మారీచుడు యోచించి
ఎట్లయినను చావుదప్ప కున్నట్లున్నది నాకు

ఈ క్రూరునిచే జచ్చిన నరకమె సంప్రాప్తమగును
రామునిచేతను చచ్చిన ముక్తయినా దొరకునని
బంగరు లేడిగ మాఱి పంచవటికి బయలుదేఱె —

## మారీచు మరణం

వచ్చినపని జరుపుటకిక వత్సర సమయమె ఉన్నది
శీఘ్రముగా కర్తవ్యము నిర్వర్తించగవలెను
రాముడు సీతను బిలిచి అగ్నిని అదృశ్యంబై
నీ ఛాయను మాత్రమిచట సీతగ నిలబెట్టు మనగ
సీత తనదు ఛాయ మాయ సీతను ఆశ్రమమునుంచి
అగ్నియందు ప్రవేశించి అంతర్హితురాలయ్యెను —

స్వర్ణకాంతులను తళతళ మెఱయుచు ఆపరిసరముల
అటునిటు తచ్చాడుతున్న మాయలేడి చూసి సీత
"నాథా! బంధించితెండు ఆబంగరు లేడి నాకు"
అన రాముడు తమ్మునితో "వదినకు రక్షణగనుండు
రాక్షసులెన్నో మాయల చేతురు జాగ్రత్త" అనుచు
కోదండము చేతబట్టి వెంబడించె నాలేడిని —

రాముడు వెన్నంటుచుండ మృగము ముందు పరుగెత్తుచు
పొదలమాటు దోబూచుల నాడుచు దూరము సాగెను
రామునికపు డర్ధమాయె మాయలేడియే యిది యని
శరమును సంధించి లేడి అసువులు దీయగ వదలెను —

రాముని బాణము తగలగ "హా లక్ష్మణ! హా సీతా!"
అని రాముని కంఠముతో అఱచి లేడి మరణించెను —

ఆ కేకకు అదరిపడి కీడును శంకించి సీత
"మఱదీ! నీ సోదరుని ఆర్తనాదముగనున్నది
అసురుండెవడో నాపతి ఉసుఱులు తీస్తున్నాడు
లక్ష్మణ! తక్షణమె వెళ్ళు రక్షించుము నీ అన్నను" —

"త్రిలోకముల క్షణములోన నశియింపగజేయు ఘనుని
సంహారింపజాలుట ఈ ధరణిని ఎవ్వరితరము?
ఇట్టి దీనవాక్యమ్ములు అతని నోట రావెప్పుడు
వదినా! నినువిడిచి నేను వెళ్ళలేను వెళ్ళబోను" —

"లక్ష్మణ! యిది ఏమి అన్న ఆక్రందన వింటివిగద!
భ్రాతృప్రేమతో వచ్చిన వాడవు కావా ఏమి?
ఏమిటి మాటాడెదవిటు ఎదవేఱేమైన గలద?" —

ఘోరమైన యీ మాటకు "హరహర యిది ఏమికర్మ!"
అనుచు చెవులు మూసికొని ఆందోళన చెంది హృదిని
"అయ్యో! నిష్కారణముగ నిర్దోషిని నిందించిన
పాపానికి ప్రతిఫలము ప్రాప్తించునో ఏమో"అని
వనదేవత లెల్లరనూ వదినను రక్షింపుడనుచు
విన్నపమిడి లక్ష్మణుండు అన్నకొఱకు బయలుదేఱె —

## సీతాపహరణం

ఇది చూసీ అదనిదనీ మది తలంచి రావణుండు
దండ కమండలములతో భిక్షుకవేషము ధరించి
భవతీ భిక్షాందేహని సీత ముంగిటను వ్రాలెను —

ధరా తనయ భక్తితోడ కందమూల ఫలాదులను
ఎదుటనుంచి భుజియించుడు స్వామీ ! మీరెవరనగా
"పౌలస్త్యుని పుత్రుండను అసురుండను అందగాడ
నిన్నిప్పుడు గొనిపోవుట కే యిటకే వచ్చితిని
సుందరి ! యీ అడవులబడి ఇడుమల గుడువగనేల ?
అసమర్ధుడు రాముడు ని న్నేవిధి సుఖపెట్టగలడు ?
రా నాతో కదలి రమ్ము రాణిని జేసెద లంకకు" —

రావణ వాక్యముల కామె హృదయము కంపించిపోయె
అయినా ధైర్యము వీడక ధీరతతో నిట్లనెను
సింహము నా భర్తముందు కుందేలువు నీవెంత !
అతని శరాఘాతమునకు చీలికలగు నీ దేహం
దుర్మార్గా ! పాడుబుద్ధి వీడి పాఱిపొమ్మనగా
క్రోధముతో రావణుండు భీకర రూపమ్ము దాల్చి
పదితల లిరువది చేతుల ప్రళయాగ్నుల కురిపించుచు
పొడవగు తన గోళ్ళతోడ భూమి పెల్లగించి లేపి
రమణిని తను ముట్టకుండ రథముపైన పడవైచి
గగన మార్గమున లంకకు గొనిపోవుచు నుండుసంత
విలపించే సీతగొంతు వినిపించెను జటాయువుకు—

"రావణ ! ఆగుము ఆగుము ! ఏమిటి యీ తుంటరి పని ?
యజ్ఞ భక్ష్యముల శునకము దొంగిలించి నటు లిట్టుల
ఒంటరిగా నున్న సీత నెత్తుకు పోతుంటివిగా !
నేనుండగ నీ యాటలు సాగనీయ నసురాధమ ! "
అనుచు ముక్కుతో రావణ రథమును చూర్ణము జేసి

ధనువును ముక్కలు ముక్కలు చేసి అతని నెదుర్కొనగ
ఖడ్గముతో రావణుడా ఖగము రెక్కలను నఱికెను
భుజములు తెగి జటాయువు భూమిమీద పడిపోయెను —

మాయా రథమున సీతను ముచ్చిలి కొనిపోవుచుండ
దారిలోన నగలదీసి చీర చింపి మూటగట్టి
జార విడిచె నేలపైకి జాడ తెలుపు రామునకని —

లతా కుంజ మనోహరము లంకను అశోక వనము
భూమి సుతను అందుంచెను బంధించెను ముష్కరుండు —

రాముడు విడిచిన బాణము మారీచుని ప్రాణములను
గాలిలోన కలుపగ గని వెనుకకు వచ్చెడు రాముని
కెదురుగ లక్ష్మణుడేగగ రాముడు విస్మయమందెను—

'లక్ష్మణ! ఇటు వచ్చితేమి? సీతకు ఏమయ్యెనయ్యా!
రాక్షసులెవరైన నామె భక్షించగ లేదు గదా!" —

"లేదుగాని అన్నయ్యా వదిన నీదు కేక విని
చెప్పరాని ఆపదలో చిక్కుకొంటివని తలంచి
నీ రక్షణ కేగమనుచు తొందర పెట్టగ వచ్చితి"—

"అయ్యో తమ్ముడ లక్ష్మణ! అది నా కేకనుకొంటిర!
మిమ్ము భ్రాంతులను జేయగ మాయలేడి అఱచెనటుల
అయినా జగమెఱుగనట్టి అబల మాటపట్టుకొని
నీ విటు వచ్చిన ఆమెకు రక్షణెవరు పంచవటిని!"
అని ఆందోళన నిరువురు ఆత్రముతో పరుగెత్తిరి —

# సీతాన్వేషణం

పర్ణశాల సీతలేదు అనుకున్నట్లే అయినగని
"ప్రేయసి ! కన్పించవేమి ? ప్రియతమ నీవేమైతివి ? "
అని విలపించుచు రాముడు మతిభ్రమించినట్టులుగా
చెట్టు పుట్ట తొయి అప్ప అన్నీ వెదకుచు తిరుగుచు
కనిపించిన జంతుపక్షి కీటకముల నన్నిటినీ
"సీతను చూశారా ?" అని శోకించుచు అడుగ సాగె—

ఈ విధముగ రోదించుచు శోధించుచు నడచుచుండ
భూమిపైన ఒక్కచోట భగ్నరథము కన్పట్టెను
"లక్ష్మణ ! అటు చూడుము అది యుద్ధభూమిగా నున్నది"
అని కించిత్ దూరమేగ పర్వత సన్నిభుగాంచెను —

రుధిర ధార తట్టుగట్టి దేహము పూర్తిగ కప్పగ
దైత్యుడెవడొ సంతృప్తిగ సీతను భక్షించి యిచట
హాయిగ నిద్రావశుడై యున్నాడని రాముడనుచు
ధనుర్బాణ మెక్కుపెట్ట 'రామా !' అని మూల్గెనతడు
నేను రాక్షసుడనుగాను రామా ! నే జటాయువును
నీ భార్యను అపహరించి నట్టి దుష్టు నెదుర్కొంటి
ఖడ్గముతో నా రెక్కల నరికినాడు కూలబడితి
మృత్యువదే దరికొచ్చెను చివరమాట వినురామా !
మైథిలిని రావణుడను రాక్షసుడెత్తుకు పోయెను
దక్షిణాభిముఖముగ ఆ దనుజుడేగెనని చెప్పి
"హా రామా!" అనుచు పక్షి అసువుల బాసెను తృప్తిగ —

కృతజ్ఞతగ శ్రీరాముడు దహనక్రియల జరిపించగ
సాలోక్యము పొంది దివ్య లోకానికి చేరుకుంది —

## కబంధుని శాపవిమోచనం

ప్రియ వియోగ దుఃఖముతో రాముడు లక్ష్మణితోడ
జానకి నన్వేషించుచు వేతొక వనమున కరిగెను
ఆ అటవిని కాన్పించెను అద్భుత ఆకారమొకటి
చూడ దాని శిరము లేదు ఉదరమ్మున పెద్దనోరు
కళ్ళు కాళ్ళు చెవులు లేవు కదలలేని కబోది అది
కరములు అతి దీర్ఘములు కంబంధుడా రాక్షసుడు -
ఆతని యోజన దూరపు బాహువులను చిక్కుకుని
కొంత దనుక గుర్తించిరి అతని శక్తి అతని భుక్తి
ఆలసించితే ఆతని కాహారము కాగలమని
ఇరువురు కత్తులు తీసి చెతొక చేయి ఖండించిరి —
అపుడామొండెము నుండి వినిపించగ సాగెనిటుల
"దేవా మీదయచేతను నాతనువు పునీత మయ్యె
గతముననే గంధర్వుడ అతి సుందర రూపుండను
ఒక నాడష్టావక్రుని అవహేళన మొనర్చితిని
క్రుద్ధుడైన ముని నన్ను రాక్షసుండ వగు మనెను
శాపవిమోచనము కొఱకు ప్రార్థించగ దయదలచి
త్రేతాయుగమున శ్రీపతి రామునిగా అవతరించి
నీచేతుల ఛేదించును శాపాంతము అదే అనెను —
ఈ విధి రాక్షస దేహము ధరియించియు బుద్ధిలేక
దేవరాజు పురందరుని ఎదుర్కొంటి మూర్ఖంగా

వజ్రాయుధమున నాతడు శిరోభాగ మెగురగొట్టె
ఆ దెబ్బకు తల పాదము లుదరము లోనికిపోయెను
ముఖము లేని వాడెట్టుల బ్రతుక గలడు దేవేంద్రా !
ఆహారము తినకుండగ ఆతడెట్లు జీవించును ?
అనుచు దయామయులంతా అతని చేరి విన్నవింప
ఉదరమందు ముఖముండును చేతులు యోజన ముండును
అని కోపము తగ్గి పలుక యీ అడవిని బడిపోతిని
చేతికందు పక్షులనూ, జంతువులను, పాంథులను
నిర్జించుచు భక్షించుచు జీవించుచు నుంటి నిచట
నన్నిప్పుడు దయతోడను నిప్పులలో తగుల బెట్టు
పూర్వరూపమును పొంది మార్గదర్శయిత దెలిపెద" —
దాశరథి కబంధుని దగ్ధము చేయగ వింతగ
దివ్యమోహనాకారము తేజముతో ఎదుటనిలచి
"హిరణ్య గర్భః తే సూక్ష్మం దేహం స్థూలం విరాట్స్మృతమ్"
సూక్ష్మరూపుడుగ నిన్ను కాంచన గర్భుడు అందురు
స్థూలదేహుడుగ దేవా ! విరాట్ విరాట్టనుచుందురు
ఈ నలుబది భువనములూ అన్నీ నీ అంగములే
నీ పాదము పాతాళము మహాతలము నీమడమ
రసాతలము తలాతలము నీదు చీలమండలు గన
సుతలమనే అధోలోక మే పిక్కలు నీకు ప్రభూ !
అతల వితల లోకమ్ములు నీ ఊరువులేగాదా !
జఘనమె యీ భూలోకము నభోలోకమే నాభి
వక్షము జ్యోతిర్లోకము మహర్లోకమే కంఠము

జనలోకం నీవదనం తపోలోకమే భ్రుకుటి
సత్యలోకమే శీర్షం సూక్ష్మదృష్టి పరికించగ
ఇంద్రాదులు బాహువులు దిక్కులన్ని నీ శ్రుతులు
నాసికపుట అశ్వినులు అగ్నిహోత్రుడే ముఖము
ఆదిత్యుడు నీ నేత్రం నీ మనస్సు సుధాకరుడు
కాలము భ్రూవిక్షేపము వాక్పతి యగు బ్రహ్మబుద్ధి
అహంకారమే రుద్రుడు నీవాక్కులె వేదములు
యముడు నీదు దంతము దివి తారలు నీ పలువరుస —

హాసము మాయాశక్తి నీ వీక్షణమే సృష్టి
ధర్మము ముందరభాగము అధర్మమ్ము పృష్ట మగును
నీ నిమేషోన్మేషణె జగతికి రాత్రింబవళ్ళు
సప్తసముద్రము ఉదరము రక్తనాడులే నదులు
వృక్షలతా గుల్మములె నీ శరీర రోమములు
వర్షము నీ రేతస్సు జ్ఞానశక్తి నీ మహిమ
ఇది మననము చేసికొనిన అనాయాస మరణ మొచ్చు" —

"నమస్తే రామభద్రాయ వేధసే పరమాత్మనే
అయోధ్యాధిపతయే తుభ్యం నమః సౌమిత్రి సేవిత"

"నమోదేవ ప్రణామములు నాకు మోక్షమొసగు తండ్రి!"
అన రాముడు ఆర్ద్రితతో పరమపదము పొందుమనెను—

వరము బడసి గంధర్వుడు శ్రీరాముని కిట్లనియెను
రఘునందన ఆముందర శబరి ఆశ్రమమ్మున్నది

10)

పరమ భక్తురాలు శబరి మార్గదర్శయిత" అనుచు
ఆజ్ఞపొంది గంధర్వుడు అంతర్హితుడై చనెను—

## శబరి ఆతిథ్యం

శ్రీరాముడు వెనువెంటనె శబరిని దర్శించనేగె
ఎదురు వచ్చి స్వాగతమిడి వేదిక చూపించి శబరి
భక్తిని రాముని పాదము ప్రక్షాళన చేసినది
ఆ జలములు శిరముపైన అమిత భక్తి జల్లుకొని
అమృత సదృశ ఫలముల సమృద్ధిగ తినబెట్టి
పరమాత్మా ! నాగాధను వినుమని విందుగ జెప్పెను
"ఇక్ష్వాకుల తిలకా ! నే నీ ఆశ్రమ నివాసిని
నాగురువులు నిరత మిచట యోగ దీక్షనుండువారు
వారికి సేవలు చేయుచు వేలఏండ్లు గడిపితిని
ఈమధ్యనె వారందఱు సత్యలోకమున కేగుచు
శబరీ ! ఇక్కడె ఉండుము త్వరలో రాముడు వచ్చును
సనాతనుడు పరమాత్ముడు శ్రీరాముడు అవతారుడు
అచలభక్తితో నాతని ఆరాధన గావించుచు
దాశరథిని చూసి అపుడు దేహము దగ్ధము చేసుకు
ఆ లోకము రమ్మనమని ఆనతిచ్చి వెడలినారు
ఏకాకిగ ఈ రీతిగ ఏకాగ్రత సేవించుచు
మనము నిన్నె ధ్యానించగ మాట సత్యమొనర్చితివి
అయ్యా నే మూఢురాల అడవి జాతి అబల నేను
దరిశన భాగ్యమ్ము నొసగి ధన్యురాల జేసితివి"—

అన రాముడు ప్రతిపలికెను "శబరి నే చెప్పవలెన !
నాగరికత, జాతి, లింగ, నివాసముల పనిలేదు
ఎక్కడున్న ఎవ్వరైన భక్తికి అందఱు అర్హులె
భక్తియు తొమ్మిది రీతులు ముక్తికి యిల మార్గములు—

సదానన్ను స్మరియించుట మొదటి భక్తి సాధనము,
నాకథ ఆలాపనము నేను మెచ్చు రెండవది,
సద్గుణముల కీర్తనము మూడవదని ఎఱుంగుము,
నామాటల వ్యాఖ్యానం నాల్గవదని తెలిసికొనుము,
నిష్కపటముగా గురువుగ నుపాసించు టయిదవది,
యమ నియమాదుల నిష్ఠను పూఁణించుట ఆఱవది,
నామంత్రం నానామం ధ్యానించుట ఏడవది,
నీ భక్తుల పూజించుట సర్వభూతముల నన్గని
శమదమముల కలిగి విషయ విరాగౌట అష్టమము
నాదు తత్త్వవిచారణే నవమ మార్గమీ జగతిని
శ్రద్ధతోడ ఏరితిని సేవించిన సిద్ధిగలుగు —

ముదితా నిలువెల్ల భక్తి ముద్రితవైతివి నీవు
కనుకే నీదర్శనమున కే వచ్చితినో అవ్వా !
నా సతి జాడను కనుగొను మార్గము తెలిసినచెప్పుము" —

రామా నీ వెఱుగనిది ముజ్జగముల ఏమున్నది ?
అయినా లోకానుసరణ మునకే నే చెప్పుచుంటి
ఈ ప్రక్కనె పంపయనే సరోవరము కాన్పించును
ఆ ప్రక్కనె ఋష్యమూక పర్వతమున్నది ఎత్తుగ

దానిపైన 'సుగ్రీవుడు' వానర రాజున్నాడు
అతులిత బలశాలి బుద్ధి మంతులు మంత్రులు వానికి
ఋష్యమూక గిరికి వెళ్ళి సుగ్రీవుని మైత్రి పొందు
నీ కార్యము అతని వలన కాగలదని చెప్పి ఆమె
"జరాభార మింక నేను భరియించగ లేకుంటిని
నిను జూచుచు మరణించిన పరమపదము పొందగలను"
అని వహ్నిని ప్రవేశించి వదలెను భౌతిక దేహము
రాముడు ఆశీర్వదింప ఆమె మోక్షమందినది —

ఆధ్యాత్మ గేయ రామాయణం
అరణ్యకాండ సమాప్తం



# కిష్కింధకాండ

## సుగ్రీవమైత్రి

"నానా పుష్పలతాకీర్ణం నానాఫల సమావృతమ్
సతాం మనః స్వచ్ఛజలం పద్మకింజిల్కవాసితమ్"
నానాఫల పుష్పాదులు సువాసనలు గుబాళింప
హంసలు కారండపములు చక్రవాక వనపక్షులు
నీటికోళ్ళు, క్రౌంచములు, జలపక్షుల రవముల
పంపాతీరము ఎంతో ఇంపులీనుచుంట జూసి
సరోవరము నీరుత్రాగి సేదదీర విశ్రమించి
అన్నదమ్ము లిరువురునూ ఋష్యమూకమును చేరిరి—
పర్వత శిఖరమ్మునుండి పరికించిన సుగ్రీవుడు
మంత్రులలో ప్రముఖుడైన మారుతాత్మజుని బిలిచి
"వాలి నన్ను వధియించగ పంపినట్టి వారలేమొ !
వాతాత్మజ ! రూపు మార్చి విప్రవరుడుగా వెళ్ళి
నేర్పుగ సంభాషించి నిజ నిర్ధారణ చేసి
కీడుచేయు వారలైన కరములెత్తి సైగ నిమ్మ
ప్రతిఘటనకు కావలసిన యత్నము ప్రారంభింతుము"
7"గచ్ఛే" అని పవనసుతుడు వటునివేషమునవచ్చి
భువన మోహనా కారులు పురుష సింహులగు మీరలు
భూభారము తగ్గించగ భక్త జనుల రక్షించగ
మరల భువిని పుట్టినట్టి నరనారాయణులా ఏమి ?
బాబూ మీరెవ్వరనుచు ప్రియభాషణ మొనరించగ

"అయ్యా ! నే రాముడను తమ్ముడు లక్ష్మణుడితడు
దండక వనమున మదీయ భార్య నొకడు అపహరించె
ఆమెను అన్వేషించుచు అరుదెంచితి మిచ్చటికి
అది సరియే మీరెవ్వరు ? ఎవరి వారలో చెప్పుడు" —

"సుగ్రీవుడు మారాజు ఈ గిరికాపుర ముండెను
స్వార్థ చిత్తుడగు వాలి సుగ్రీవుని అగ్రజుడు
సుగ్రీవుని భార్య 'రుమ'ను దారుణముగ చెఱబట్టి
నిర్దయతోడను తమ్ముని తఱిమి తఱిమి వెడలగొట్టె
తిరిగి శక్తి కూడ గట్ట యీగిరి నధిరోహించెను —

సుగ్రీవుని సచివుడను మరుత్ పుత్రుడను నేను
అంజని నా తల్లి ప్రభూ ! హనుమంతుడు నాపేరు
మారాజగు సుగ్రీవుని మైత్రి మీకు మంచిదగును
అతని భార్య నపహరించి నట్టి వాలి చంపిన మీ
కవసరమగు సహాయమ్ము అతడు సమకూర్చగలడు
సమ్మతమైతేరండు సుగ్రీవుని చూపింతును" —

"హనుమా ! నే వచ్చినదె ఆతనితో మైత్రికొఱకె
సుగ్రీవుని కార్యమ్మును సత్వరముగ నెఱవేర్తును
ఒకే బాణ మొకేమాట ఒకే భామ రామునకు" —

అనవిని హర్షాతిరేక మినుమడింప హనుమంతుడు
నిజరూపముతోడ ఎదుట నిలిచెను మది పరవశుడై
వారిని భుజముల నిడుకొంచి శిఖరాగ్రముపైకెగిరెను
తెప్పపాటులో వచ్చెను వృక్షఛాయలో దించెను —

రయమున సుగ్రీవుచేరి భయము మనకు లేదనియెను
వచ్చినవాడతి బలుడు రామనామధేయుండు
నరపుంగవుడతడు మైత్రి నెఱపుటకే వచ్చినాడు
నమ్మి అగ్నిహోత్రు సాక్షి నెయ్యము నెఱపుము నీవన
రోమాంచిత పులకితుడై రాముని సన్నిధికి వచ్చె —

రాముడు వృక్షచ్ఛాయను నిలబడి యుండుట గాంచి
సుగ్రీవుడు స్వయముగ నొక తరుశాఖను కోసి తెచ్చి
శ్రీరాముని కాసనముగ సమకూర్చి గౌరవించె —

మరుత్పుతుడు లక్ష్మణునకు మఱొక కొమ్మ తెచ్చి యిచ్చె
మర్యాదగ దాని నతడు సుగ్రీవున కందించెను —

జరిగిన వృత్తాంత మంత లక్ష్మణుండు వివరించగ
"రామా మము నమ్ముము నీ మిత్రులుగా స్వీకరించు
నీ వైరిని నిర్జింపగ సర్వస్వము ఒడ్డెదము

## సీత ఆభరణాల మూట

అన్నట్టొక విషయము మీ దృష్టిని పెట్టుచునుంటిని
ఆమధ్యొకనాడు మేము కొండపైన కూర్చుండగ
రామా రామా యంటూ స్త్రీ రోదన వినిపించెను
ఆకాశము నుండి అపుడు ఆభరణపు మూటపడియె
వానిని గుహలో దాచితి అవి సీతవి అగునేమో !
వీక్షించుడు" అని తెచ్చి రాముని ముంగిట పెట్టగ
"హా సీతా ! హా సీతా !" అని గుండెకు హత్తుకొనుచు
"సీతాభరణములే ఇవి సుగ్రీవా ! కృతజ్ఞతలు" —

అన వానర రాజులేచి రాముని హస్తములబట్టి
"సీతాన్వేషణ భారము స్వీకరించుచుంటి ఇపుడె"
అన ప్రతినను చేయ నగ్ని హోత్రము రగిలించబడియె
అగ్నిసాక్షిగా ఇరువురు ఆత్మీయాలింగనముల
కరచాలన మొనర్చుచూ మైత్రిని ప్రకటించుకొనిరి —

## వాలి సుగ్రీవుల వైరం

తదుపరి ఆ సుగ్రీవుడు రాముని దరిజేరి తాను
నివాసముగ ఋష్యమూక మెన్నుకొన్నరీతి తెలిపె...
"మయుని కొడుకు 'మాయావి' మహావీర బలశాలి
దుర్మదమున వాలిపైన దండయాత్ర సాగించగ
మహాబలుడు వాలి తనదు ముష్టిని బిగబట్టికొట్టె
ఆ దెబ్బకు మాయావి అదిరిపోయి బెదరిపోయి
ప్రాణభయముతో పరుగున గుహలోనికి పాఱిపోయె—

అతనిని వెంటాడ వాలి ననుసరించి నే వెళ్ళితి
ఆ గుహలోనికి వెళ్ళుచు ఆగుమిక్కడనెను అన్న
అక్కడ నిలబడి మాసము దినములు గడిచెనుగానీ
వాలి తిరిగి రాలేదు సెలయేఱుగ రక్తమొచ్చె
స్థాన బలిమితో వాలిని లోపల మాయావి చంపి
యుండును అని భయపడి ఆ గుహకడ్డుగ బండ బెట్టి
దుఃఖించుచు తిరిగి వచ్చి జరిగిన సంగతి చెప్పితి
ఎంతగ వారించినను బలవంతము చేసినన్ను
జనులు, మంత్రి, సామంతులు వానర రాజుగ జేసిరి —

కొంతకాల మిట్లు గడిచె ఇంతలోన వాలి వచ్చి
దారుణమగు భాషణముల దూషించుచు ద్వేషించుచు
ముష్టిఘాతములనాదగు మేను కుళ్ళబొడుచుచుండ
బాధలను భరించలేక వ్యథతో కిష్కింధ వదలి
భూమండల మెల్ల తిరిగి ఋష్యమూకమును చేరితి
ఈ కొండను వాలి యిపుడు అడుగిడ జాలడు వినుడు
మతంగముని శాపమతని నిరోధించె నీ గిరికి —

## దుందుభి మరణం

'దుందుభి'యను రాక్షసుండు ఎదిరి బలము నెఱుగకుండ
మహామహిషరూపముతో మోరగాసుకొని వచ్చి
అర్ధరాత్రి యుద్ధానికి వాలిని ఆహ్వానించెను —

విక్రముడగు వాలి అతని వెన్ను విఱిచి తన్నిపెట్టి
శరీరమును లాగి పట్టి శృంగములను మెలిపెట్టి
మట్టుబెట్ట విసిరికొట్ట మతంగాశ్రమమున బడెను
చెదరి మీద పడిన రక్త బిందువులకు మతంగుడు
"వాలి యిచటి కడుగిడ తల వేయివ్రక్కలగుసుగాక"
అని శపించుటను జేసి నేనిచ్చటి కొచ్చి యుంటి —

నన్నిట్టుల తఱిమికొట్టి నానా తిప్పలు పెట్టుచు
నా భార్యను చెఱబట్టి నన్నుభ్రష్టు జేసినాడు
ఈ విధి నే దీనుడనై హీనుడనై కుందు చుండ
దేవర ! మీదర్శనము ఊఱట కలిగించె నేడు" —

సుగ్రీవుని గాథ వినగ  రాముని హృది ద్రవించెను
"వ్యథ చెందకు సుగ్రీవా!  నే వాలిని వధించెదను"—

## వాలి బలం

వరదా శత వందనములు  వాలి బలము తెలుపు చిహ్న
మదే కదుప వశముగాని  దుందుభి తల చూడు డనగ
రాముడు తన కాలి బొటన  వ్రేలితోడ దాని మీటె
పర్వతముగ నున్న శిరము  పదియోజనముల పడెను
చూచుచున్న వారెల్లరు  సంభ్రమ విభ్రాంతులైరి —
"రామా! మఱియొక సంగతి  ఎఱుక జేసెదను వినుము
సప్తతాళములు అవిగో  చాలాబలమైన చెట్లు
ఒక్కొక దానిని వాలి  ఊప ఆకులన్ని రాలు"—
అనగా ధనువును తీసుకు  రాముడు బాణమ్ము వేయ
సప్త తాళ వృక్షమ్ములు  లిప్తలోనె కూలిపోయె-
పరికించిన సుగ్రీవుడు  పరమాత్ముడె రాముడనుచు
ప్రస్తుతించి ప్రణతు లిడుచు  రామపాదముల బడెను —

## సుగ్రీవవైరాగ్యం

"పూర్వజన్మలో ఏవో  పుణ్యమ్ముల జేసికొంటి
కావుననే స్వయముగ నిను  గాంచ గల్గితిని దేవా!
మహాభాగ్యమును పొందియు  మోక్షమార్గమును వీడి
క్షణికమైన ఐహిక మగు  సుఖములనే కోరనింక —
దారాపుత్రులు, ధనము,  రాజ్యం, నీమాయలీల
మట్టికొఱకు భూమి త్రవ్వ  నిధి దొరికిన యట్లయినది

నేడు శత్రువును జయింప దీక్షలేదు కాంక్షలేదు
పత్ని సుఖమందు కూడ ఇచ్ఛలేదు వాంఛ లేదు
స్వచ్ఛమైన మనసుతోడ మీ సేవనె చేసికొందు
సత్వరజస్తమోగుణము లే పెంచును అజ్ఞానం
అజ్ఞానమె కలిగించును శత్రుభయం మృత్యుభయం
ఆ భయమే అంధకార బంధురమున పడవేయును
వద్దు నాకు రాజ్యమింక వాలి నేలుకొననిండు"
అని పలికెడి సుగ్రీవుని వీపు తట్టి శ్రీరాముడు
"సత్యములే నీ మాటలు సంశయ మావంతలేదు
అని వాలిని వదలిన ధర అధర్మమ్ము చెలరేగును
అగ్నిసాక్షిగా మైత్రిని సుగ్రీవునితోజేసి
చేసిన దేమిటి రాముడు ? అని జన అపవాదు వచ్చు
కావున కిష్కింధకేగి వాలిని పిలు యుద్ధానికి
అతనిని వధియించి నిన్ను అధిపతి చేయుట నావిధి" —

## వాలి సుగ్రీవుల యుద్ధం

అనగా మాఱాడలేక సుగ్రీవుడు పోయి "వాలీ!"
యుద్ధానికి రమ్మంటూ పెద్దగ గొంతెత్తి పిలిచె
వాసవ పుత్రుడు వాలి కోపముతో క్రోధముతో
రోషారుణ నేత్రమ్ముల రణభీకరుడై వచ్చి
ఒడలు మఱచి సుగ్రీవుని పిడికిలితో మోదసాగె—

కవలల వలె ఒకేలాగ కన్పించుటచే రాముడు
ఎవరెవరో తెలియలేక శరము విడువ లేకపోయె —

సుగ్రీవుని దేహమంత సుగైర క్తము గ్రక్కుచు
గతిగానక ఋష్యమూక గిరివద్దకు పాతొచ్చెను —
"రామా! రణమునకు పంపి రక్షింపగ రాగలనని
నన్ను కర్మకొదిలిన నీ మనసున గల మర్మమేమి?
తెలిసి ధర్మమెప్పుడు నే నతిచరించి తిరుగలేదు
నీదుపట్ల అపచారం ఎఱిగి చేసి యుండలేదు"
అని కుందుచు వ్యథచెందుచు కూలబడెను కపివర్యుడు—

ఆతని వేదన చూసిన రాముని మది తల్లడిల్లె
"అన్యము తలపకు మిత్రమ అసలు విషయమదికాదు
అన్నదమ్ములిద్దఱునూ ఒకేలాగ ఉండుటచే
వాలిని గుర్తించలేక బాణము విడువగలేదు
ఇక యీ భ్రమకలుగకుండ ఒక గుర్తును ఏర్పఱచెద"
అని సుగ్రీవుని మెడలో పూలమాల నొకటి వేసి
ధైర్యవచనములు చెప్పి తిరిగి యుద్ధమున కంపెను—

## తార వాలిని నిరోధించుట

కిష్కింధకు పోయి సింహ గర్జన చేయగ వాలి
క్రోధముతో రౌద్రముతో యుద్ధభూమి కరుగుచుండ
భార్య తార ముందుకొచ్చి వారించెను నిరోధించె
"పాఱి శత్రు వింత త్వరగ మరల తిరిగి వచ్చుటయా!
ఎవరో బలశాలి సాయ మందియుండునని తోచెడు" —
"సుందరి! నీ సందేహం భ్రమమాత్రమె పరిత్యజించు
శీఘ్రముగా శత్రువుని సంహరించి నే వచ్చెద

సహాయుడుగ ఎవడొచ్చిన వాడి పనీ కూడ సరి
గుమ్మము కడ శత్రువుండి రమ్మని పిలుచుచు నుంతగ
ఊరకింట కూర్చుండుట వీరలక్షణము కాదు"—

నాథా! మన అంగదుండు వేటకుజని వినినవార్త
రఘుకుల తిలకుడు రాముడు సీతాన్వేషణ కొఱకై
సుగ్రీవుని స్నేహితునిగ స్వీకరించి నాడంట
కనునే సుగ్రీవుడింత త్వరలో రాగలిగినాడు
రామసాయమున నేడు సుగ్రీవుడు బలవంతుడు
సాదరముగ అతని పిలచి యువరాజుగ చేయుడనియె —

"తారా! వచ్చినవాడు రాముడైన బహుమేలే
అతడే నిజముగ వచ్చిన అభివందన మాచరించి
ఆహ్వానించెద నింటికి ఆతనిపని నేజేసెద
రాముడు రాకుండ ఒక్క సుగ్రీవుడె వచ్చినచో
నిమిషములో నేలగూల్చి నీ మ్రోలను వ్రాలగలను"
మానిని నీ వడ్డు తొలగు మని సమరము సేయనరిగె—

## వాలి వధ

సుగ్రీవుడు వాలిని పైకెగిరి గుండెపై తన్నెను
వెనువెంటనె రోషముతో వాలి ముష్టితో కొట్టగ
చెట్టుచాటునుండి నిశిత దృష్టి నిగిడ్చిన రాముడు
సుత్రాముని చే పొందిన శరమును బయటకు తీసి
మాల గుర్తుచూసి వాలి గుండెకు గురిపెట్టికొట్టె
వాలికి అది తగిలి నేల వృక్షమువలె కూలిపోయె—

"రామా నే చేసినట్టి అపకారము నీ కేమిటి ?
చెట్టుచాటునుండి కొట్టు టనునది యుద్ధవిరుద్ధము
జన నిందను, అపకీర్తిని తెచ్చుకొంటి వేమిరామ ?
సీతాన్వేషణ కొఱకే సుగ్రీవుని జతకట్టిన
ఆ పని అతిసులభముగా నేనే చేసెడి వాడనె !
నీవు నేడు చేసిన పని నికృష్టము అతి నీచము"
అని నిందించెడు వాలికి రాముడిట్లు బదులు పలికె—

"ధర్మ రక్షకుడను నేను అధర్మమ్ము సహించను
తన పుత్రిక, తన సోదరి, సోదరపత్ని, కోడలు
ఇందెవ్వరి రమించినా ఘోరనేరమధర్మము
మాటుగాసి అట్టి మృగము వేటాడుట తప్పెట్లగు ?
బలాత్కారముగ తమ్ముని భార్యను పొందుట ధర్మమ ?
అధర్మమ్ము ఖండించగ నిర్వధించ వలసివచ్చె
ధర్మ స్థాప నార్థాయ "సంభవామి యుగే యుగే"—

ఈ వాక్కులు దైవానివి సాక్షాత్ విష్ణువె రాముడు
అనుచు ఆత్మ ప్రబోధింప అమితానందమున వాలి
"రామా ! హే పరాత్పరా ! మూర్ఖుడ నను మన్నింపుము
నీ చేతను మరణముతో నాజన్మము ధన్యమయ్యె
దీక్షాపరులకు గూడా దుర్లభమగు నీదర్శన
మంత్యకాలమందైనా దొరకుట నా పుణ్యఫలము—

నాకుమారు డంగదుడు నాతోడను సమబలుడు
కరుణ నతని కావుమయ్య ఈబాణము తీయుమయ్య"—

అని ప్రార్థన గావింపగ రాముడు బాణము తీసెను
ఇంద్రాంశుడు వాలి తండ్రి దేహములో లీనమయ్యె—

## తారావిలాపం

"నిహతం వాలినం శృత్వా తారాశోక విమూర్ఛితా"
వాలి నిహతుడైనాడని వినిన తార మూర్ఛనొందె
స్మృతిరాగా గతిగానక తలగుండెల బాదుకొనుచు
పరుగెత్తెను రణభూమికి పతిశవమును కనుల జూసె
నాథా నాథా యంటూ నేలకూల బడెను దేవి
ఘొల్లుమనుచు పడిదొర్లుచు ఎదుటనున్న రామునితో
రామా! వాలిని చంపిన బాణముతో నన్ను చంపు
నాథుడు లేనట్టి బ్రతుకు నాకీ జగతిని వలదని

## రాముని జ్ఞానోపదేశం

భోరున విలపించుచున్న తారనుగని శ్రీరాముడు
"అమ్మా! నీపతి ఎవరు? అతని దేహమా? జీవుడ?
దేహమె నీపతియైతే దుఃఖించగ పనిలేదు
చర్మం మాంసం రుధిరం అస్థులు కూడిన దేహం
నీ ఎదుటే ఉన్నదిగద! ఏల విచారించెదవు?
పంచభూతముల కూడిన యీ దేహము అనిత్యము—
పూర్వజన్మ కర్మబట్టి జీవుడు దేహము పొందును
జీవుడు నాశన రహితుడు నిరాకార నిరామయుడు
ఒకేదాని కెల్లప్పుడు అంటిపెట్టుకుండబోడు
ఉండబోని జీవునికై శోకించుట వ్యర్థముగద!" —

"అయితే సుఖ దుఃఖాదులు దేనికి సంబంధించును?"—
అనుచు తార ప్రశ్నించగ అవతారుడు చెప్పసాగె
"అహంకార సంబంధో యావద్దేహేంద్రియైః సహ"
"జీవుడు దేహేంద్రియముల బంధము పెనవేసుకుని
'నేను' 'నాది' అనుకుంటే సుఖదుఃఖములతని కంటు—
సంసారము మిథ్యఅని అజ్ఞానము తెలియనీదు
స్వప్నమందు కనిపించెడు మిథ్యాసత్యము నిత్యమ?—
రంగులేని స్వచ్ఛమైన స్ఫటికము వంటిది జీవుడు
మంకెనాది రంగుపూలు దాని సమీపము నుంచిన
స్ఫటికము ఆ రంగులోనె కనిపించును చూడలేద?
అట్లే జీవుడు కూడా దేహేంద్రియ వికారముల
సంసారపు పుటాకార దర్పణమున కనిపించును
సంసారపు చక్రమందు పరిభ్రమించు వారలకు
సత్సాంగత్యము కలిగిన విజ్ఞానము వికసించును
భగవంతుని యందు నిరత భక్తి భావమున మునుగును
జీవునికీ స్థితి కలుగుటె ముక్తి మోక్షము అందురు—
జ్ఞానము కలుగంగ ఆత్మ పరమాత్మను లీనమగును
కర్మఫలము అనుభవింప జన్మల నెత్తక తప్పదు
ఇదియె సృష్టి రహస్యము దేనికొఱకు దుఃఖింతువు?"—
రాముని యీ బోధనకు తార మనసు మాయవీడె
ఆత్మజ్ఞానమును పొంది అతని ప్రేమోల సాగిలపడె—
పుత్రునిచే వాలియొక్క పార్థివ దేహమున కపుడు—
యథాశాస్త్ర విహితముగా దహన క్రియల జరిపించెను—

## సుగ్రీవ పట్టాభిషేకం

అనంతరము సుగ్రీవుడు "రామా! వానర రాజ్యము
పాలింపుము నీ పాదా క్రాంతుడనై నేనుండెద"
అని భక్తిని పలుకుచుండ రాముడతని మెచ్చి," ఎపుడు
కాంక్షింతును మీ క్షేమము కిష్కింధకు రాజువీవె
అంగదుని యువరాజుగ అభిషేకించుము నీతో
నగరము నే ప్రవేశించ రాదుగనుక లక్ష్మణుండు
ప్రజల సమక్షంబున ప ట్టాభిషేక మొనర్చును
వర్షఋతువు పోవు దనుక దరిలో యీ ప్రాంతములో
'ప్రవర్షణ' పర్వతగుహ లోపల కాపుర ముందుము
వర్షమ్ములు వెనుకబడిన వెంటనె సేనలపంపి
సీతాన్వేషణ కొఱకై యత్నము ప్రారంభించుడు"
అని పలికి అనుజునంపి ప్రవర్షణము తాజేరెను—

## భగవదారాధన క్రమ వివరణ

కొండపైన శ్రీరాముడు గగనము వీక్షించుచుండ
జలపూరిత మేఘమ్ములు గజయూధమువలె కన్పడె
గాలివీచి కదలించగ మేఘము గర్జించుచుండ
బంగరు కిరణముల కాంతి జిగేల్మంటు మెఱయుచుండె
ప్రకృతి యీవిధి రాముని పరవశింప జేయుచుండె—।
లక్ష్మణు డొకనాడు అన్న రామన్నను ప్రశ్నించెను
భగవంతుని ఆరాధన క్రమమెట్టిది తెలుపుమని—

"హృదయమందు,అగ్నియందు, ప్రతిమయందు.సూర్యసందు.
సాలగ్రామ శిలయందు ఏదో ఒకదాని యందు
దైవము నారోపించి పూజించుట క్రమపద్ధతి —
ప్రాతఃకాలమునలేచి కాలకృత్యములు దీర్చుకు
స్నానాదుల నొనరించి సంధ్యావందనము జేసి
ఆగమోక్తముగ మదిలో సంకల్పము చెప్పుకొని
ఉద్దేశించిన ప్రతిమ శిలతో చేసినదైతే
సంకల్పానంతరమున స్నానము చేయించవలెను
కుంకుమగరు గంధపుష్ప అక్షతలను అర్పించిన
సిద్ధిని చేకూర్చగలదు చిత్తశుద్ధి అవసరము
ప్రశ్నలేని ఆరాధన పూర్ణభక్తితో పూజ
ప్రతిమకు తగు అలంకరణ ప్రీతితోడ చేయవలె—
అగ్నియందు ఆరోపణ చేసుకున్న ఉపాసకుడు
తద్దేవత మంత్రమ్ముల భక్తితోడ ఉచ్చరించి
పూజాద్రవ్యములనెల్ల హోమమందు ఉంచవలెను —
ఎదురుగ దర్భలుగానీ తోలుగాని గుడ్డగాని
ఆసనముగ ఏర్పఱచుకు దానిపైన కూర్చుండి
పూజా కలశము నెదురుగ వామభాగమున బెట్టి
పుష్పాదుల కుడివైపున ఉంచుకు పూజించవలెను—
మధుపర్కం, ఆచమనం, అర్ఘ్యం, పాద్యం నాలుగు
సమర్పింప వేఱువేఱు జలపాత్రల నుంచవలెను—
ఉపాసకుడు దేవుని చై తన్య రూపమును తనలో
వ్యాపించిన యటుల మదిని భావన కలిగించుకొని

ఆవాహన చేసి అట్టి తేజము ప్రతిమను చూచుచు
అర్ఘ్య పాద్య మాచమనం స్నాన వస్త్ర భూషణములు
చందన కర్పూర కుంకు మాక్షతలు అగురులతో
మంత్రయుక్తమగు పరిమళ సుమములతో పూజించి
శ్రద్ధతోడ నీరాజన ధూప దీప నైవేద్యం
తాంబూలం సమర్పించి సంతృప్తిగ సేవించి
పూజాక్షత పుష్పాదుల భగవత్ప్రసాద మనుచు
శిరసున ధరియించి పాదు కలను నెత్తి పెట్టుకుని
తొంబ్బగుంట బ్రతుకునుండి రక్షించుముదేవా ! అని
సాష్టాంగ ప్రణామమ్మిడి ఉద్యాపన చేయగవలె —
ఈ విధముగ పూజించిన ఇహపర సౌఖ్యములు కలుగు
ప్రతిదినమూ పూజించిన సారూప్యము సిద్ధించును"—
ఇట్టి చర్చలను జేయుచు వర్షాకాలము గడిపిరి—

## సుగ్రీవుని ప్రమత్తత

కిష్కింధను సుగ్రీవుడు రాజభోగముల తేలుచు
రాముని పని ఏమఱచగ హనుమంతుడు హెచ్చరించె
"రాజా ? ఈ భోగమ్ములు ఎవరివల్ల వచ్చినవి ?
ఆతని పని విస్మరించి అధోగతికి పోవద్దు
నీ ప్రతిజ్ఞ నెఱవేర్చక యున్నకృతఘ్నుడవగుదువు—
మొనగాడగు మహాబలుని వాలిని చంపెను నీకై
వాలిని వధియించినట్టి వానికి నీవనగ నెంత ?
దుర్బుద్ధిగ భావించి నిన్ను సంహరించగలడు"—

ఇది విని భయభ్రాంతుండై సుగ్రీవుడు ఆనతిచ్చె
"హనుమా! పదివేలమంది బలశాలుర నలుదిశలకు
పంపియు పక్షములోపల వానరులందఱ రమ్మని
వర్తమానమంపు రాని వారికి మరణమె శిక్ష"—
"9ఔా మల్లా అప్లే" యని వాయుసుతుడు వార్తలంపె—

## లక్ష్మణు ఆగ్రహం

"వర్షఋతువు గడచి పోయె శరదృతువు సాగుచుండె
ఏమీ సుగ్రీవుడిటకు రాడాయెను ఏ మాయెను?
తమ్ముడ! నీ వెళ్ళివారి స్థితి గతులను తెలిసికొని
వార్తతెమ్ము దానిపైన కర్తవ్యము యోచింతము"—
అని రాముడు లక్ష్మణుని ఆదేశించగ వేగమె
సౌమిత్రుడు వెళ్ళి చూడ సుగ్రీవుడు 'రుమ' కౌగిలి
విలాసాల కులాసాల మద్యపాన మత్తునుండె
ఒడలు మండి లక్ష్మణుండు వింటి నారి సారించగ
హనుమంతుడు, అంగదుడు, తారాదులు పరుగునొచ్చి
కోపము తగ్గించుకొని రాజును కాపాడమనిరి—
"భవత్ప్రసాదాత్ సుగ్రీవః ప్రాప్తసౌఖ్యో మహామతిః"
"మీవల్లనె సుగ్రీవుడు మరల సుఖము పొందినాడు
మతిమంతుడె కాని అతడు చిరకాలము దూరమైన
మద్యానికి, కామానికి దాసుడుగా మాటి మీదు
సేవకు రాలేకపోయె సైరించుడు యీ తప్పును—

రామకార్య విస్మరణము జరుగలేదు అటు చూడుడు
అరుగో వానరసైన్యము ఎల్లర పిలిపించినాడు
అందఱితో కలిసినేడు రాముని దర్శించనుండె
అభయమిచ్చి శ్రీరాముని దర్శన భాగ్యము నొసగుడు"—

శాంతించిన లక్ష్మణుండు సిగ్గుపడెను తనచర్యకు
అర్ఘ్యపాద్యముల నాతని అర్చించెను సుగ్రీవుడు
కపిమూకలు వెంటరాగ 'ప్రవర్షణ'కు బయలుదేఱె —

## సుగ్రీవాజ్ఞ

శ్రీరాముని చూడగనే సుగ్రీవుడు కాళ్ళనుబడి
కాలాతీతము జరిగిన దానికి మన్నింపు డనెను —

వచ్చిన బహు బలశాలుర ఒక్కొక్కరి పరిచయాలు
ప్రారంభించెను రాముని మదిసంతస మొందునట్లు
"హిమవంతము, వింధ్య, మేరు మంధర, కులపర్వతముల
నానాద్వీప నివాసులు పర్వత బలసంపన్నులు
అసంఖ్యాకులైన వీరు కామరూప ధరులు ఘనులు
సర్వయుద్ధ విశారదులు స్వామి భక్తి పరాయణులు
అమిత బలులు, మహాఘనులు అత్యద్భుత బలశాలురు
శత్రువుతో యుద్ధమునకు సంసిద్ధులుగా వచ్చిరి —

ఎలుగుల రాజితగాడు పేరు జాంబవంతుండు
కోటి ఋక్షముల పెద్ద మహామంత్రి నాకిప్పుడు —

వినుతకీర్తి విక్రముడు విఖ్యాతుడు హనుమంతుడు
వాయుపుత్రుడూ తేజుడు బుద్ధిశ్రేష్టుడగు సచివుడు

నీలుడు, నలుడు, గవయుడు, గంధమాదనుడు, పనసుడు
గవాక్షుడు, వలీముఖుడు, శరభుడు, మైందుడు, ద్వివిదుడు,
దధిముఖుడు, సుషేణుడు, తారుడు, గయుడు, కేసరి
వానరశ్రేష్ఠ విశిష్ఠులు, కేసరి హనుమాన్ జనకుడు—

వీరందఱు ప్రధానులు వీరపరాక్రమశాలురు
ఒక్కొక్కడు ఒకో కోటి వానరులకు నాయకుడు
అంగదుడీతడు బలమున తండ్రికేమి తీసిపోడు
రాక్షస కుల మంతటినీ కాలరాసి చంపగలడు"
అని పలికెడు పలుకులకు రాముడు సంప్రీతుండై
సుగ్రీవా వీరంతా ఎంతకైన సమర్థులే
సీతాన్వేషణ భారము ఈ వీరులపై నిడు మన
నలువైపుల వెదకుటకై నాల్గుజట్లు జేసెవారి—

అంగదునీ, హనుమంతుని, జాంబవంత సుషేణులను
నీలుని, శరభుని మైందుని దక్షిణదిశ చూడుడనియె
మిగిలిన వీరులనందఱు మిగత దిక్కులకు బంపెను —

సాగుచున్న వారిబిలిచి సుగ్రీవుడు పలికెనిటుల
"మాసములోపున మీరలు మాత జాడతో రావలె
శాసనమిది తప్పినచో శిరచ్ఛేదనమె శిక్ష"—

శిరసువంచి వందనమిడు మారుతిగని శ్రీరాముడు
అంగుళీయకమ్మిచ్చి సీతకు గుర్తుగ నిమ్మనె
కనుల కద్దుకొని తీసుకు కడుభద్రముగా దాచుకు
రామనామస్మరణముతో రయమున సహచరులగలిసె—

# స్వయంప్రభ తపస్సు

అంగద హనుమంతాదులు వింధ్యాటవి చేరుకొనిరి
పర్వత సమభీకరుడు రాక్షసుడొకడా అడవిని
విచ్చలవిడిగా మృగముల భక్షించుచు వచ్చుచుండె
అతడే రావణుడనుకొని అందఱుపైబడి చంపిరి—
"హీనసత్వుడీ దనుజుడు ఛీ ఛీ రావణుడుకాడు"
అనుచు మరోవసమందున వారలు వెదుకగసాగిరి—

దప్పికాయెనందఱకూ దరిదాపుల నీరులేదు
ఉదకముకొఱకై వెదకుచు పొదమాటున గుహ చూసిరి—
ఆగుహాలోనుండి క్రౌంచ పక్షులు, హంసలు తెక్కల
తడుపుకు వచ్చుట చూసి తటాకమ్ము కలదచటని
ముందుగ హనుమంతుడు గుహ ముఖద్వారమును జొచ్చెను
వెనువెంటనె తక్కుంగలి వారెల్లరు 10తోడెల్లిరి—

అంధకార బంధురమై ఆ మార్గము అగమ్యమై
ఒకరిచేయి ఒకరుపట్టి చాలదూరమేగుసరికి
చివరకు ఒక ప్రదేశమున జలాశయము కాన్పించెను—
ఆతటాక తీరమందు అందమైన భవనములు
మరకత మాణిక్యమణుల కాంతుల వెదజల్లుచుండె
కానీ ఆ సౌధమ్ముల జనసంచారమెలేదు
ఆశ్చర్యము ముప్పిరిగొన ఆలోచించుచు నడుచుచు
కాంచనమయ పీఠమ్మున ఏకాకగు కాంతగనిరి—

ఆమెనార చీరగట్టి అంతర్ముఖియై యుండెను
హనుమదాది వానరులు వినయముతో ప్రణమిల్లగ

"ఎవరుమీరు ? ఎవరివారు ? ఇక్కడికెందుకువచ్చిరి ?"
అని యోగిని ప్రశ్నించగ జరిగినకథ వివరించిరి —
మాతా నీవెవ్వరవు ? మానవస్త్రీవా కావా ?
తెలియజెప్పుమమ్మా నీవేల నొంటరిగనుంటివి ?
ముందు మీరు దప్పికతో దురపిల్లుచునుంటిరిగద !
అవిగో ఆఫలముల దిని జలముత్రాగి రండనగా
వారట్లేచేసివచ్చి ఆమె ముంగిటను వాలిరి—
"విశ్వకర్మ సుపుత్రిక 'హేమ' పూర్వకాలమందు
నృత్యకళను ప్రదర్శించి నటరాజును మెప్పించగ
ఈశ్వరుడానందముతో ఈ పురము ఆమెకిచ్చె
నేనామెకు సఖురాలను గంధర్వుని పుత్రికను
'స్వయంప్రభ' నాపేరు విష్ణుధ్యాన చిత్తురాల
'హేమ' బ్రహ్మలోకమేగి మరి రాకను యుంటజేసి
నే నొకతెనె నివసించుచు తపము చేసుకొనుచుంటిని
మీరాకను నాకోరిక నెఱవేఱే సమయమొచ్చె
మిమ్ములను గుహబయట వదలి రాముని కడకేగెదను
కనులు మూసుకొనుడందఱు" అనక్షణమున మూసికొనగ
గుహ వెలుపలి కొచ్చి ప్రభకు రామవాసమును తెలిపిరి—
రాముని చూడంగ నామె ఒడలెల్లను గగుర్పొడిచె
"రాజేంద్రా ! స్వయంప్రభను భవద్దర్శనము దొరకెను
నీపాదాంబుజ దర్శన భాగ్యము మోక్షము నిచ్చును
నీభక్తుల సాగరమును దాటించే నావ వీవు
వేలాదిగ వత్సరాలు నీ ధ్యానను మునిగి యుంటి

నేనేమియు కోరబోను నీదు నామస్మరణ తప్ప
దానివీడకుండ నాదు జిహ్వను శాసించుచాలు—"

"అమ్మా నీ మాటలోని అంతరార్థ మెఱిగితిని
నీవు బదరికా వనమున నియమవిధిని ధ్యానించి
పంచభూత నిర్మితమగు ఈ బొందిని విసర్జించు"—
ఇట్లుచేసి స్వయంప్రభ ఇహము వీడి పరముజేరె—

## వానరసేన నిస్పృహ

హనుమదాది వీరవరులు వింధ్యాద్రిని వెదకి తుదకు
దక్షిణ సాగరతీరము దరిని మహేంద్రము శిఖరము
ఎక్కి సుదూరము చూసిరి ఎక్కడ జాడైనలేదు
చింతాక్రాంతులుగ మాఱి ఆలోచించగసాగిరి—

"గడువుకాలమిప్పటికే గడపవద్ద కొచ్చియుండె
ఇంతవఱకు సాధించిన దావంతయు లేదుగదా!
రావణుండు, సాధ్వీసీత ఎవ్వరు కనబడలేదు
సుగ్రీవుని శాసనమున సవరణనే దుండబోదు
అతనిపలన మరణదండ నము పొందుటకంటె మనము
ఇక్కడె ప్రాయోపవేశ దీక్షను చచ్చుటమేలు"—

ఇట్లందఱు చావుకోరి దర్భలపై కూర్చుండగ
గజసన్నిభదేహముతో గృధ్రమొకటి గుహనుండి
తినగతిండి వెదకికొనుచు తిన్నగ ఆ దరికివచ్చె—

# సంపాతి వృత్తాంతము

దానిపేరు 'సంపాతి' ఎగురగ ఱెక్కలులేవు
మరణించెడు వారిచూసి మనసున సంతసమంది
ఆహా నా భాగ్యమేమి ! అప్రయత్నముగ దొరకెను
ఇంతకాలమునకు నేడు కడుపుకు నిండుగ తిండి
రోజుకొక్క వానరమును తృప్తిగ భక్షించెద నన
ఈ పలుకులువిని వారలు భయకంపితులై పోయిరి—
"వీరులుగా రామకార్య మైనను సాధించలేదు
వ్యర్థజీవనులు మనమై యీ గృధ్రము నోటబడుట!
ఖగమాత్రుడు జటాయువు సీతకొఱకు ప్రాణమిచ్చి
రామునిచే దహనక్రియల నొంది మోక్షమందినాడు
అట్టిమృతికి కూడ మనము నోచుకొనగలేమైతిమి"—
సంపాతీ మాటలు విని "ఎవరుమీరు ? జటాయువు
నామముతో నా చెవిలో అమృతమును చిలికించిరి ?—
గృధ్రమిట్లు పలుకరింప అంగదుడానంద మొంది
జటాయువు రామునికై చేసిన సాహసము తెలిపె —
"జటాయువు ఎవరొకాదు నాసోదరుడే ఆతని
మహద్భాగ్యమును దెలిపి మదికి సంతసము గూర్చిరి
వానర మహనీయులార ! వాక్సహాయ మొనరించెద
లంకానగరము త్రికూట పర్వతాగ్రమున నున్నది
ఆనగరము ఇచ్చటికి నూఱుయోజనములున్నది
సాగర మధ్యమున దాని ఉనికి గలిగియున్నదదే

అందులో అశోక వనము నందు శోకదేవతయై
రాకాసుల కావలిలో కన్పడు చున్నది సీత
గృధ్ర దృష్టి దూరదృష్టి కనుక చూడ గలుగు చుంటి
సముద్రమును లంఘించే శక్తి యుక్తులున్నవారు
పరమభక్తులైన మీకు యీ పయోధి దాటుటెంత !
మీదరిశన భాగ్యముచే నారెక్కలు వచ్చెనివిగో"
అని రెక్కలు ఊపుకొనుచు తన కథ వివరించసాగె —

## సంపాతి గతం

నేనును మాజటాయువు యవ్వన దశలో నుండగ
మేమే బలశాలురమని విఱ్ఱవీగి గర్వముతో
మాలో మేల్బల వంతుల తేల్చుకొనగ నొక దినమున
సూర్యమండలము తాకుట లక్ష్యముగా నిర్ణయించి
దర్పముతో పైకెగిరి బహు యోజన దూరమేగ
తమ్ముడు అక్కడి వేడికి దగ్ధము కాబోవు చుండ
సోదర ప్రేమను అతనికి నారెక్కల కప్పితిని
ఫలితముగా పైగల నా పక్షమ్ములు కాలిపోయె—
మూడురోజుల నంతరము మూర్ఛ నుండి తేలుకుని
మెల్లగ ప్రాకుచు నొక్కెడ మున్యాశ్రమమును గాంచితి
ఆముని ఎఱుగును నన్ను అతడు "చంద్రమా' నాముడు
నన్నుచూసి గుర్తుపట్టి సంపాతీ ! నీవేనా ?
ఈ రూపము ఎట్లువచ్చె ? కారణమేమని అడుగగ
జరిగినదంతా చెప్పి పరిపరి దుఃఖించుచుండ

"విచారించ పనిలేదు జీవన గమనము ఇంతే
కష్టనష్ట రొష్టు బాధ సృష్టిని ప్రతివాని గాథ"

## సృష్టి రహస్యం

"దేహమూల మిదం దుఃఖం దేహః కర్మసముద్భవః"
ఈ సుఖదుఃఖములన్నీ దేహానికె పరిమితము
ఉక్కుముక్క అగ్నిగూడి ద్రవరూపము చెందునట్లు
జీవుడు దేహమున చేరి తాదాత్మ్యమును పొందును
అప్పుడె "నేనూ", "నాద"ను అజ్ఞానములో పడును
అజ్ఞానము నుండి అహం కార జాడ్యమది పుట్టును
అహంకార బుద్ధివలన కర్మ నిర్వహణ జరుగును
చేసిన కర్మకు ఫలితం యీదేహం యీగేహం

## పిండోత్పత్తి క్రమం

జీవుడు తాజేసినట్టి పుణ్యమునకు ఫలము నొంద
స్వర్గానికి పంపబడును అచట సుఖము లనుభవింప
పుణ్యము క్షీణించగనే క్రిందకు త్రోయగ బడును
త్రోయబడిన జీవి మొదట చంద్రమండలమునబడును—

అచ్చటి నీహారముతో నేలపైకి దిగివచ్చి
ధాన్యాదుల యందు చేరి పురుషులు భుజియించినపుడు
రేతస్సుగమారి అది ఋతిమతి యగు స్త్రీని కలియ
యోనిరక్తమును గూడి లోపల అంకురమేర్పడు
శుక్రశోణితము లిట్లు దేహబీజమును వేయును—

ఒక్కరోజులోనె గర్భ కోశమందు అండమగును
అయిదు రాత్రులకు చిన్నగ నీటిబుడగ లాగగును
ఏడు రాత్రులకు మాంసం పిండంగా మార్పు జెందు
పక్షము రోజుల నాటికి రక్తముతో నిండుకొనును—

ముప్పది దినములు గడువగ మొండెము, మెడ, శిర, ముదరము
అయిదవయవములు పొడమును, అట్లె రెండుమాసములకు
కాళ్ళూ, చేతులు, పిఱుదులు, మోకాళ్ళూ, పార్శ్వములూ
క్రమముగ ఏర్పడి లోపల జీవశక్తి పెంపొందును—

మూడవ మాసము గతింప అవయవ సంధులు ఏర్పడు
నాల్గవ మాసము నిండగ వ్రేళ్ళన్నియు పుట్టుకొచ్చు !
ముక్కు, చెవులు, కళ్ళు, గోళ్ళు, దంతపంక్తి, గుహ్యమ్ములు
అయిదవ మాసమునందు అమరును ఆ దేహమునకు—

ఆఱవమాసమునందు చెవిరంధ్రము స్ఫుటమగును
మర్మాంగము, గుదముకూడ యీనెలలోనే ఏర్పడు—
ఏడవమాసమున తలకు, ఒంటికి రోమములు వచ్చు—
అష్టమమాసమునందు అవయవములు తేటపడును—

నెల తొమ్మిది రాగానే జీవుడు చెతన్యుడగును—
తల్లితిన్న అన్నసార మా పిండము బొడ్డునగల
నాభిసూత్ర రంధ్రమ్మున అందివృద్ధిపొందుతుంది—

శిశువు గర్భమందుండగ పూర్వజన్మ జ్ఞానముండు
గతమున చేసినకర్మకు వగచుచు యిక చేయననుచు
మాతృగర్భమును విడిచిన మరుక్షణమున గతము మఱచి

కర్మలు చేయుచుదుఃఖము అనుభవించు నీకాయం
పాము కుబుసమీదేహం విడుచుట నిస్సందేహం
కర్మ నివృత్తగువఱకూ తప్పదు యీ దేహబాధ
అని తత్త్వముతెలిపి నాదు స్థితికాతడు జాలిపడి
రాముని బంటులు వత్తురు వారికి వాక్సాయపడుము
నీ పక్షము లపుడు నీకు నిశ్చయముగ రాగలవు
అని చెప్పినమాట సత్య మయ్యెను స్నేహితులారా!
నిజభక్తులుమీరే అని నిర్ధారణమయ్యెనిపుడు
అసాధ్యమే లేదు మీకు ఆలోచించుడు వేగమె"
అని వారల ప్రోత్సహించి ఆకసమున కెగసిపోయె—

## సముద్ర లంఘనం

అంగదు డందఱబిలిచి ఎవరు దీని సాధింతురు ?
ప్రతిఒక్కరు దాటంగల పరిమాణము తెలుపుడనెను—
నూఱు యోజనముల దూర మెవ్వరు దాటగలేమన
స్వయముగ అంగదుడెలేచి "నేనే దాటెదగానీ
శీఘ్రముగా తిరిగివచ్చు శక్తియె నాకనుమానము"
అనగలేచి జాంబవంతు డసలు నీవు పోవద్దు
అని దీర్ఘాలోచనలో మునిగియున్న మారుతిగని
"హనుమా! ఏమిటి నీవిటు అబలుడవలె కూర్చుంటివి ?
అన్నింటను సమర్థుడవు అద్భుతబలశాలి వీవు
పుట్టినవెంటనె పైగల సూర్యుని పండని ప్రీతిని
శతపంచక యోజనములు భక్షింపగ వెళ్ళితివే!

అట్టి నీకు శతయోజన దూరము లెక్కానేడు ?
మఱచితివా నీ శక్తిని మహావీర! మహాబలా !
శ్రీరాముని చిఱుకార్యము సాధించుట నీకెంత ?"
అని ఆతనిశక్తి దెలుప హనుమంతుడు పులకితుడై
అపర త్రివిక్రమునివలే ఆకాశానికి ఎదిగెను—

"జలనిధి లంఘించి లంక నంతను భస్మమ్ముజేసి
బంధుమిత్ర పుత్రులతో దశకంఠుని వధియించి
జనకపుత్రి తెచ్చెదను యిది సమ్మతమా మీకు ?
లేదా రావణుదేహము బంధించీ యిటకుదెచ్చి
రాముని పాదాలచెంత పడవేసెద నేమందురు ?—

లేదా యీ ఎడమచేత లంకనిటకు గొనివచ్చెద,
లేదందుర జానకిని చూసివచ్చుటేచాలా ?
మీమతమేమో చెప్పుడు వేగమె వెడలెదనిపుడే"—

వృద్ధ జాంబవంతుడు తన మదిలో ఆనందమంది
"మాత సీత చూసిరమ్ము మంగళమగుగాక నీకు
జనక తండ్రి వాయువు నీ కండగ నిలుచుండుగాక"
అని ఆశీర్వాదమొసగ సహచరు లానందమొంది
జైజై వీరాంజనేయ జయవీరా ! జయధీరా !
అని దిక్కులు పిక్కటిల్ల జయనినాదములు చేసిరి—

ఆధ్యాత్మ గేయ రామాయణం
కిష్కింధకాండ సమాప్తం



# సుందరకాండ

## సురస మార్గావరోధనం

మహేంద్రమ్ముపై నిలిచి మహార్ణవము దాటుటకై
ఊపిరి బిగబట్టి ఎగిరి మారుతి "జైరామా" అని
బాహువులను చాచి వెనుక వాలమ్మును పెంచివేసి
దూసుకు ఆకాశంలో ఊర్ధ్వదృష్టి దక్షిణాభిముఖుడై చనె—
అసురుల ఢీకొనగ బోవు అతనిశక్తి అరయ సురలు
నాగమాతయగు ''సురస''ను మార్గమడ్డగా బంపిరి
శరీరమును దారంతా పఱచి "సురస" అడ్డునిలిచె —
"ఏహిమే వదనం శీఘ్రం" "ప్రవిశస్వ"! మహామతే
దేవైస్త్వం కల్పితో భక్ష్యః క్షుధాసంపీడితాత్మనః''
"నాకాహారము కోరగ నిను చూపిరి దేవతలు
నాఆకలి తీర్చుకొనగ నిను మ్రింగెద రా వానర''—
''అమ్మా! జానకి మాతను చూడలంక కేగుచుంటి
లంక నుండి తిరిగివచ్చి రామునికావార్త చెప్పి
వచ్చి నీదు ఆకలినే తప్పక తీర్చెద'' అనియెను—
హనుమా! ఇప్పుడె కావలె కడుపు కాలిపోతున్నది
మఱొకమాట చెప్పకుండ రారా రాకున్న నిన్ను
పట్టుకు భక్షించి నాదు కుక్షినింపుకొనగల నన—
''అయితే మరి నోరు తెఱు నీ కోరిక నెఱవేర్చెద"
అని మారుతి దేహమ్మును యోజన విస్తృతి పెంచెను—

'సురస' చూసి తననోరును అయిదు యోజనములు సాచె
పవనతనయు దేహమపుడు పదియోజనములు పెరిగెను
'సురస' పట్టు విడువకుండ నోరును రెట్టింపుచేసె—
ఇది చూసిన హనుమానుడు ముప్పది యోజనములెదిగె
'సురస'కూడ నోరుపెంచె ఏబది యోజనదూరం
అదనిదె అని హనుమంతుడు అంగుష్ఠపుమాత్రుండై
ఆమెనోట ప్రవేశించి లాఘవముగ బయటికొచ్చె—
ఆశ్చర్యముపడిన సురస "శహభాష్ హనుమా" అంటూ
నాకవాసులందఱు నీ బుద్ధిబలము పరీక్షింప
పంపగ వచ్చితినంతే పవనసుతా! విజయోస్తని
సంతసమున సురస స్వర్గ లోకానికి తరలిపోయె—

## మైనాకుని ఆతిథ్యం

గగనవీధి హనుమంతుడు గరుత్మంతుడుగ సాగగ
సముద్రుండు తనలోగల మైనాకుని పిలిచిచెప్పె
"సగరపుత్ర వివర్ధనుడ కనుకే సాగరుడనైతి
ఆ వంశమునందు ఉద్భ వించెను జానకివిభుడు
జానకికొఱకై మారుతి లంకకు పయనించుచుండె
మధ్యలోన విశ్రాంతికి మనము సాయపడవలెను"—
వినయముతో ఆమాటకు మైనాకుడు జలధి నడుమ
పైకివచ్చి తన రూపము పెంచి స్వాగతంబిచ్చెను—
"వాయుకుమారా! గిరిపై విశ్రమించి వెళ్ళుమయ్య

కోరి పక్వఫలములెన్నొ ఏఱితెచ్చితిని నీకై
సేదదేరు క్షణమిచ్చట సాగుము ఆపై ముందుకు"—
అనుచు ఆదరముగ ప్రీతి నాహ్వానించుటచూపి
"స్వామీ! నే రామకార్య సాధనకై అరుగుచుంటి
పట్టినపని కాకుండా ఫలములెట్లు భుజియింతును?
భక్షణమేకాదు క్షణము విశ్రాంతికి మనసొప్పదు"
అని మర్యాదకు ఫలముల అఱచేతను ముట్టి వెడలె—

## సింహిక ఛాయాగ్రహణం

కొంతదూర మేగెనంతె రక్కసి 'సింహిక' చూసెను
ఆమె జలములోనుండే ఆకసమార్గమునపోవు
వారి ఛాయ నాక్రమించి ఆకర్షించుకు తినును
అట్లే మారుతి ఛాయను ఆక్రమించి వేగమాపి
అధోభాగమున కాతని ఆకర్షించుచునుండెను—
"ఏమీ! నా గమనమెవరొ నిరోధించుచున్నారు?"
నలువైపుల పరికించెను ఎవరును కనిపించలేదు
అప్పుడధో భాగమునకు దృష్టిని సారించగనే
తన ఛాయను ఆక్రమించి ఆకర్షించెడు రాక్షసి
కనబడగా జలధిదూకి 'సింహిక' శిరమును ద్రుంచెను—

## లంకా ప్రవేశం

ఆ రీతిని అడ్డులన్ని అధిగమించి ఒడ్డుజేఱి
అదిగో లంకానగరము చుట్టును ప్రాకారమ్ములు

చూసి పగలు ప్రవేశింప సాధ్యము కాదని తలంచి
నిశిని సూక్ష్మదేహుండై నగర ద్వారమును దాటెను —

## లంకిణీ భంజనం

అంతే లంకారక్షణ కధిష్ఠాన పురదేవత
లంకిణి ఎదురుగవచ్చి "ఎందిర ఎవడవు నీవు?
ఏలిట్టుల దొంగలాగ కాలెడితివి పట్టణాన?
వానర ! యీ రాత్రిపూట నగరములో పని ఏమిటి?
నాకన్నులు కప్పుట నీ బాబుతరము కూడ కాదు"
అని గర్వముతో ఆతని గుండెలపై తన్నినది —
దెబ్బకు రోషము రగిలిన ధీమంతుడు హనుమంతుడు
పిడికిలి బిగియించి ఒక్క గ్రుద్దును తలపై గ్రుద్దగ
హా ! వానర ! అని లంకిణి రక్తము గ్రక్కుచు చచ్చెను—
ప్రభంజాత్మజుం డామెను భంజించిటు లోని కేగ
జానకికీ, దశముఖునికి ఎడమ కన్నులదర సాగె—

## జానకీ దర్శనం

మారుతి నగరము చూచుచు రాజాంతఃపురి చేరెను
మెల్లగా అశోకవనము ఎల్లెడ గాలించు చుండ
'శింశుప' వృక్షము క్రింద "రామ రామ రామ" యనుచు
రాక్షస పరిరక్షణలో సీత అతని కండ్ల బడెను —
తైలాదిగ సంస్కారము లేకను తల జడలు కట్టె
పతి వియోగ దుఃఖముతో పడతి మేను కృశియించెను
అయినా సౌందర్యరాశి శోభ తఱిగి పోలేదు

సాక్షాత్ లక్ష్మిగ కనబడ సంతసమున హనుమంతుడు
కొమ్మల మాటున దాగొని పర్కించుచు నున్నాడు —

## రావణాగమనం

ఇంతలోన వనములోన కలకల శబ్దము వచ్చెను
ఏమా ! యని చూడ నటకు రావణుండు వచ్చుచుండె
పాలవళ్ళు, కోఅమీస మిరువది చేతులు కలిగి
ఎగఎగు ఎఱ్ఱని కన్నుల పది ముఖముల పర్వతముగ
రోత కలుగు దేహముతో సీత కడకు నడిచివచ్చె —
కారణమా రాత్రి అతడు కన్నకలను వానరుడు
నగరములో ప్రవేశించి ఈ వనమును శోధించి
వృక్షాగ్రము నందు దాగి యున్నట్టుల కన్పడెను
అది నిజముగ జరుగుచుండె నేమో అని ఆత్రముగా
మర్కటమును వెదుకవచ్చె సమ్రాట్ రాణుల తోడ్కొని —
అతని జూచి ధర్మాత్మజ భీతిని గడగడ వణకుచు
జలజల కన్నీరు నేల రాల మూల కొదిగి పోయె —
"కమల ముఖీ నన్ను జూచి కలవరపడిపోదు వేల ?
మందయాన నీ అందము తో డెందము విందొనర్చె
రాముడు నిను తీసుకుపో వచ్చుట నిజముగ కల్ల
వ్యర్థుడు అసమర్థుడతడు వార్ధిదాటి రాలేడు
మానవమాత్రుడు రాముడు మానిని తగడతడు నీకు
అనురాగము ఐశ్వర్యము అన్ని యున్న అందగాడ
నాగ, యక్ష, కిన్నర, కిం పురుష, దేవ, గంధర్వ
నారీమణులనునిత్యం నిన్ను గొలుచునట్లు జేతు

మండోదర్యాదులలో మహారాణి స్థానమిత్తు
తరుణీ ! మురిపింతును నా తొడపై కూర్చుండుము" అనె —

## సీత హెచ్చరిక

కామాతురుడైన అతని కాఱుకూతలకు సీత
గడ్డిపరక మధ్యవేసి గఱికా ! వినుమని పలికెను—
"దుర్బలుడని శ్రీరాముని దూషించెడు యీ దనుజుడు
అతని భయముతో గాదే భిక్షకరూపము దాల్చెను ?
అన్నదమ్ములిరువురునూ ఇంటను లేకుంట జూసి
నన్ను అపహరించి తెచ్చు టదియేనా వీరత్వము ?"
అని తనమాటల సూటిగ ఈ టెలుగా గుటిపెట్టి
రాముడు మాన్యుడెగాని సామాన్యుడు కాడు నిన్ను
తీవ్ర శరాఘాతముతో తుత్తునియలు చేయగలడు
దుర్మార్గా ! రాముడు దండెత్తి వచ్చుటది తథ్యము
నిన్వధించి నన్నయోధ్య నగరానికి గొనిపోవును
నీతో నీ పుత్ర మిత్ర బాంధవులును చత్తురసగ
ఏమి కూసితివి సీతా ! నన్నే దూషించెదవా ?
ముక్కముక్కలుగ నఱకెద ఇక్కడ నీ దిక్కెవరని
కత్తితీసి జనకరాజ పుత్రిని ఖండించబోవ
మండోదరి అడ్డుకొని "యీమె వట్టి మానుషస్త్రీ
దుఃఖిత కృశాంగి నీమె వధియించుట హీనచర్యం
అని భర్తను వారించగ కత్తిని ఒఱయందుంచి
కావలి యున్నట్టి అసుర స్త్రీలకు అజ్ఞాపించెను—

"నయమున భయమున మైథిలి మనసు మార్చయత్నించుపుడు
రెండునెలలు గడువిచ్చెద ఒప్పుకున్న సరేసరి
ఈలోపున మాఱకున్న కూరగ వండేసి తెండు"
అని రాణుల జతగూడి అంతఃపురమున కరిగెను—

## సీతాదేవి శోకం

రావణాజ్ఞ పాలించగ సమకట్టిన రాక్షసులు
సామదాన దండమ్ముల దారికి తేదలచినారు—

"ఇంకా ఏటాలోసన ? [12]'పల్లక' [13]తొంగుంటివేటి ?
'ఊ' అను లేకున్న మక్కెలిఱగదన్ని ఒప్పిత్తా"
అని ఒక రాక్షసివచ్చి పైకిలేపి పడద్రోసెను—

[14]"బుల్లీ నీ బతుకంతా బూడిదపాలవుతుందే
మా రాజును వరించావ మహారాణివౌతావు
సింగారిస్తా రావే బంగారపు తల్లివిగద !"
అనుచు ఒకతె బ్రతిమాలగ మరొకామె కోపంతో
[15]వామ్మో ! ఇది మామూలుగ వంగదు లొంగదు మనకని
"పిల్లా[16] నువ్వొల్లకున్న కుళ్ళబొడిచి నీవొళ్ళు
కక్కులు ముక్కులుజేసి కాకుల గెద్దలకేత్తా"—

అనగా మఱియొక రాక్షసి కరవాలము ఝళిపించుచు
చంపేస్తా ఒప్పేసొక్కో లేదంటే నరికేస్తా
కాసొక్కోమని పీకమీద కత్తిపెట్టి పైకెత్తగ
పర్వతగుహావంటి నోరు తెఱచుకువచ్చి ఒకామె
[17]"వారెవ్వా ! నరమాంసం ! మద్యంలో నంజేస్తా

మింగేస్తా నమిలేస్తా రా" అని ఛంగున దూకగ
'త్రిజట'ను రాక్షసి వచ్చి త్వరపడకుడు ఇది వినుడనె —

## త్రిజట స్వప్నం

"నాకిప్పుడె [18]కునుకు పట్టె కునుకులోన కలొచ్చింది
కమలలోచనుడు రాముడు కలలో కనిపించినాడు
అన్నదమ్ము లిద్దఱునూ ఐరావత మెక్కివచ్చి
లంకాపురి కాల్చివేసి లంకేశుని వధించారు —

అదేకాదు మఱొక చిత్ర మగుపించెను ఆ కలలో
దిశమొలతో రావణుండు ఒడలు నూనె రాసుకుని
పుర్రెల దండలు ధరించి పుత్రపౌత్రులందఱితో
ఆవుపేడ మడుగులోన దిగినట్టుల కన్పట్టెను
విభీషణుడు ఒక్కడె శ్రీ రాముని సేవించుచుండె
ఈ కల ఫలితము లంకకు చేటును సూచిస్తున్నది
రాముడు రావణు వధించి విభీషణుని రాజుచేసి
సీత చెఱను విడిపించి హతమార్చును మనలందఱ"
అన వారలు అదిరిపడి చేసెడు పని విడిచిపెట్టి
మనసు దిటవుచేసి కొనగ [19]మందుకొట్టి నిదరోయిరి
పిశాచాల దూషణలకు భీతిల్లిన బేలసీత
కల్లోలిత హృదయంతో ఘొల్లున విలపించసాగె
హా నాథా! ప్రాణప్రియా! నీవెక్కడ నున్నావో!
భ్రష్టురాల దుష్టురాల ఘోర సర్ప దష్టురాల
నిష్ఠురముగ మాటలాడి మఱిది మనసు కష్టపెట్టి

చేజేతుల యీ నరకం తెచ్చిపెట్టుకుంటి నేను
దీనురాల హీనురాల దేవా ! నిర్భాగ్యురాల
దారుణ నిర్బంధములో రాకాసుల హింసలతో
అఱచేతిని ప్రాణముతో అలమటించి పోతుంటిని
శక్తి సన్నగిల్లినది ధైర్యము తావుల్ దప్పెను
ఈ క్రూరులు పెట్టుబాధ లను భరించ లేకుంటిని
అదిరింపుల బెదరింపుల గుండెలవిసిపోతున్నవి
రక్తము లోలోపలనే సలసల మని మఱిగి మఱిగి
ఒడలంతా పిడచకట్టి బిగిసిపోయె కట్టెలాగ
ఏడ్వగ కన్నీరు లేదు ఎండిపోయె నా కన్నులు
ఈ నీచులద్రుంచి నన్ను రక్షించుము రఘుదేవా ! —

ప్రియా ! నిన్ను ఎడబాసి ఛీ యింకా బ్రతికి యుంటి
తప్పక వచ్చెదవు నీవు తీసుకువెళ్ళెదవు అనుచు
పాపం ఇంకా హృదయం ఆశవీడ లేకున్నది
ఇంకెక్కడి రాక మీది ; నాజాడే తెలియదుగద !
అయ్యో బంగరులేడి నాకేలను కనబడవలె ?
కనబడెబో దురాశతో తెమ్మని నే నడుగ నేల ?
అడిగితిబో స్వామివారు మాఱుపలుక కరుగనేల ?
అరిగెనుపో లక్ష్మణుపై అలిగి పంపగానేల ?
అంతా నా గ్రహచారము" అని ఏడ్చుచు సొమ్మసిల్లె —
కొంత వడికి తెప్పిఱిల్లి చింతించెను మనమునందు
"ఎటు చూసిన దారిలేదు ఎందుకు బ్రతకాలింకా ?
మరల కొంత సేపటిలో లేవగలరు కథ మొదలే

ఛీఛీ యీ నికృష్టపు జీవితమిక దుర్భరము
స్వేచ్ఛందపు మరణానికి యిదేమంచి సమయమంచు
చెట్టుకొమ్మ ఉరికంబము తన జడ ఉరిత్రాడు జేసి
ఆత్మహత్య జేసికొనగ సీత సిద్ధమగుచుండెను —

## హనుమంతుని స్వీయ పరిచయం

ఇంక వేచి చూడరాదు సమయము మించిన దంచును
"రామ రామ రఘురామా! రామా దశరథరామా!
పావన నామా రామా! పరమాత్మా పరంధామ!"
అని మారుతి రామ నామ గానము ప్రారంభించెను —
"ఎవరిది యీ మధుర స్వరం! ఎచటి నుండి వచ్చుచుండె!
కలగనుచుంటిన లేక భ్రాంతిని పొందుచునుంటిన?
దుఃఖాధిక్యము చేతను నిద్రేలేకున్నప్పుడు
స్వప్నమెట్లు రాగలదు? సరి, భ్రమయే శంకలేదు
నిజముగ యిది భ్రమ అంటే నా చెవి కాదంటున్నది
కాదు కాదు భ్రమకాదు ఖచ్చితముగ వాస్తవమిది
ఆహా! నాకర్ణములకు ఆనందము కూర్చెనెదరు?
ప్రియవాదీ! మహాభాగ! స్వాగతమ్ము దయచేయుడు" —
ఈ పిలుపుకు హనుమంతుడు మెల్లగ క్రిందికి దిగెను
పిచ్చుకంత దేహముతో పెదవి రక్తరాగముతో
ప్రాంజలియై ముందుకొచ్చి ప్రణామమ్ము లాచరించె —
సూక్ష్మ శరీరమున నున్న కోతిని చూసిన సీత
రావణుడీ వేషములో మోసగించ వచ్చెనేమొ!
అని భయమున అధోముఖిగ సంభాషణ మాపివేసె —

హనుమంతుడు విస్తుపోయి ఆమె భావమును గ్రహించి
"రావణుడను కానుతల్లి రామదాసుడను నిజముగ
అంజన పుత్రుడను నేను ఆంజనేయుడనువాడను" —
"రాముని దాసుడ నంటివి నరవానర పొత్తేమిటి? "—
"రాముడు నిను వెదకి కొనుచు ఋష్యమూకమునకు వచ్చి
మారాజగు సుగ్రీవుని బ్రోచె వైరి వాలి ద్రుంచి
కృతజ్ఞతగ సుగ్రీవుడు పూజ్యురాలవగు నిన్ను
అన్వేషింపగ మమ్ముల ఆజ్ఞాపించెను మాతా! —

## అంగుళీయక ప్రదానం

రాముడపుడు నన్ను బిలిచి అంగుళీయకము తీసి
గుర్తుగ సీతాసాధ్వికి యిమ్మని నాచేతికిచ్చె
అమ్మా! గైకొమ్ము, నన్ను నమ్ము రామ బంటు నేను"—
శ్రీరాముని నామాంకిత లిఖిత అంగుళీయకమును
చూసి శిరసుపై ధరించి జలజల కన్నీరుకార్చి
"వానర! యీ ముద్రికిచ్చి ప్రాణదాతవైతివీవు
బుద్ధిమంత హనుమంతా! రామభక్తుడవు నమ్మితి
నాబాధల స్వయముగ నీ వన్నియు చూసితివిగదా!
విభునికి చెఱ తెలిపి త్వరగ విడిపింపగ రమ్మనుము"—
"చిత్తము" అని హనుమంతుడు "గుర్తుగ ఏ చిహ్నమైన
దయచేయుము స్వామికొఱకు తల్లీ!" అని ప్రార్థించెను—
జానకి వెంటనె తలగల చూడామణి తీసియిచ్చి
రహస్యమ్ము చెప్పెదనది రామునిజ్ఞప్తికి తెమ్మనె—

## కాక వృత్తాంతం

"చిత్ర కూటగిరియందు ప్రభువు నాదుతొడ తలనిడి
నిద్రించుచునుండ ఇంద్ర పుత్రుడు కాకిగవచ్చి
ఎజ్జని నా పాదాంగు ష్ఠమ్ము మాంసఖండమ్మని
నఖములతో నాసికతో పొడుచుచు బాధించినాడు—

మేల్కాంచిన శ్రీరాముడు కాలి రక్తమును చూసి
ఎవడా దుర్మార్గుడు యీ గాయము చేసినవాడు ?
అని పరుగిడు వాయసమ్ము పనియిది యని మదిగ్రహించి
గడ్డిపరక మంత్రించి యువ్వెను ఆ కాకిపైకి
వాడిగ వేడిగ అది ఆ వాయసమును వెంబడింప
ప్రాణభీతి పరుగిడి అది బ్రహ్మరుద్ర ఇంద్రాదుల
ఆశ్రయించి విఫలమొంది రామపాదముల బడెను—
శ్రీరాముడు దయామయుడు శరణాగత వత్సలుడు
అమోఘమ్ము యీ అస్త్రము వ్యర్థముగా వెనుదిరుగదు
కనుక నీదు కన్నొక్కటి దీనికి బలిచేసిపొమ్ము
అని రాముడు అనగ కాకి కుడికన్నును అర్పించెను"—
"సరేతల్లి స్వామిచేరి సర్వము విదితము చేసెద
అమ్మా ! ఆశీర్వదించు" అని పలికి బయల్వెడలె—

## అశోకవన విధ్వంసం

కొంత దూరమేగిన హను మంతుడు ఆలోచించెను
"ప్రభువాదేశించినట్లు సీతమ్మను చూసితిని
జతగ కార్యమొకటిజేసి రుచి చూపెద రామశక్తి"

ఇట్లు చింతతో వనమున చెట్లన్నిటి పెకలించి
కల్లోలము సృష్టించగ కావలివారలు మేల్కొని
"ఎవరీతడు మృత్యువేమొ ఎదుర్కొనిన మనపనిసరి"
అని హడలుచు రావణునికి విన్నవించిరీ సంగతి—

తనకు ప్రీతిపాత్రమైన వనము భగ్నమయ్యెననగ
క్రుద్ధుడైన అసురుడు పది కోట్ల రాక్షసుల బంపెను—

## అక్షకుమార మరణం

హనుమంతుడు దగ్గఱున్న లోహ స్తంభమును పెఱికి
దోమల నలిపిన చందము వారల నందఱ చంపగ
వెంటనె తోలెను సేనా పతి పంచక మతనిపై కి
అదే లోహ స్తంభముతో అందఱి యమపురి కంపెను—

మంత్రి సుతుల నేడుగురను మరల వానిపైకంపగ
అదేరీతి హనుమంతుడు తుదముట్టించెను వారిని—

రణధీరుడు, రవితేజుడు రావణు రెండవపుత్రుడు
అక్షకుమారుండు వచ్చె తీక్షణబాణములతోడ
వానరాధమా! నూకలు చెల్లిపోయె నీకటంచు
పక్షమ్ముకు గుఱిచేసెను వాడి రాక్షసాస్త్రములను
హనుమానుడు వాటముగా వానిని అరచేత బట్టి
అతని శిరముపై మోదెను అక్షయుడసువులు బాసెను—

## బ్రహ్మాస్త్ర బంధనం

హతులందఱ దలచుకొనుచు అసురరాజు కుందుచుండ
ఆగమేఘముల వచ్చెను అతనికడకు ఇంద్రజిత్తు

"నాన్నా! నేనుండగ నీ విట్లు దుఃఖపడనేల?
కోతియాట క్షణములలో కట్టించెద చూడుము" అని
రథారూఢుడై వాయువు పుత్రుడున్న స్థలముకేగె—
ఘోరమైన పోరు జరిగె యిరువురు వీరులమధ్య
బ్రహ్మాస్త్రము ప్రయోగించె మేఘనాథుడతనిపైకి
వాయునందనుడు దానికి బంధితుడయ్యేండి పోయె—
దృఢమగు త్రాళ్ళను గట్టి ముష్టిఘాతముల మోదుచు
కసిదీఅగ బాధించుచు రావణు సన్నిధి నిలిపిరి—
నిక్కముగా బ్రహ్మాస్త్రము ఒక్క క్షణమె బంధించెను
కారణమా బ్రహ్మదేవు డే ఝిచ్చిన వరమతనికి
కానీ ఆ అస్త్రమునకు లొంగినట్లుగా నటించె
రాక్షసరాజును కలియగ కావాలని అట్లుచేసె—

## హనుమత్సందేశం

ఈతడు సామాన్యమైన కోతికాదు నాన్నగారు!
శత్రుపక్ష గూఢచారి జిత్తులమారితగాడన
నృపుడు మంత్రిప్రహస్తుని నియోగించె విచారించ—
వానర నీవెవ్వరవు? నిన్నెవ్వరు పంపించిరి?
వాస్తవమగు నీ చరిత్ర మా ప్రభు సన్నిధి చెప్పిన
నిన్నిప్పుడె విడుదల చే యించెదనని ప్రహస్తుండు—
ఈ మాటకు హనుమంతుడు ఎంతో సంతోషించెను
రాముని సత్కథ తెలుపగ అవకాశము చిక్కెనదని—
"నే శ్రీరాముని దూతను అతని పత్నియేసీత
తప్పుజేసి ఆమెదెచ్చి ముప్పుదెచ్చుకున్నావు

వాలిని వధియించి నేడు సుగ్రీవుని చెలిమిచేసి
వానరకోటుల జానకి నన్వేషింపగ బంపెను
వారిలోన నేనొకడను వాయుదేవ పుత్రుండను
రామచండు బలమెంతో రుచి చూపితి నంతె నేడు
ఇక రాముడు వచ్చు చూడు పోగాలము నీకు నాడు
అతిశయోక్తి కాదిది నీ వనుభవించగల స్థితి అది —
నీ పుత్రుని బ్రహ్మాస్త్రము ననుబంధించుట వట్టిది
బ్రహ్మవరప్రసాదమున ననుస్పృశించి పోయెనంతె
అయినా నీ కుపదేశము చేయదలచి కట్టుబడితి —
"త్వం బ్రాహ్మణోహ్యుత్తమ వంశ సంభవః
పౌలస్త్యపుత్రోఽపి కుబేర బాంధవః"
బ్రహ్మవంశమున పుట్టిన బ్రాహ్మణ ప్రబుద్ధుడీవు
కుబేరునకు సోదరుడవు క్రూరత్వము ఎట్లు వచ్చె?
ఆత్మను ప్రశ్నించుకొనుము అసలు తత్త్వమర్ధమగును
దైవీ బుద్ధిని చూసిన దేవరహస్యము తెలియును —
స్థూల శరీరము దేహము సూక్ష్మ శరీరము బుద్ధి
ఇంద్రియములు వీని కలిసి సుఖ దుఃఖములనుభవించు
నేనను ఆత్మకు చెందవు ఈ బాధలు ఈ గాధలు
అంతా నే ననుకొనుటే అజ్ఞానము అసురేంద్రా! —
స్వప్న దృశ్యములె జగతిని యీ సుఖ దుఃఖములన్నీ
నశ్వరములు దేహాదులు ఆత్మ ఒక్కటే నిత్యము —
ప్రకృతిలో భాగములగు పంచ భూతములు కలిసి
దేహముగా మాఱుగనుక అది పృథ్వీవికారమె —

జీవుడు పోయిన వెనుక దేహమెంతసేపుండును ?
ఆత్మకాదు అనాత్మది ఆలోచించిన తెలియును —
ఆత్మ స్వరూపము నెఱిగి మసలుకున్న మహాత్ములు
నిత్యము సత్యము శివము సుందరముల గాంచగలరు
సులభముగా అవి లభించు సూక్ష్మమొకటి చెప్పెదవిను —
మూర్ఖత్వము విడిచి ప్రభువు శ్రీరాముని కడకు వచ్చి
అడియేన్ దాసోహమ్మని అతని కాళ్ళబడి వేడుము
రాముడు అతి దయామయుడు నినుక్షమించి విడువగలడు
కాదందువ అనతికాల మందు నీదు వధ తథ్యము" —

## రావణ ప్రతిక్రియ

రావణుడీ మాటలకు పట పట పండ్లను కొఱుకుచు
కోపము ముఖముల నిండగ కన్నుల నిప్పులు రాల్చుచు
"ఎవడవురా దుర్మార్గా ! ఏమిటి ఆ ప్రేలాపన ?
నీవా వానర నాకు నీతులు బోధించునది ?
దిక్కులేక అలమటించు బక్కరాముడా ఘనుడు ?
ఎక్కడ ఆ నరాధముడు ? ఒక్కవేటులో నఱికెద
ముందుగ నిన్నిట వధించి పిమ్మట జానకి వధించి
రామలక్ష్మణాదులను సుగ్రీవుని కపిబలమును
నలుసులుగా చేతనలిపి నిహతుల గావింతు చూడు" —
"ఏమీ రావణ నన్ను హతమార్చగ నీతరమా?
కోట్లకొలది నీ బోటుల కాలిగోటితో మీటెద
సర్వేశ కులిచ్చి భక్త సంరక్షణ చేయు రామ
నామామృత గ్రోలుండసు నీ పాలిట కాలుండను" —

ఏమిర నీ పొగరు! నోరు మూయర ఓరి వానర!
ఈ కోతిని తెగ నఱకుడు ముక్కలు ముక్కలుగా నన
"దూతను వధియించుట అది రాజనీతి కాదన్నా
మఱియొక పరి యోచించుము మనఘనతకు మచ్చవచ్చు"
అని తమ్ముడు విభీషణుడు వారించగ సరిలే అని
వీడి తోక గుడ్డచుట్టి నూనె తడిపి అంటించుడు
కురూపియై కుములు ననగ రాక్షసు లట్లే చేసిరి —

## లంకాదహనం

క్షణములో సమీరసుతుడు సూక్ష్మరూపమును ధరించి
త్రాళ్ళు, కట్లు, బంధమ్ములు త్రెంచుకు బయటకు వచ్చి
దేహమొక్కసారిగ విను వీధికి ఉంకించి ఎగిరి
కాలుతున్న తోక త్రిప్పి లంకకు నిప్పంటించెను —
గుప్పున మంటలులేచి గృహములన్ని కాలుచుండ
హా నాథా! హా పుత్రా! హా హనుమా! అను రోదన
ఆర్తనాదములు చెవిబడ హనుమంతుడు శాంతించెను
అంబుధిలో తోకముంచి అగ్నిని ఆర్పుకు నేర్పుగ
మహేంద్రమ్ము చేరుకొనెను మహోత్సాహమున మారుతి—
మిత్రులార! చూచినాడ మహాతల్లి సీతమ్మను
వేగముగా మనమిప్పుడు రఘురాముని చేరవలెను
నడువుడంచు హనుమ నుడువ వడివడిగా పరుగులిడిరి —

## మధువన విధ్వంసం

దారిని మధువనము చూడ కోర్కెలు గుబ్బాలాయెను
చిద్విలాసమున చిత్తుగ మధుపుత్రాగి మత్తెక్కిరి

వికృత చేష్టల వనమును విధ్వంసము చేయుచుండ
తోటమాలు లడ్డుకొనగ తఱిమికొట్టి పంపించిరి —

వనపాలుడు దధివక్త్రుడు సుగ్రీవునిచేరి చెప్ప
మహారాజు మిమ్ము చూడ త్వరపడుచున్నాడనమనె —

కబురు చెవిని బడినంతనె కంగారుగ బయలుదేఱి
పరుగులతో ఉఱుకులతో ప్రస్రవణము చేరుకొనిరి —

హనుమంతుడు రామునితో చూసితి సీతామాతను
అన ఆనందమున రాము డతని కౌగిలించుకొనెను —

అనంతరము హనుమంతుడు రామపాదములకు మ్రొక్కి
అంతయూ సవిస్తరముగ విశద పఱచెనందఱకూ —

సీత రాఘవున కంపిన చూడామణి తీసియిచ్చి
కాకము కథ గుప్తముగా గుర్తుగ రామునికి చెప్పె
"మారుతి నీ ఉపకారము మఱువలేను జన్మలోన"
అనుచూ ఆలింగనముల అభినందించెను రాముడు —

తులసీ దళ పుష్పాదుల పూజించిన భక్తులకే
అలవైకుంఠపురమ్మున అలవియైన హరి హృదయం
హనుమానుని అదృష్టము ఇలలోనే లభించింది

అధ్యాత్మ గేయ రామాయణం
సుందరకాండ సమాప్తం



# యుద్ధకాండ

## లంకాపుర వర్ణనం

"అహంచ రఘువంశశ్చ లక్ష్మణశ్చ కపీశ్వరః
జానక్యా దర్శనేనాఽద్యరక్షితాఃస్మో హనుమతాః"

కమలనేత్రి జాడ చెప్పి కుదుట బఱచినావు మనసు
రఘువంశము శాశ్వతముగ ఋణపడిపోయెను నీకు
అని రాముడు హనుమంతుని ప్రశంశించి ప్రశ్నించెను
నలువైపుల లంకాపురి నైసర్గిక స్థితి ఏమని —
"లంకా దివ్య పురీదేవ త్రికూట శిఖరే స్థితా
స్వర్ణప్రాకార సహితా స్వర్ణాట్టాలిక సంయుతా"
"పెద్దనగరమది త్రికూట పర్వతాగ్రమున నున్నది
ప్రాకారం స్వర్ణమయం బురుజులన్ని రజిత గిరులు
నలువైపుల ప్రహరీలకు నిలువులోతు కందకములు
జలపూరితమై ప్రవేశ మవరోధించుచు నున్నవి
మణిస్తంభపు మందిరములు పట్టణమున గృహములన్ని
లక్షలాది గజారూఢు లుందురు పశ్చిమ ముఖమున
అశ్వబలము, కాల్బలము ఉత్తరద్వారము నున్నది—
తూర్పుద్వారమందు లెక్క కందని సైనికబృందము
అట్లే దక్షిణద్వారమ నంతసేన కాపున్నది
మార్గములన్నియు శతఘ్ని యంత్రాదుల సురక్షితము
ఎంతున్నా మనదెబ్బను కాయుట వాడబ్బతరమ ?

మనధాటికి నిలబడగల మొనగాడెవడూ లేడట
యుద్ధయాత్ర త్వరితంగా బయలుదేర దీయుండనె__
ఆతని ఉత్సాహమునకు ఆనందించిన రాముడు
హనుమంతుని భుజము తట్టి అందరి నుద్దేశించి
జయముహూర్త మొచ్చినది విజయము సార్థక సమయము
కుడినేత్రము అదురుచుండె నడిపించుడు సేనల ననె__
సైన్యమంత బయలుదేఱి సహ్య మలయ గిరులదాటి
సాగరతీరము చేరిరి విశ్రాంతిగ విడియించిరి
ఆకసమును ముద్దిడుకొను కెరటాలను సాగరము
అతిభీకర ఘోషలతో ప్రళయ జలధిలాగుండెను__

## రావణ మంత్రాంగం

హనుమంతుడు చేసినపని రావణు లజ్జితు జేసెను
పైగా రాముని సేనలు సాంద్రతీరమును జేరెను
మదిలో తత్తరమురేగ మంత్రులందఱిని బిలిచి
కింకర్తవ్యం బాగుగ ఆలోచించుడు మీరన
రాజా నీకేల బెదరు త్రైలోక్య విజేత వీవు
దేవేంద్రుని బంధించిన ధీరుడు నీ కుమారుడు
హనుమంతుని ఆగడముల కవకాశము అలక్ష్యమే
కోతేమిటి చేయునని పూతికగా చూసితిమి
అదే మనది పొరబాటు అసమర్థత కాదుకాదు
ఆజ్ఞాపింపుడు యిప్పుడు అందరి మడియింతుమనిరి__
"జరిగిన తప్పుకు పగచిన ఒఱిగెడిదేమీ లేదు
వారందఱ నిప్డె నే వధించెదను చూడు నేడు"__

కుంభకర్ణుడిట్లనగా సంబరపడి ఇంద్రజిత్తు
నాన్నా! నాకానతిమ్ము రామలక్ష్మణులనెగాక
జతగా సుగ్రీవాదుల హతమొనర్చి వత్తుననెను—

## విభీషణుని హితోపదేశం

అపుడు విభీషణుడులేచి "అన్నా నామాట విను
పురిగొల్పెడు వీరెల్లరు రామునెదుట నిలువలేరు
సీతాగ్రహణమ్ము నిన్ను పట్టి మోక్షమిడకున్నది
దీనికి ఒకటేమార్గము జానకి రాముని కిచ్చుట
అట్లుచేయకున్న అసుర సంతతి మిగలదు చివరకు
పరమేశుడె దిగివచ్చిన పాతాళమ్మున దాగిన
రామ శరాఘాతము త ప్పింప ఎవరితరముకాదు
ఈ దౌర్భాగ్యపు దుస్థితి లంకనొసట వ్రాయవద్దు"—
ఆతని పలుకులు దారుణ అస్త్రములై చెవికిసోక
విభీషణా! ఈమాటలు ఎవరైనా పలికియున్న
వాని శిరము ఈపాటికి వేయితునకలయ్యుండును
తమ్ముడవను భావమొకటె నీ తల కాసినదిప్పుడు
అయినా నాతోవుంటూ నా సంపదలను తింటూ
నాకు అనిష్టము తలచే నీవా నా తమ్ముడవు?
ఛీఛీ తమ్ముడవుకావు చూడగ శత్రువు నీవని
కేకలతో అంకెలతో కలవాలము పైకెత్తగ
విభీషణుడు మంత్రులతో వినువీథికి ఎగిరిపోయె —
ఆకాశమునుండి మరల ఆఖరి యత్నముగ పలికె
"నీ మూర్ఖత్వము అన్నా! నిజము కాననీకున్నది

నీ మృత్యువే రాఘవుడు  మహామాత జనక సుత
విజ్ఞతతో పరమాత్మకు  వైదేహిని సమర్పించు
అన్నా యిది జరగకున్న  లంక నిజముగా సున్నా" —

"చవటా ! నీ వెగటు మాట  కట్టి పెట్టి రమ్మిచటకు
రాక ఆజ్ఞ మీరితివా  నీ బ్రతుకే పెద్దసున్న"—

దుర్మార్గుడు దుష్టుడైన  దౌర్భాగ్యుని కొలువు కంటె
మాధవు కొలిచిన జీవన  ముక్తయినా దొరుకు నని
వలదు నీదు కొలువటంచు  రాముని సన్నిధి కరిగెను —

## విభీషణ శరణాగతి

"రామా ! రఘురామ ! శరణు  రావణు తమ్ముడ నేను
విభీషణుడు నాపేరు  విశ్వపతీ! శరణు శరణు
నీ పని ఘోర మధర్మము  నీతిగ సీతామాతను
రాముని కర్పించి కాళ్ళ  బడమటంచు హితము పలుక
లంకేశుడు ఆవేశిత  కోపముతో కత్తిదూసె
అతని పాడు కొలువు వీడి  మోక్షగామినై వచ్చితి
మీ సేవను అనుగ్రహించి  మము కృతార్థులను జేయుడు"
అని దూరము నుండి అతడు  ఆర్తిని ఆర్ద్రముగ పలికె —

విభీషణుని వాక్యములను  సుగ్రీవుడు నమ్మలేదు
"రామా ! రాక్షసుడీతడు  విశ్వాసార్హుడు కాడు
అదను చూసి మనలను  వధియించ యిచటి కొచ్చియుండు
అనతిమ్ము ఒక వేటున  అతని తల తెగనరికెద"—

మందస్మిత వదనముతో రాముడు వారించి పలికె
"అర్థించిన వారికెల్ల అభయ మిచ్చు వ్రత నియమము
నాదని నీవెఱుంగవా ? నిర్భయముగ రమ్మనుము"—
స్వామి ఆజ్ఞ సుగ్రీవుడు సాదరముగ పాలించెను

విభీషణుడు శ్రీరాముని పాదమ్ములబడి స్తుతించె

"నమస్తే రామరాజేంద్ర నమః సీతామనోహర
నమస్తే చండ కోదండ నమస్తే భక్తవత్సల"

"ముత్తెపు చిప్పను ఎఱుగని మనిషి దాని వెండి యనును
కానీ అది తెలిసినపుడు భ్రమ తొలగును నిజమెఱుగును
అట్లే అజ్ఞానికి యీ జగతి నిత్యమనిపించును
అజ్ఞానపు తెర తొలగిన తెలియును యిది మిథ్యయని —

ఇంద్రుడు, అగ్నియు, యముడు, వరుణుడు, వాయువు, రుద్రుడు
నిరుతి, కుబేరాదులలో నిగూఢాత్మ శక్తి నీవు
మహిని ధర్మ రక్షణకై మానుష రూపము నెత్తగ
నిక్కము తెలియని వారలు నినుమానవు డనుకొందురు
నిజమెఱిగిన సుజ్ఞానులు నిన్ను చేరి భజించెదరు
నీపాదాంబుజములపై నిశ్చల భక్తిని కలిగి
నీసేవా భాగ్యముతో పునీతుడను కాదలచితి—

"నమః సీతాపతే రామ నమః కారుణికోత్తమ
రావణారే నమస్తుభ్యం త్రాహిమాం భవసాగరాత్"

అని ప్రార్థింపగ మెచ్చి వరము కోరుకొమ్మనగా
"ప్రభూ ! భౌతికవసరముల పట్ల నాకు వాంఛలేదు

నీదు పాదపద్మములను నిరతము కొలిచెడు భాగ్యము
ప్రసాదించు అదే నాదు ప్రార్థన మనసా వాచా—

రాముడతని కోరిక విని మోదముతో తథాస్తనెను
సద్యఃఫలముగ ముందుగ లంకకు రాజుగ నిపుడే
అభిషిక్తుని చేసెదనన హనుమదాది అధినేతలు
కలశముతో జలము తేగ రాముడు పట్టము కట్టెను
సూర్యచంద్రులూ భూమీ రామచరిత లోకములో
నిలిచియుండు నంతవఱకు పాలింతువు నీవనెను—

సుగ్రీవుడు విభీషణుని కౌగలించుకొని సోదర !
మనమంతా పరమాత్మకు భక్తులమనురక్తులము
అందఱిలో నిన్ను రామ ప్రభువు పెద్దగాజేసెను
కల్మషమ్ము లేకుండా కార్యములో తోడ్పడుమన
పూజ్యభావమున వచ్చితి పరిశుద్ధుడ నిష్కపటుడ
దేవర కార్యముకొఱకై దేనికైన సిద్ధమనెను—

## రావణ గూఢచర్యం

ఇది ఇట్లుండగ లంకను దశకంఠుడు 'శుకుని' బిలిచి
గుప్తచారునిగ బంపెను సుగ్రీవుని మనసుమార్చ
ఆతడక్కడికి వచ్చి ఆకాశమునందుండే
"సుగ్రీవా ! రావణ సందేశము తెచ్చితి వినుము
సోదరతుల్యుడవు నాకు సూర్యపుత్రుడవు నీవు
వనచరములకెల్ల చక్రవర్తివి అని మఱవబోకు
బానిసవై నరునిగొల్వ కర్మేమిటి ? నగుబాటు

సేవకవృత్తినిమాని స్వేచ్ఛగ రాజ్యము నేలుము
నీ సైన్యము తీసికొని కిష్కింధకు తరలిపొమ్ము"
అని తెలిపెడు శుకుని జంప వానరులెగసిరిపైకి
అంతట రాముడు వలదనె దూతను చంపగ రాదని—

వదలిపెట్టబడియు మరల జవాబేమిటని అడిగెను
ఆ మాటకు సుగ్రీవుడు ఆగ్రహించి పలికె నిటుల
"వదరుబోత! నిన్ను బట్టి వదలుట మీలంకలోనె"
జవాబిదే ఇప్పటికి $^{20}$జర ఎఱిగెద వప్పటికి
అని ఆతని బంధించెను రాముని ఆనతి పొంది—

అంతకుముందే వచ్చిన "శార్దూలుండ"ను చారుడు
వానరసైన్యము శక్తి శుక నిర్బంధము తదాది
చెప్పగ దశకంఠుడు ని ట్టూర్పు విడిచి నిజగృహమున
దీర్ఘ చింతనుండి పోయె గుండె బరువు పెరిగిపోయె —

## సేతు బంధనం

సుగ్రీవుని సూచనపై సముద్రుణ్ణి ప్రార్థించగ
నిశ్చయుడై శ్రీరాముడు నిశ్చలముగ దర్భలపై
నియమిత వ్రత ఉపాసనల తపమును ప్రారంభించెను —

దివారాత్రు లెన్నో గడిచె సాగరు దర్శనమె లేదు
క్రోధమూర్తియై జలధిని బంధించెద నంచు ప్రభువు
విల్లునెక్కుపెట్ట త్రాహి త్రాహి యంచు సముద్రుండు
ఉఱుకులు పరుగుల వచ్చి రామ పాదములపైబడి

దేవా ! యీ సృష్ట్యాదిని జడముగ నే పుట్టుటచే
నీ మనసును తెలిసికొనే శక్తిలేని వాడనైతి
అజ్ఞానుడ రఘుదేవా ఆపన్నుడ కావుమనియె—

"ఈ బాణము వ్యర్థముగా వెనుదిరగదు బలిగొనకను
శీఘ్రముగా లక్ష్యముగా మఱియొకదానిని చూపుము"—

"దేవా ఉత్తరమందున 'ద్రుమకుల్య'ను దుర్గముంది
దానిపైన నివాసులు దుర్మార్గులు పాపాత్ములు
నికృష్టులు నిర్దయులు నిరతప్రజాపీడకులు
దయతో నీ శరము వారి శరీరముల ద్రుంచుగాక"—

నోటిమాట నోటనుండ శరముపోయి వారి చంపి
తిరిగివచ్చి శ్రీరాముని అమ్ములపొదిలో దూరెను—

వినమ్రుడై సాగరుడు "విభుడా ! జగదాధారుడ !
లంకకు వారధి కట్టగ అట్టి వాడు సమర్థుండు
మీ సైన్యమునందె గలడు 'నలుడు' విశ్వకర్మసుతుడు
వరప్రభావుడగుటను యీ కార్యము నెఱవేర్చగలడు"
అని వందనమాచరించి శలవుపొంది వెడలిపోయె—

లక్ష్మణ సుగ్రీవులతో నలుని బిలిచి శ్రీరాముడు
వానరసాయము తీసుకు వారధికట్టగ కోరెను
రామేశ్వరు ప్రతిష్ఠించి శంకుస్థాప నముజేసెను
పర్వతములు, వృక్షములు కోతుల నుపయోగించి
నూఱు యోజనముల పొడవు పదియోజనముల వెడల్పు

వారధిక ట్టెను నలుడు రామాజ్ఞను తలదాల్చి
దానిపైన నడచిపోయి లంకప్రవేశము జేసిరి—

## లంక ముట్టడి

ఇత్తఱి విముక్తుడైన శుకుడు రావణుని చేరెను
జరిగినదంతయు చెప్పి ఎదిరిశక్తి వివరించెను
"రాముడు వీరుడు, లక్ష్మణ సుగ్రీవులు మహాబలులు
అంగద, హనుమంతాదులు అమిత పరాక్రమవంతులు
అటు చూడుడు అసంఖ్యాక సేన లంక ప్రవేశించె
యుద్ధానికి సన్నద్ధులై ఉఱుకులు వేయుచునుండిరి—
నాదమొనర్చెడి వాడే నీలుడు అగ్నికి పుత్రుడు
సర్వసేన కధ్యక్షుడు శూరధీర సమున్నతుడు—
పర్వత శిఖరమ్ము వంటి శరీరమున రోమముతో
వాలము త్రిప్పెడివాడే వాలికొడుకు అంగదుడు—
అడుగో అటు హనుమంతుడు అక్షకుమారాంతకుడు
సుగ్రీవుని సంప్రీదించు వాడే శ్వేతుడు ఘనుడు—
ఆప్రక్కన నున్నవాడు రంభుడు వానరయోధుడు
లంకను తానొక్కరుడే నాశనమ్మొనర్చగలడు—
ఓరగ చూచెడి వాడు వీరుడు అతడే శరభుడు
అడుగో వచ్చెడివాడు నలుడు విశ్వకర్మసుతుడు
వారధి నిర్మించినట్టి విఖ్యాతుడు అతడె ఇట్లు
ఎందఱ చెప్పగ మనెదవు ఎంత చెప్పినా తఱగదు

ఉప్పెనవలె వచ్చినారు త్రిప్పికొట్టుటసాధ్యము
క్ష్మజాతను సమర్పించి క్షమాభిక్ష వేడుదము —

## శుకుని హితోపదేశం

సంసారము, శరీరము, సంపదలూ అశాశ్వతము
మలము, మాంస యెముకలు దుర్గంధ భరిత మీ దేహం
భోగాదుల ననుభవించు భాగమిచటనే నశించు
ఈదేహము నాదనుకొని దీని భోగముల కొఱకై
దుఃఖము కొనితెచ్చుకొనుట విజ్ఞుల లక్షణముకాదు
బ్రాహ్మణుడవు అదేగాక బ్రహ్మవేత్తవై యుండియు
అజ్ఞానిగ ఇహసుఖముల కఱ్ఱులు చాచుట తగదు
విషయలోలుడగుటమాని రామ పాదములబట్టి
ఆ మహాత్మ్మ పూజించి పశ్చాత్తాపము పొందుము
మంత్రినగుట హితముకోరి ఇంతగ నే చెప్పుచుంటి"—
"ఏమీ నా సేవకుడవు ఎంత ధైర్యమిట్లనుటకు ?
తులువా ! నీ నాలుక తు త్రినియలు చేయగవలయును
నీదు గతము సేవదలచి కనికరించి విడుచుచుంటి
నీచా ! నాయెదుట నింక నిలువకు పో" పొమ్మనగా
మహానంద మంది శుకుడు మంచి దనుచు వెడలిపోయె —

## శుక చరిత్ర

ఇంతకు ఈ శుకుడు మున్ను పేరుగన్న మునీశ్వరుడె
పూర్వజన్మమున నీతడు బ్రాహ్మణుండు బ్రహ్మవేత్త

వనమునందు భార్యతోడ వానప్రస్థమున నుండి
దేవతలకు అభ్యుదయం దితి సుతులకు వినాశనం
కోరి యజ్ఞ క్రతువులను జరుపుచుండ పసిగట్టి
'వజ్ర దంష్ట్రి'డను దనుజుడు వానిపైన పగబట్టెను —

ఇంతలోన అగస్త్యుండు ఈతని చూడగ రాగా
యథావిధిగ శుకుడాతని సత్కరించి పూజించి
విందుకు ఆహ్వానించెను సంధ్యావార్చనతడేగెను —

వజ్రదంష్ట్రిడిదే అదను అని తలంచి అగస్త్యునిగ
మాఱు రూపమున వచ్చి మాంసాహారము కోరెను
సరిలేయని శుకుడు దాని సమాయత్త పఱుచుచుండ
అసలు అగస్త్యుడు వచ్చి విస్తరెదుట కూర్చొనెను —

వజ్రదంష్ట్రి రాక్షసుడు శుకుని పత్నిలో దూరి
వండిన మాంసము విస్తరి వడ్డించి మాయమయ్యె
మాంసముగని అగస్త్యుండు మహోగ్రుడై శుకుని జూసి
దుర్మతి! దీనికి ప్రతిగా దైత్యుడుగా పుట్టుమనెను —

"మునివర ఇది ఏమి ఘోర మీవేకద కోరితివి?
మాంసము వండించిపెట్ట మనినమాట మఱచితివా?
నీ ఆజ్ఞను పాలించిన పాపానిక యీ శాపము?"—

కుంభ సంభవుండిదివిని విభ్రాంతుండై "ఏమిది;"
అని ముహూర్తకాలంలో ధ్యానమగ్నుడై చూసెను
దివ్యదృష్టి వజ్రదంష్ట్రి దుష్కార్యము కన్పట్టెను
"నిష్కారణముగ మునివర నీకు శాపమిడినాను

నాదువచన మమోఘమ్మ్మ రాక్షస జన్మము తప్పదు
కానీ నీ శాపవిము క్తిని నేనే ప్రసాదింతు
అసురరాజు రావణునక నుంగు మంత్రిగా నుండుము
రామసైన్య పరిశీలన చారునిగా నినుపంపును
శ్రీరాముని దర్శనము శాపవిముక్తుని జేయును
తిరిగివచ్చి రావణునకు తత్త్వబోధ చేయగనే
ముక్తుడవై పూర్వరూప మంద గలవు" అనిచెప్పెను
వెంటనె ఆ రీతిమాటి వైఖానసులను గలిసెను—

## మాల్యవంతుని హితబోధ

అనంతరము మాల్యవంత డను రాక్షస పెద్దవచ్చె
రావణునికి తల్లియైన 'కైకసి' పెదతండ్రి అతడు
మనుమని హితమునుగోరి జరుగుచున్న విధముచెప్పె
"మైథిలివచ్చిన దాదిగ దుర్నిమిత్తములు రేగెను
ఘోరోత్పాతములెన్నో లంక నుద్భవించుచుండె—

మేఘములెల్లడల కర్ణ కఠోరముగ గర్జించుచు
వెచ్చటి నెత్తురు ధారగ నగరిని వర్షించుచుండె—

పూజించే దేవప్రతిమ లన్నియు కదలుచు నుండెను
పండ్లికిలించుచు కాళిక వికృతముగ నవ్వుచుండె—

గోవుల గర్భములనుండి గాడిదపిల్లలు పుట్టుచు
ఎలుకలు పిల్లులతోనూ, పాములు గ్రద్దలతోనూ
పోరాటము సలుపుచుండె విపరీతము లిట్లెన్నో—

కుల రక్షణ కొఱకుపీని శాంతింపగ జేయుటకు
సీతా సాధ్విని రాముని సన్నిధి జేర్చుటె యుక్తము
రాముడు మానవుడు కాడు నారాయణుడతడు వినుము
పవిత్రాత్మతో ఆతని ప్రార్థించుము కరుణించును"—
"తాతా! ఏమిటి పలికితి విది నను బెదిరించుటకా?
బత్తెము ముట్టెన ఏమి చిత్తము అటుమార్చితివి?
రాముడు ఒకనరుడు ఆత డాశ్రయించె వానరులను
ఆలి, ఇల్లు లేకతిరుగు అసమర్థుడు వ్యర్థుడతడు
అతనిగొప్ప నా ముందర! చెప్పుతీసికొని కొట్టెద
మాతామహుడవుగాన మన్నించితి వెడలిపొమ్ము"
అని తన మంత్రులగూడి ఆ చోటును విడిచివెళ్ళ—

## యుద్ధారంభం

రావణుండు నిజసౌధపు శిఖరమందు కూర్చుండి
విలోకించె రామసైన్య విస్తీర్ణము విస్తుపోయె—
రాముడు రావణుని చూసె రగిలెను హృది రణజ్వాల
అర్ధచంద్ర ఆకారపు అస్త్రము వదిలెను అచటికి
తోడుతనది రావణుపది తలలనున్న కిరీటముల
తృటిలో ఛేదించగగని దశాననుడు సిగ్గుపడి
"సైనికులారా! మీరలు వానరులను వధించండి"
అనుట తడవుగాగ యుద్ధ భేరీలను మ్రోగించిరి
మహిషమ్ములు, ఉష్ట్రమ్ములు, గాడిదలు, సింహమ్ములు,
ఏనుగులను ఎక్కి ఖడ్గ శూలమ్ములు ధనుస్సులు
చేతబట్టి నగర ద్వార ములు చేరిరి భీతిగొలుప —

ఇంతకు ముందే రాముని ఆనతిగొని కోతిమూక
పెద్దపెద్ద పర్వతముల వృక్షములను పెఱికి తెచ్చి
ధృఢమగు భుజముల నిడుకొని ద్వారములధిరోహించిరి —

హనుమంతుడు, అంగదుడు, కుముదుడు, నీలుడు, నలుడు
శరభుడు, మైందుడు, ద్వివిదుడు, జాంబవంతుడు, కేసరి
మొదలగు వీరవరేణ్యులు నగరములో కాలిడిరి —

క్రూరులైన రాక్షసులు రథ గజ తురగములనెక్కి
నినదించుచు ఒడలు మఱచి నిర్దయతో పోరాడిరి —

అయినా ఆ అసురసేన అంతరించి పోతుండెను
రామదండు ఉత్సాహం రెచ్చి శక్తి పెరుగుచుండె
తొలినాడే లక్షలాది రాక్షస మూకల చంపిరి —

భీతిల్లిన ఇంద్రజిత్తు బ్రహ్మాస్త్రము ప్రయోగించ
వానరసేనలు వెంటనె సోలిపోవుచుంట చూసి
చాపమందుకొని రాముడు ప్రత్యస్త్రము ప్రయోగించె
ఇనకుల తిలకుని ధాటికి ఇంద్రజిత్తు పాఱిపోయె
క్షతగాత్రుల వానరులను చూసిన రాముని మనస్సు
చింతా వ్యాకులముగాగ హనుమంతుని పిలిచి చెప్పె
"పాలసంద్ర తీరమునకు దగ్గర ద్రోణాద్రి గలదు
అక్కడి ఓషధుల తెచ్చి వీరల సరిజేయవచ్చు"
అనగానే వాయుసుతుడు తెచ్చె చికిత్సలు జరిగెను —

స్వస్థులు వానరులు మరల సింహనాద మొనర్చగా
దశకంఠుడు తన యోధుల యుద్ధభూమికరుగుడనెను —

అతికాయుడు, ప్రహస్తుడు, మహాపార్శ్వ. మహోదరులు
దేవశత్రువగు నికుంభ, దేవాంతక, నరాంతకులు
వేలాదిగ వీరవరులు రంగప్రవేశము జేసి
వానర సైన్యమునంతా వికావికలు చేయుచుండ
రామదండు తిరుగబడి ఎదురు దాడులను సలిపిరి
బాహు బలాఢ్యులు ఎందరో రామునిచే నిహతులైరి
సుగ్రీవుడు కొందఱిని, అంగదుండు కొందఱిని,
లక్ష్మణుడింకొందఱినీ, హనుమంతుడు మఱికొందఱి
రాక్షసయోధుల వధింప దనుజ బలము తఱిగిపోయె—

## లక్ష్మణ మూర్ఛ

అతికాయుడు, మహాకాయ వీరులంత మృతులగుటను
నగర రక్షణముకొడుకగు ఇంద్రజిత్తు కొప్పగించి
దానవ రాజే స్వయముగ యుద్ధమునకు బయలుదేఱె—
విషముగ్రక్కు బాణములను వర్షముగా కురిపించుచు
వానరసేనల నెల్లెడ మరణోన్ముఖులను చేసెను—
సుగ్రీవాదులు ఎదర్చ కార్చిచ్చై తఱుముచుండ
విభీషణుడు ఎదురుపడగ భీషణాగ్ని కనులనిండ
మయుడిచ్చిన మహాశక్తి అతనిపైన ప్రయోగించె—
తీక్షణముగ దూసుకొచ్చి విభీషణుని దెసకదిచనె
లక్ష్మణుడడ్డుగ వచ్చెను వక్షమ్మున తగిలిపడెను
దశకంఠుడు దుర్బుద్ధిని భూపతితుని సౌమిత్రిని
దగ్ధముచేయగ అతని దేహముపైకెత్తుచుండ

వేగముగా హనుమంతుడు పరుగు పరుగుతోవచ్చి
ముష్టిని ఒకదెబ్బకొట్టె రావణు నుదుటను గట్టిగ
దిమ్మెరపోయిన దనుజుడు తన రథమున వాలిపోవ
హనుమంతుడు లక్ష్మణుని దూరము తీసుకుపోయెను—

మరల రావణుడు లేచి రాముడున్న చోటికిజని
ధనువును సవరించుచుండ దశరథరాముడు చూసెను
"రాక్షసాధమా! భువి నీ రోజులు దగ్గరపడ్డవి
కావుననే మిడిసిపాటు కుండనిండి పోతున్నది"
అని పలికెడు రఘురాముని హతమార్చగ రావణుండు
వేలశరము లాతనిపై వెఱపుగొలుప కురిపించెను—

తక్షణమే శ్రీరాముడు దేవమంత్ర పఠనచేసి
దివ్యశరము ప్రయోగించె దేహమంత వేధించగ
కాయమంత గాయాలై కూలి సోలిపోయెనతడు—

"రావణ! అలసితివి నీవు ఇంటికి పొమ్మింక నేడు"
అని ఆతని విడిచివచ్చి తమ్ముని మృతస్థితి చూసెను
గుండె తఱుగుకొని పోయెను దుఃఖము కట్టలు తెగెను
"నన్ను విడిచియుండలేక సుఖవాసము వీడివచ్చి
నాకొఱకై పూలసెజ్జ వదలి రాళ్ళ పరుంటివే!
ఎండవాన లెక్కించక నాకండగ నిలిచితివే!
ఎన్నో కష్టములకోర్చి నన్ను ఆదుకొంటివిగద!
అట్టి నిన్ను కోల్పోయిన అభాగ్యుడను దౌర్భాగ్యుడ—

ఏడీ నాభ్రాతం టే ఊర్మిళకేమని చెప్పుదు ?
రామా నాబిడ్డేడని అమ్మ సుమిత్రడిగినపుడు
ఏమని బదులివ్వగలను ? ఏమని ఓదార్చగలను ?
అయినా నాపిచ్చిగాని నాకీ జీవితమెందుకు ?
అయ్యో ! నీమృతిని లోక మంధకారమైపోయెను
తమ్ముడ ! ఈ కటికనేల దీర్ఘనిద్ర పోతుంటివ ?
నీవులేని బ్రతుకు నాకు నిరర్ధకము వ్యర్ధము"అని
కంటికి మింటికి ధారగ రాముడు విలపించి తుదకు
"ఏమిటి ఈ దేహభ్రాంతి ! ఎటు పోవుచునుంటి నేను !"
అని మనమున చింతజేసి ఋణము చెల్లెననుచుండగ
వానర వైద్యులు వచ్చి మృతిగాదిది మూర్ఛ అనిరి—
అయితే యిప్పుడె పోయి సంజీవిని తెచ్చెదనని
ద్రోణాద్రికి హనుమంతుడు వాయువేగమున వెళ్ళెను—

## హనుమంతుడు ద్రోణాద్రిని దెచ్చుట

రణభూమిని తేరుకొనిన రావణుడీ సంగతి విని
మారీచుని కుమారుని కాలనేమి యింటికేగె
"రాజా యీ అర్ధరాత్రి నీ వొచ్చిన కతయేమిటి ?"—
"కాలము యిటుతెచ్చినది కష్టమొకటి వచ్చినది
రామభ్రాత లక్ష్మణుండు రణమున నిర్జీవుడాయె
పునర్జీవునిగ జేసే పూనికనంజన తనయుడు
సంజీవిని దెచ్చుటకై ద్రోణాద్రికి జనుచుండెను
దానికి విఘ్నమొనర్చగ నిన్నుకోరగా వచ్చితి"—

ఇది విని నిశ్చేష్టుండై మారీచుడు పలికె నిటుల
"ఇంతదనుక యుద్ధములో పుత్రులు, పౌత్రులు, మంత్రులు
రాక్షస వీరాగ్రణులు రాలిపోయిరని వింటిని
కులమంతా పోయాకా రాజ్యమేల ? సీతయేల ?
సీతను రామునకిచ్చి శరణు వేడుటుచితమగును
భక్తిని సేవించిన గత పాపమైన దగ్ధమగును"—
అని హితముపదేశించగ క్రుద్ధుడైన రావణుండు
రామ పక్షపాతివిరా ? నా మాటను కాదందువ ?
చూడుము నిన్నీక్షణమున నిహతుని గావించెదనన
"అబ్బె నీ హితముగోరి ఇంతగ పలికితినంతే
నీకిది రుచియించకున్న నీ ఆజ్ఞనె పాలింతును"
అని బెదరుచు వంతపలికి చెప్పినపని కొప్పుకొనెను—

## కాలనేమి కపటవేషం

కాలనేమి బయలుదేటి కపివర్యుని మార్గములో
హిమవత్పర్వత ప్రాంతము నందున ఒక తపోవనము
కల్పించీ మునివేషము తో కదలక కూర్చుండెను—
ఆకాశమ్మున వెడలెడు హనుమంతుడు దీనిగాంచి
గతమున నేనొచ్చినపుడు ఇది కనిపించగలేదే !
దారి తప్పితిన ఏమని సందేహము మదినిపొంది
దాహార్తిని కూడ తీర్చు కొనగవచ్చునని యెంచి
క్రిందికి దిగె హనుమంతుడు కాలనేమి తపమునుండె—
హనుమంతుడు కపటఋషికి అభివాదము సలిపి పలికె
"పవన పుత్రుడను నేను పాలకడలి కరుగుచుంటి
దప్పిక గొన్నట్టివాత జలమెటనున్నదొ చెప్పుడు"—

"ఇదిగో నా కమండలము నిండుగ నీరున్నదిందు
ఇవిగో యీ పండ్లు తిని హాయిగ విశ్రాంతి పొందు
అలుపుతీర నిద్రించి ఆవెనుకను వెళ్ళవచ్చు
నీవు పోవుకార్యము నా కవగతమైనది హనుమా!
ఏ లక్ష్మణు బ్రతికించగ నీవు బయలుదేఱితివో
ఆపని అక్కఱలేకనె ఆతడచట లేచినాడు
సర్వవానరులు కూడా స్వస్థులైరి విస్తుపోకు
సుఖముగ నిద్రించి తిరిగి లంకకు వెడలుము హనుమా!"—
"కృతజ్ఞతలు ఓ మునీంద్ర కృపతో తెలిపినవార్తకు
కమండలము నీరెంత! కంఠము పూర్తిగ తడవదె!
జలాశయము నొకదానిని చూపుము దాహము తీరును"—
సరియని శిష్యుని పిలిచి సరోవరము చూపుమని
కనులు మూసుకుని త్రాగి రమ్ము మంత్రమిచ్చెద ననె—

## ధాన్యమాలి శాపవిముక్తి

వటునితోడ వెళ్ళి జలా శయమున నేత్రములు మూసి
జలపానము చేయుచుండ మొసలి పట్టుకొనె కాలిని
మడుగులోకిలాగు మకరి ముఖము చీల్చి చంపివేయ
గగనమందు దివ్యకాంత కనిపించెను వినిపించెను
"హనుమా! నే అప్సరసను 'ధాన్యమాలి' నాపేరు
కారణాంతరమున నేను మకరినైతి శాపగతిని
నీచే యీ విధి నేడు శాపవిముక్తిని పొందితి
'ధన్యోఽస్మి' అని మ్రొక్కుచు కాలనేమికథ చెప్పెను —

"ఆశ్రమమున నున్నవాడు ఋషికాడతి మాయగాడు
కాలనేమి అను అసురుడు రావణ కింకరుడాతడు
నీ కార్యమునకు విఘ్నము కలిగింపగ పంపబడెను
శీఘ్రము నా మోసగాని సంహరించి ముందు కేగు"
అని చెప్పి ధాన్యమాలి అంతర్హితురాలయ్యెను—
హనుమంతుడు ఆశ్రమమున అడుగిడనా కపటముని
వచ్చితివా కపిశ్రేష్ఠా? మంత్రము నుపదేశించెద
సఫలతకై ముందుగ నా గురుదక్షిణ నిమ్మనగా
హనుమంతుడు ముష్టినెత్తి "ఇదిగో దక్షిణ గ్రహించు"
అని మొత్తగ కాలనేమి నిజరూపముదాల్చి ఘోర
సమరము సాగించి హనుమ దెబ్బకు తావున చచ్చెను—
పవనసుతుడు పయనించి ద్రోణాద్రిని చేరుకొని
ఓషధులను వెతుకుచున్న కాలహరణమౌతుందని
మొత్తము పర్వతము తెచ్చి లక్ష్మణు చెంతను పెట్టెను
వైద్య విద్య భిషగ్వరుడు 'సుషేణుండు' సంజీవిని
వెదికితీసి ప్రయోగించె లక్ష్మణుడు సజీవుడాయె—
నిలు నిలు రావణ నీవిక ఎటు పోగలవని కేకిడి
లేచిన తమ్ముని రాముడు ప్రియమారగ కౌగిలించి
"సోదర! పవమానసుతుడు బ్రతికించెను నిన్నిప్పుడు"
అని సంగతి తెలియజేసి యుద్ధము నడిపించుడనెను
వానర వీరులు ఉఱుకుల ఉత్సాహముతో కదలిరి—

## కుంభకర్ణ వధ

తగిలిన గాయాలబాధ అతిశయింప రావణుండు
సింగముచే పీడితయగు ఘనమగు గజరాజుగతిని

గరుడుని బారినపడిన  పన్నగమ్ము వలె భీతిని
నిద్రించెడు కుంభకర్ణు లేపుకురమ్మనె భృత్యుల—
అతి ప్రయాసమున ఎట్లో  లేవుకువచ్చిన అతనికి
జరిగినదంతా చెప్పి  కర్తవ్యము తెలుపుమనగ
గుర్తుకువచ్చిన విషయము  కుంభకర్ణుడిట్లు చెప్పె—
"రాత్రివేళ నొకనాడు  గిరుల సంచరించుచుండ
నారదఋషి కనబడగా  విశేషముల నడిగితిని
విష్ణువు మానుషరూపము  నెత్తినాడు మిము చంపగ
అతడే రఘురాముడంచు  హెచ్చరికను చేసినాడు
కావున యీ వైరమిచట  ఆపుట శ్రేయస్కరము
సీతను ఆతనికిచ్చి  క్షమకోరుట కర్తవ్యము"—
కుంభకర్ణు ఉపదేశము  కర్ణ కటువుగానుండెను
భ్రుకుటిని చిట్లించి ముఖము  భయంకరముగామార్చి
"నీతులు చెప్పగ నిన్ను  నిద్రలేపమనలేదు
ఇష్టమైన నాకుతోడు  యుద్ధముసేయుము అంతే
ఇష్టము లేకున్నపోయి  పండుకొమ్ము మఱిపిలవను"—
అన్నకోపమును గ్రహించి  అతడు చేయునదిలేక
శీఘ్రముగా సమరభూమి  చేరగ సంసిద్ధుండై
ప్రాకారము లంఘించెను  యుద్ధభూమిలో వ్రాలెను—
మహానాద మొనరించగ  నలుదిక్కులు దద్దరిల్లె
ఇరు బాహువులను సాచి  వానరవీరులబట్టి
నోటను పడవేసుకుని  భక్షింపగ మొదలిడెను—

పర్వతకాయుని చూచి కాలాంతకుడొచ్చెనని
బికాబికలుగా వానర సేనలు పరుగెత్తుచుండె
ముద్గరమను ఆయుధమున ఎదురుపడ్డవారందఱి
పాదములను, హస్తములను పిండిపిండి చేయుచుండె—

అరిభీకరుడై చరించు అన్న కుంభకర్ణుజూసి
ఎదుటబడి కాళ్ళనుబడి వందనమ్ములాచరించి
"అగ్రజ! నే విభీషణుడ ఆగ్రహమ్ము వీడి వినుము
అన్నరావణునికి నేను ఎన్నోరీతుల జెప్పితి
"రాముడు నారాయణుడు సీతనిచ్చి వేడుకొనుము
అను నా మాటలు వినక నాపై కత్తిని దూసెను
గతిగానక పరమాత్ముని రాముని శరణము వేడితి"—

యుద్ధోన్మాదముననున్న కుంభకర్ణుడిది వినబడ
జ్ఞానుండై తమ్మునితో "విజ్ఞత వర్తించితివు
రాక్షసకుల క్షయము తుదకు రక్షించెడు వాడవీవె
నాకీ ఆవేశములో లోకమేమి కనిపించదు
నాకెదురుగ తప్పుకొమ్ము దూరముగా పాఱిపొమ్ము"
అని తమ్ముని పంపివేసి మత్తగజమువలె వానర
సేనల తఱుముచు దారుణ భీభత్సము సృష్టించెను—

ఇది చూసిన రాఘవుండు మంత్రపూర్వకముజేసి
దివ్యాస్త్రముతో నాతని దక్షిణ హస్తము ద్రుంచెను
ఆ హస్తముక్రిందబడి వేలవానరులు చచ్చిరి—

కుడిచేయిటు తెగిపడగా ఎడమచేత నవలీలగ
సాలవృక్షమును త్రుంచి రామునిపై రాసాగెను
వెంటనె ఇంద్రాస్త్రమ్మును ప్రయోగించి దానినటికె—

ఇట్లు బాహువులు తెగిపడ కాళ్ళతోడ పరుగునొచ్చి
రామునిపై లంఘించగ పాదద్వయము ఛేదించెను......

అయినా ఆ రాక్షసుండు యత్నము విరమించలేదు
నోరు బానగా తెఱచి రాముని మ్రింగగ జూచెను—

ప్రజ్వలించు శరములను ప్రయోగించి రఘురాముడు
జిహ్వను ఛేదింప కుంభ కర్ణుడు గిజగిజ లాడెను
ఇంక చంపుటనివార్యము అని రాముడు ఐంద్రాస్త్రము
గుఱిని విడువ శిరము తెగెను గూటిచిలుక ఎగిరిపోయె—

రావణుడీవార్త విని నేలకుప్పకూలిపోయె
కొంత వడికిలేచి దుఃఖ మాపుకొనగలేకుండెను—

## లంకాయాగం

ఇంద్రజిత్తు తండ్రి చూసి "నాన్నా! శోకించవలదు
రిపుల సంహరించగల్గు వాడను నే నున్నాడను"
అని "నికుంభి"లకు పోయి రక్తాంబరముల ధరించి
రక్తగంధమును పూసుకు హోమము ప్రారంభించెను—

ఈ ప్రయత్నమంత తెలిసి విభీషణుడు రామునితో
"ఈ యాగము పూర్తియైన అజేయుడౌ ఇంద్రజిత్తు
వెంటనె లక్ష్మణునిచేత వానిని వధియింపజేయ
ఆజ్ఞయిండు రఘుదేవా! అత్యవసర కార్యమ్మిది"—

"మేఘనాథు డసాధ్యుడు [21]నేరుగ నేనే పోయెద
ఆగ్నేయాస్త్రమ్ముచేత ఆతని వధియించివత్తు" —
"రామా ! ఆ దుర్మార్గుని మృతికి బ్రహ్మవరమున్నది
పన్నెండేండ్లుగ నిద్రా హార వివర్జితుడౌకడే
అతని చంపగలడు గాన లక్ష్మణునే పంపవలయు"—
"సరే లక్ష్మణా ! వెళ్ళుము హనుమదాదులను గూడి
విభీషణుని అనుసరించి ఇంద్రజిత్తు సంహరించు" —
సౌమిత్రియు సంబరమున సోదరు పాదమ్ములబడి
"సమరము సాగింప నాకు సమవుజ్జీ దొరికె నేడు
అన్నా ! దీవించి పంపు విజయుడనై తిరిగివత్తు"
అని ఆశీస్సుల పొంది 'నికుంభి'లకు పరుగెత్తెను—

## ఇంద్రజిత్తు వధ

హోమనిష్ఠనున్న మేఘ నాథుని చుట్టూ రక్షగ
రాక్షససేనలు జట్టుగ దుర్భేద్యముగా నిలిచిరి —
ఇది చూసిన విభీషణుడు హెచ్చరించె సౌమిత్రిని
"స్వామీ ! ముందుగ మీరా సేనల బరిమార్చవలెను
హోమము సంపూర్తి జేయ కుండ నతని వధించాలి" —
సౌమిత్రుని బాణములకు సైన్యమంత చెదరిపోయె
రావణుసుతు హింసించగ బాణపరంపర వదలెను
రాళ్ళతోడ వానరులు రాక్షసులను హతముజేయ

పరశువులు, బాణములు, కత్రులు, ఖడ్గముల తోడ
ఎదురు తిరిగి రాక్షసులు వానరుల వధించుచుండె—

ఇరుపక్షపు గర్జనలకు భూ నభములు దద్దరిల్లె
ఇంద్రజిత్తు కనులు దెఱచి తనసేనల వెతల జూసి
హోమమ్మును వదలిపెట్టి ధనుర్ధారియై వచ్చెను—
"లక్ష్మణ నిలువుము నాదగు క్షాత్రమ్మును తెలిసికొనుము"
అనుచు సప్తబాణమ్ముల విడువగ సౌమిత్రియును
రౌద్రము రెచ్చగ దారుణ శరవర్షము కురిపించెను
మేఘనాథు దృఢకవచం తిలలరీతి రాలిపోయె
ఇంద్రజిత్తు సరకుగొనక వరసాధిత శరము వేయ
లక్ష్మణ కవచముకూడా ముక్కముక్కలై పోయెను—
అయినా ఇద్దఱు విడువక తుముల యుద్ధ మొనరించిరి
రక్తము దేహములనుండి ఏఱులుగా పాఱుచుండె —

మూడు రోజు లీరీతిగ ఘోర రణము సాగి పోవ
లక్ష్మణు డైదు శరమ్ముల లక్ష్యముగా సారథిని,
అశ్వములను, రథమ్మును, ధనుస్సును పిండిజేసె —
వెంటనె మఱియొక చాపము చేతగొనిన ఇంద్రజిత్తు
మండుచున్న శరముల ప్ర చండముగా ప్రయోగించె
అదియెకాక బాణవర్ష మున నలుదిక్కులు కూడా
అంధకార మయము జేసి దిగ్బంధము గావించెను —
ఇంద్రజిత్తు విజృంభణ సంకటమై లక్ష్మణుండు
ఐంద్రాస్త్రము తీసి ఇట్లు ధ్యానించెను మదిలోపల

"ధర్మచిత్తుడగు రాముడు సత్యసంధుడగునేని
త్రిలోకముల ప్రతివీరుడు నిజముగ లేకుండె నేని
ఈ బాణము ఇంద్రజిత్తు ప్రాణములను తీయుగాక"
అని వదలగ ఇంద్రజిత్తు తలతెగి నేలను పడెను
జయజయ ధ్వానముల మధ్య లక్ష్మణు డన్నను చేరెను —
"అన్నా ! నీ అనుగ్రహమె అతని నేలబడవైచెను"
అని వినయముతో రాముని పాదములకు వందనమిడె —
"లక్ష్మణ ! యీపని నిజముగ దుష్కర మయినది ఎఱుగుదు
మేఘనాథు మరణమనగ రావణ మరణమె తమ్ముడ !
ఈ కార్యము రావణుని పుత్రశోకమున ముంచును
ఇట్లాతని మృతికి రాచ బాటవేసినావు నీవు"
అని ఆలింగన మొనర్చి ప్రేమతోడ ముద్దిడుకొనె —
పుత్రుని మరణము చెవిబడ రావణు మది చెదరిపోయె
మొదలు తెగిన వృక్షమువలె నేలగూలె /జాలిగొలుప
ఇంద్రజిత్తు ఘనకార్యము లన్నియు తలుచుకు ఏడ్చుచు
తన పుత్రుని చంపి తనదు శక్తిని బలహీనపఱచి
నట్టే ప్రతి ఎత్తుగతని ఆలిని హతమార్చ బూని
సీతను చంపెద ముందని కత్తిదీసి బయలుదేఱె
క్రోధము మూర్తీభవించి ఖడ్గముతో వచ్చువాని
చూసిన కోమలి సీత చేష్టలుడిగి కొయ్య బారె —

## సుపార్శ్వుని సలహా

సరగున రావణ మంత్రి 'సుపార్శ్వుండు' పరుగునొచ్చి
"దశగ్రీవా ! ఆగు ఆగు వైశ్రవణుని సోదరుడవు

బ్రహ్మ వంశ పుత్రుడవు పులస్త్యముని మనుమడవు
సకల శాస్త్రకోవిదుడవు శూరుడవు వీరుడవు
ఇంతటాభి జాత్యమును గంగను కలిపెదవ ఏమి ?
అబలను చంపుట అనునది అసమర్థుని హీనచర్య
అయినా యీ యత్నము ఆ సీత పొందు కొఱకేగా !
ఆమే లేనున్నప్పుడు యీ యుద్ధము దేనికట !
దేవతోడ శ్రీరాముని చంపి ఆమె ప్రేమ పొందు"
అని బోధింపగ ఉద్ధతి రావణుడామోదించి
వెనుకకు మరలెను రాముని లక్ష్మణునీ సంహరింప—

పాతాళ హోమం

అతని యుద్ధయాత్ర జూడ శలభము శలభములగొని
అగ్నిని నిర్జించుటకై బయలు దేఱినట్లున్నది
వచ్చిన రాక్షస సేనలు రాముని శర పరంపరకు
నిహతులైరి గతిగానక వెనుదిరిగిన రావణుండు
రాక్షస గురువగు శుక్రుని చెంత జేరి ప్రార్థించెను—
రామాదుల వీరత్వము రాక్షసకుల నాశనము
అతని కెఱుక జేసి తెరువు తెలుపుడంచు వేడుకొనెను —
"రావణ ! రహస్య స్థలము చేరిహోమ మాచరించు
నిర్విఘ్నముగా సమాప్తి జరిపించన యెడల అందు
అరదము, అశ్వములు, చాప, తూణీరము, సాయకములు
పుట్టి సాయపడును నీకు త్రిలోకముల తిరుగుండదు" —
అని మంత్రము చెప్పి పంప రావణుడంతఃపురమున
నేలను పాతాళ గృహము నిర్మించెను హోమమునకు

పట్టణద్వారములన్నీ గట్టిగ మూయించె శిలల
పూజాద్రవ్యములతోడ పాతాళము ప్రవేశించి
మౌనవ్రతము పాటించుచు హోమము ప్రారంభించెను —

కంత నుండి కొంత హోమ ధూమము బయటకు రాగా
విభీషణుడు విలోకించి రామున కది చూపించి
"రామా! దశగ్రీవుని పా తాళ హోమధూమమది
ఆ హోమము సఫలమైన అతనికి అపజయములేదు
వానరవీరుల దానిని విఘ్నము సేయగ పంపుడు"—

అని చెప్పిన దానికి శ్రీ రాముడు సమ్మతి తెలిపి
హనుమంతాదుల గూడి అంగద నీ వెళ్ళుమనగ
వేలాదిగ వానరులు వెంటరాగ 22 బయలెల్లిరి—

## హోమ విఘ్నము

ప్రాకారము లంఘించి రావణ మందిరము చూసి
దానిని రక్షించు కఱకు రాక్షసులందఱ జంపిరి
విభీషణుని పత్ని 'సరమ' వ్రేలిసైగతో వారికి
రావణ హోమస్థానము నకు దారిని చూపినది—

గుహాకడ్డుగ పెట్టబడిన బండరాయి నంగదుడు
పాదఘట్టనల బ్రద్దలు కొట్టి లోన ప్రవేశించె—
కనులు మూసుకొని జపించు రావణు చూసిన యాతడు
హనుమదాదులందఱినీ ఆజ్ఞాపించెను రమ్మని
వచ్చిరి రావణ భృత్యుల ముష్టిఘాతముల మొత్తిరి

హోమ ద్రవ్యముల గత్తర చేసి గుండమున వేసిరి
కోలాహలముగ పెద్దగ గందరగోళము చేసిరి
గోళ్ళతోడ పళ్ళతోడ గిచ్చి శరీరము చీల్చిరి
వాతాత్మజుడా రావణు చేతనున్న 'స్రువము'లాగి
దానితోడ రావణునే దారుణముగ మోదుచుండ
కూడ నతడు చలించక వీడడాయె మౌనవ్రతము
అంగదుండు మండోదరి నతని ఎదుటకీడ్చుకొచ్చి
ఒంటినున్న చీరచింపి రత్నహారములు త్రెంచగ
కటిసూత్రము తెగిపడెను నీవి బంధముజారెను
అయినా చలనములేదు అతడు దీక్ష వీడలేదు—

## మండోదరి విలాపం

“నాథా ! నీ కనులముందె ననుపరాభవించుచుండ
చేతులు ముడుచుకు కూర్చొను నీ వీరత్వము దేనికి ?
హా పుత్రా ! మేఘనాథ ! నీవే బ్రతికుండినచో
నాకీస్థితి కలుగనిద్దు వా బిడ్డా !” అని ఏడ్చెను—
వానరుని అకృత్యము, మండోదరి విలాపము
దశకంఠుని కలచివేసి లేచెను, ఖడ్గము తీసెను
ఓరి దుర్మార్గులార ! దేవేరిని వదలుడంచు
ఆగ్రహమున లేచి వారి నందఱ గ్రసియించబోవ
కావలసిన కార్యమంత చేసితిమిక చాలునంచు
ఎల్ల వానరులు మెల్లగ ఏగిరమున [23]ఎల్పొచ్చిరి—

"దేవీ ! చింతింపవలదు యిప్పుడె వారి వధించెద
కాక యుద్ధమందు నేనె మరణించుట జరిగినచో
సీతను వధియించి నన్ను కలిసి చితిని ప్రవేశించు"—

## మండోదరి మందలింపు

"నాథా ! ఇప్పటికి కూడ పాడుబుద్ధి వీడవైతి
శ్రీరాముని జయించుట ! సాధ్యము కాదెవ్వరికీ
సాక్షాత్ నారాయణుడే రాముండని తెలియవేమి ?
పూర్వకాలమందు మత్స్య రూపమెత్తి మనువుగాచె —
క్షీరమథన కాలమందు కూర్మ రూపమును ధరించి
మంథర పర్వతము నెత్తి మూపున నిలబెట్టినాడు —
వరాహముగ రూపమెత్తి హిరణ్యాక్షు సంహరించి
జలముల మునిగిన భూమిని వెలికితీసి తెచ్చినాడు —
లోక కంటకుడు హిరణ్య కశిపు సంహరించగోరి
నరసింహుని రూపమెత్తి శిరముదరము చీల్చిచంపె —
వామన రూపము నెత్తి నామ మాత్రమగు నేలను
కోరి బలిని పాదముతో పాతాళమునకు త్రొక్కెను —
రాక్షస క్రూరు లనేకులు క్షత్రియ జన్మముల నెత్తి
భూభారము పెంచుచుండ పరశురామునిగ పుట్టి
వారందఱ వధియించి వీర విహారము చేసెను —
పరమాత్ముడు అతడు నేడు శ్రీరామునిగా పుట్టెను
మీ పీడల తొలగించగ మనుజ రూపమెత్తినాడు

అతని భార్య నపహరించి  అందఱి పోగొట్టితివి
పుత్ర శోకమది చాలు  వైధవ్యము కూడ లేకు
వైదేహిని రామునికి  అర్పించుము, విభీషణుని
లంకకు రాజుగ జేసి  వనమున కేగుదము మనము" —

"మండోదరి ! నీ మాటలు  మన్నించగ వలసినవే
కానీ నా సోదరులను  కుమారులను బాంధవులను
రామాస్త్రము కెఱజేసి  వనమున కెటురాగలను ?
పోనీ నే చనిపోయిన  చింతయేల కాంతవిను
అతనిచేత చచ్చిన  నా కమరత్వము సిద్ధించును
వగవవలదు నాకొఱకు" సమరము అని సేయనరిగె—

## రామ రావణ యుద్ధం

అస్త్ర శస్త్రములనన్ని  అరదముపై అమర్చుకుని
రాక్షస ముఖముల ఖరములు  రథమును లాగుచునుండగ
రణకర్కశుడై వచ్చెడి  రావణుభీకరముగాంచి
వానరసైన్యము గజగజ  వణకసాగె భీతిజెంది
ఇది చూసిన హనుమంతుడు  ధైర్యము కలిగించసేన
వీక్షించగ లాగిపెట్టి  వక్షమ్మున విసరికొట్ట
దెబ్బకు మూర్ఛావశుడై  దైత్యుడు వివశుండాయెను—

నలుడూ, నీలుడు, మారుతి, అంగద, వానరవీరులు
అగ్నివర్ణ, సర్పరోమ, ఖడ్గరోమ, వృశ్చికాది
దైత్యనాయకుల వధించి  శృంగనాదములు చేయగ

మేల్కాంచిన రావణుండు మత్తగజమువలె లేచి
రామునిదెస రథము నడిపె రెట్టించిన రోషముతో —

దశకంఠుడు రథమునుండె నేలను నిలబడె రాముడు
ఇది చూసిన దేవేంద్రుడు రథసారథి 'మాతలి'ని
దివ్యరథము, ధనుస్సును, కవచము, ఖడ్గము, అక్షయ
తూణీరమ్ముల బంపెను రాముని కట బాసటగా
రాముడు ఆ రథము నెక్కె పోరాటము మొదలాయెను —

## రావణ సంహారం

రావణు డాగ్నేయాస్త్రము రామునిపై ప్రయోగింప
ఆ యస్త్రమునే ప్రతిగా ప్రయోగించె రాఘవుండు —

అట్లే దైవాస్త్రమ్మును త్రిప్పికొట్ట దైత్యరాజు
'రాక్షస' మను ఘోరాస్త్రము రామునిపై వదలినాడు
తోడనె బంగరు ఱెక్కల బాణము బిద్భవ మంది
దుష్ట సర్పములుగ మాఱి చుట్టుముట్టగా రాముడు
శీఘ్రమె మంత్రము పఠించి 'సౌపర్ణాస్త్రము' వదలెను
దాని నుండి గరుడు లొచ్చి పాముల నన్నిటి భుజించె —

రావణుడపుడొక బాణము మాతలిపై నెక్కుపెట్ట
ఉగ్రుడైన శ్రీరాముడు విగ్రహించి భగ్నపరచి
ప్రళయకాల రౌద్రముతో కాలాంతకు నిగమాఱి
అతని శిరము ఛేదించగ ఐంద్రాస్త్రము ప్రయోగించె —

నేలరాలె శిరములన్ని తాటి పండ్లు రాలినట్లు
కాని అవి తిరిగి అతని మొండెముపై మొలచుచుండె —
ఎన్నిసార్లు ఛేదించిన ఇట్లే జరుగుచునుండగ
"ఏమి యీ విచిత్రమ్ము" ! అనగ విభీషణుడు చెప్పె
"బ్రహ్మనుండి రావణుండు పొందినదీ వరము రామ !
అతని నాభి ప్రదేశమున అమృత భాండమ్మున్నది
ఆగ్నేయాస్త్రమ్ము వేసి దాని పగుల గొట్టవలెను" —
వినుచే తడవుగ రాముడు 'పావకా'స్త్రమును వదలెను
రావణు నాభిని గలట్టి అమృతమ్ము క్షయమాయెను —
కుపితుండై దశకంఠుడు విభీషణుని కడతేర్చగ
శక్తి శరము సంధించెను సోదరు శిరమును ద్రుంచగ
సీతాపతి ఆ శరమును చిటికలోనె ఖండించి
వివిధ బాణ గుచ్ఛమ్మును ఆతనిపై గుప్పించగ
రావణ శిరములు తొమ్మిది నేలరాలి మొలవ లేదు
పదియవ శిరమును ద్రుంచగ రాముడు యోచించుచుండ
"శిరచ్ఛేదనమున దాని వేఱుచేయ వీలుపడదు
బ్రహ్మాస్త్రము విడిచి హృదయ స్థానము సూటిగ కొట్టుడు"
అని 'మాతలి' తెలుప దేవ తావాహన గావించి
ఆకర్ణాంతము ధనువును లాగి బాణమును విడిచెను
భూనభములు దద్దరిల్లె బ్రహ్మాండము బ్రద్దలయ్యె
రావణుండు నేల కొఱిగె "రామారామా !" యంటూ
రావణదేహమ్మునుండి దివ్యతేజ మొకటిలేచి
దేవతలందఱు చూడగ రామునిలో ప్రవేశించె —

"క్రూరునకా మోక్షప్రాప్తి! దారుణమని అనబోకుడు
రేబవళ్ళ వైరముతో "రామా!" అని అఱచె నోరు
క్రోధముతో అతని కనులు రామునిపై దృష్టినిలిపె
కసితోడను నిశికూడా మనసున రాముని ధ్యాసే
కలలకూడ పగ రగలగ "రామా!" అను పలవరింతె
శత్రుత్వముతో నిత్యము రామ కథలె వినెను చెవులు
అది యిది యననేల యెప్పుడు నాలుక రాముని పలుకే
ఇదియె దీనిరహస్యము రామనామ మహాత్మ్యము
పైగారాముని చేతను మరణము సంప్రాప్తమయ్యె
అంత్యమందు రామ రామ యనుచు ప్రాణముల వదలెను
తత్కారణముల నాతడు కైవల్యము పొందగలిగె"
అని దేవతలందఱకూ నారదుడిచ్చెను జవాబు—

## రావణ ప్రేత సంస్కారం

రావణునీ మరణవార్త రాణులందఱకు తెలిసెను
విలపించుచు పరుగునొచ్చి భర్తశవము చుట్టుజేరి
గుణగణముల కీర్తించుచు ఘొల్లున ఏడ్వగసాగిరి—
రక్తము పంచుకు పుట్టిన సోదరుడగుటంజేసి
విభీషణుని మనసుకూడ వికలముకాగా చూసి
భూజానాతని స్పృశించి జ్ఞానబోధ గావించెను—

## విభీషణునికి జ్ఞానబోధ

"మిత్రమ నీవెవరికొఱకు దుఃఖించుచునున్నావు?
విగతజీవి కొఱకైతే వ్యర్థము నీ చింతంతా

ఎవరీ రావణుడు ? నీకు ఏమగునని శోకింతువు ?
దేహరీత్యా యిరువురునూ ఎవరికివారే మీరు
ఆత్మలు చూడంగ అసలు సంబంధమే లేదుగదా !
పేరు కన్నదమ్ములంతె పిలుపు స్వల్పకాలమింతె
పుట్టుక ముందూలేదు గిట్టిన తరువాతలేదు
నడుమనొచ్చినట్టిది యీ నశమంత్రపు అనుబంధం —
ప్రవాహమున బడి ఇసుక పయనించును కొంతమేర
ఎక్కడో ఓ చోట మేట వేయు కొంత భాగమందు
మిగిలినది ముందుకెళ్ళి మఱో చోట మేటవేయు
అంతే యీ జీవితమున కలియుట విడిపోవుటలు —
"జాతస్యహి ధ్రువో మృత్యుః, ధ్రువం జన్మ మృతస్యచ"
పుట్టిన ప్రతిప్రాణికూడ గిట్టకతప్పదు ధరపై
రావణుడే కాదు మనము అందఱు పోయెడివారమె
మరణము పిలిచిన మఱుక్షణ మెవ్వరు నిటనుండలేరు
ముందు వెనుకలంతే ఆ మహేశ్వరుని ఇచ్ఛబట్టి —
బాలు డిసుకతో నేలను గూళ్ళుకట్టి పడద్రోయును
దేవుడు కూడా అట్లే జీవులతో ఆడుకొనును —
చూచునదొక బూటకము జగత్కర్త నాటకము
మాయా మోహావేశము ముంచివేసినది నిన్నె
బయటికొచ్చి యోచించుము ఈకపటము బోధపడును —
బీజమునుండే బీజము ఉత్పన్నమ్మగుచుండును
అట్లే దేహమునుండే దేహముద్భవించుచుండు

జీవుడు ఆ దేహమ్ములఁ బ్రవేశించి పోతుండును
అందుకె యీ నానాత్వము జన్మక్షయము దేహానికె—
మమకారము చిత్తభ్రాంతి మరణము పెనువిభ్రాంతి
భ్రాతా, పుత్రా, మాతా, దారా, పిత, బంధుజనులు
దేహము అంతా మిథ్య క్షణభంగుర సంగమము
వానికేల దుఃఖింతువు దేవుని నిర్దేశము అది
వర్తమాన విజ్ఞుడవై కర్తవ్యము నెఱవేర్చుము
సోదర మృతదేహమునకు శ్రాద్ధకర్మ లొనరించుము" —
ఇదివిని ఉపశమనమంద మదినొక సందియమొదవెను
"ఛీ ఛీ దుర్మార్గునికా ! సంస్కారము జరుపుటయా ?" —
"విభీషణా ! గుణములన్ని మరణమున సమాధియగును
దోషము గుణముదెగాన వ్యక్తిని ద్వేషించరాదు"—

## రావణుని గతజన్మ

అయినా రావణుడెవరు ? ఈతని గతచరితము విను
కృతయుగమున యీ దనుజుడు సనత్కుమారుని అడిగెను
"యజ్ఞములెందుకు చేయుదు రేల తపములను సేతురు ?" —
"సర్వేశ్వరు కృపకొఱకై సలుపుచుందురవి పుత్రా !"—
"దేవతాది ఘనులచేత నిహతులు పొందెడిదేమిటి ?"—
"ఇంద్రదేవతాదులచే వధియింపగ బడినవారు
స్వర్గలోకమును చేరి భోగాదుల పొందగలరు
భోగక్షయముకాగా యీ జగమున పుడుదురు మళ్ళీ

నారాయణుచేత నిహతు లైనవారు శాశ్వతముగ
హరిపదమును పొందగలరు అల వైకుంఠపురమ్మున'' —
అనగా విని రావణుండు నిశ్చయించుకొనె నాడే
తానతనిని విరోధించి తరించాలి అని మదిలో
మనతో యీ యుద్ధము ముదమార కోరుకున్నాడు
మాఱాలోచించకగ్ని సంస్కారము గావింపుము
రాముని మాటలకు మనసు వికసించిన విభీషణుడు
మండోదరి నోదార్చి రాణుల నగరికి పంపి
కాష్ఠముపై రావణుని కళేబరము నుంచి శిరము
అగ్నిని ముట్టించి స్నాన మాచరించి తడిబట్టల
దర్భమిశ్రి తమ్ములైన తిలోదకములను వదలెను —
తక్షణమే తమ్మునికి రాముడు ఆజ్ఞాపించెను
''లక్ష్మణ ! మీరందరేగి పురపౌరుల సమక్షమున
విభీషణుని రారాజుగ అభిషేకించుడు లంకకు''—
బంగరు కలశములతోడ సాంద్రజలములను దెచ్చిరి
రాముడు చెప్పినయట్టుల రాజును చేసిరి లంకకు —

## సీత అగ్నిప్రవేశం

అపుడు రామభద్రుండు ఆ ప్పుడు హనుమంతు బిలిచి
విభీషణుని అనుమతితో సీతకు అంతా తెలిపి
జానకి అట ఏమన్నది వచ్చి చెప్పు నాకనియెను
25ఔఔ అని హనుమంతుడు మరల నామె దర్శించి
వినమ్రుడై శ్రీరాముని విజయవార్త వినిపించెను —

జానకి ఆనందించి మారుతి నభినందించి
పతిదేవుని చూడగోరు చున్నానని తెలుపుమనెను —

కూరిమి రామ ప్రభువుల కమ్మవారి కోర్కె దెలుప
హనుమంతుని, విభీషణుని ఆమెను తోడ్కొని రమ్మనె —

మంగళ స్నానాదులతో మందయాన నర్చించిరి
శిబికము దిగివచ్చి సీత రామపాదముల బడెను
పావని ! నీ విశుద్ధతను ప్రజకు విశద పఱచుమనగ
జానకి లక్ష్మణుని గాంచి "మఱదీ ! నా చితి పేర్చుడు
అగ్ని ప్రవేశమ్ముచేసి అవనికి ఋజువిచ్చెద"ననె
అన్న ఆనతిని తమ్ముడు చిటికలోన చితి పేర్చెను —

పతిదేవుని పాదమ్ములె ప్రాతః స్మరణీయమైన
అనవరతము నామనమ్ము రామనామమే పలికిన
నిశ్చయముగ నిష్కళంక పతివ్రతనే నేనైతే
పావనుడా అనలదేవు డే నను కాపాడు ననుచు
ఛాయసీత అగ్నిదూక అసలు సీత బయటికొచ్చె
"జై సీతా జైమాతా" అనుచు జనులు జైకొట్టిరి

"మాయాతీతం మాధవ మాద్యం జగదాదిం
మానాతీతం మోహవినాశం మునివంద్యం
యోగి ధ్యేయం యోగనిధానం పరిపూర్ణం
వందే రామం రంజిత లోకం రమణీయం"

అనుచు నుతుల నొనరించుచు అణకువతో ప్రాంజలులై
దిక్పాలురు దేవతలు దిగిరాగా రామప్రభువు
మఘవంతా ! అమృతమున మృతులను బ్రతికించుమనెను —

అట్లుచేయ రామసేన ఆవులించి నిదురలేచె
విభీషణుడు రామునపుడు నగరికి ఆహ్వానించెను —
"గడువు పూర్తికాకముందు అడుగిడుటది అధర్మము
సుగ్రీవాదుల మిత్రుల స్నేహితులను గౌరవించు"
అనగ సంతసమున వారి సమ్మానించెను నగరిని —

## అయోధ్యకు తిరుగు ప్రయాణం

విభీషణుడు ప్రేమతోడ వియత్‌గమన విశిష్టంబు
పుష్పకమను విమానమును ప్రభువుకు కానుకగ నిచ్చెను
వైశ్రవణుడు బ్రహ్మనుండి వరముగ పొందెను దీనిని
రావణు డాతని నుండి దౌర్జన్యముగా తెచ్చెను
శ్రీరాముడు అధిష్ఠించె సీతాలక్ష్మణుల గూడి —
అయోధ్యకు బయలుదేఱ అందఱి సంబోధించి
"మీరందఱు శ్రమజేసి నా కార్యము నెఱవేర్చిరి
అభినందన లందఱకూ హాయిగ నుండుడు నెలవుల"
అని వందన మాచరించి అరుగుటకై శలవనగా
"రామా! అందఱికోరిక రావాలని కోసలకు"
అందఱొక్క మాఱనగా సరే యనెను శ్రీరాముడు
అందఱూ విమానమెక్క ఆకసమున కది ఎగసెను —
శ్రీరాముడు సీతకు గత గాథల నన్నియు చెప్పుచు
తిరిగినచోటులు జరిగిన సంఘటనల తెలుపుచుండె
"అదిగో త్రికూట పర్వతమ్మదియే రణభూమి
రావణాది వీరులంత నిహతులైన దీచోటే
అదియే రామేశ్వరము శివప్రతిష్ఠ చేసితి నిట —

అదిగో కిష్కింధ" అనగ అవనిజాత అడిగె పతిని
సుగ్రీవుని కాంతలను చూడగోరుచున్నానని —
'రుమ', 'తార'ల సుగ్రీవుడు రప్పించగ వారి కూడ
విమానమున ఎక్కించుకు పయనము ప్రారంభించిరి
ఋష్యమూక పర్వతమది పంచవటి, పర్ణశాల
చిత్రకూట మిటుచూడు భరతుని కలిసినచోటు —

## భారద్వాజాశ్రమ సందర్శన

క్రిందికి దింపుడు ఒకపరి భారద్వాజాశ్రమ మిదె
అని రాముడు పలుక విమా నమ్ము దిగెను ఆశ్రమమున
వినయముతో మహర్షికి వందన మిడి అడిగెనతని
"స్వామీ! అయోధ్యవార్త లేమైనా తెలిసినవా ?
భరతుడు, శత్రుఘ్నుండును క్షేమముగా నున్నారా ?
అమ్మలకు, అయోధ్యజనుల కంచటికి కుశలమె కద ?" —
"రామా! భరతుడు ఇంటనె తాపసిగా బ్రతుకుచుండె
నీ పాదుకలకు పట్టం కట్టి పాలనను నడుపుచు
నీ రాకను కాంక్షించుచు నందిగ్రామ" మున నుండెను —
దివ్యదృష్టితో నీదగు విజయమ్ముల వీక్షించితి
ఆదిని జల సృష్టిజేసి అందు యోగ నిద్రమునిగి
నాభి కమల మందు బ్రహ్మ దేవుని పుట్టించితివి
జడ సృష్టిని చైతన్యము జగతిని కలిగించితివి —
అయస్కాంత మినుముజేరి ఆకర్షించిన యట్టుల
సమాజమున ప్రతివారికి సదాచారముసు దెలుపగ

ఆదర్శపు మానవునిగ అవతరించి నావంతే
అమల చరితుడవు నీవు అసాధ్యమ్మ నీకేమిటి ?
దుష్ట శిక్షణను చేసి శిష్టుల రక్షింతుననెడి
ప్రతినను నెఱవేర్చు కొనగ పుట్టిన పరమాత్ముడీవు
పతిత పావనా రామా ! మాప్రార్థన మన్నించి
నేడు మాదు ఆతిథ్యం స్వీకరించ వేడు చుంటి"
అను మాటకు ఆ పూటకు ఆగిపోవ సమ్మతించి
అంజన పుత్రుని బిలిచి ఆజ్ఞాపించెను రాముడు
"శృంగిబేర పురమేగి గుహునికి నారాక తెలిపి
నందిగ్రామమును చేరి భరతునికీ వార్త చెప్పు" —
హనుమంతుడు మానవునిగ రూపుదాల్చి బయలుదేఱె
గుహుని కలిసి రామప్రభువు వచ్చుచుండె నని చెప్పి
నంది గ్రామమును చేరెను అటకయోధ్య ఒక క్రోశడు —

## భరతుని స్వాగతం

నార చీరలను గట్టి కృష్ణాజినమును ధరించి
జటావల్కములు దాల్చి కందమూలముల భుజించి
మలిన దేహమున కృశించి దీనవదనుడై యుండిన
భరతుని ముందర నిలిచి సోదరు కుశలము తెలిపి
జరిగిన గాథలు చెప్పి రాముని రాకెఱిగించెను
పట్టరాని ఆనందము భరతుని ముఖమున నిండెను —
ప్రియమగు వార్తను తెచ్చిన పావనుడని ప్రస్తుతించి
పురమంతా చాటించెను రాముని ఆగమనవార్త
ఎల్ల జనులు వెంబడింప ఎదురేగెను అన్నకతడు —

విమానమ్ము దిగి రాముడు వినయమ్మున తల్లులకూ
స్వామి వశిష్ఠుల వారికి సాష్టాంగ ప్రణామమిడెను
భరతుడు, శత్రుఘ్నుండును అన్నపాదములపై బడ
ప్రేమను తమ్ముల మూపుల నిమిరి కౌగిలించుకొనెను —
తనతో వచ్చిన వారల ప్రతివారిని ఎఱుక బఱచి
వారికి తన వారి గూడ పరిచయమ్ము గావించెను —
అన్నా ! నా తల్లి దుష్కృతము చేతను తప్పక నే
నీ తరపున పాలించితి భృత్యుడుగా కింకరుడుగ
నీ రాజ్యము నేటి నుండి నీవు స్వీకరించు" మని
సింహాసనమున బెట్టి సేవించెడి పాదుకలను
రాముని కాళ్ళకు తొడిగి భరతుడు ప్రార్థన జేసెను
కైకేయియు. వశిష్ఠుండు ఆదేశించిరి అట్లే
అందఱి ఆనతి అనుమతి ఆదరించి రాఘవుండు
అంగీకారము తెలిపెను అఖిలము ఆనందించెను —

## శ్రీరామ పట్టాభిషేకం

భరతునితో జలకమాడి జడలను విడిచెను రాముడు
కుబేరునకు పుష్పకమును కూరిమితో పంపివేసె
రథముల నందఱు కూర్చొని రాజధాని చేరుకొనిరి —
రాచబాటలన్ని మంచి ముత్యాలను మెఱసిపోయె
సీతారాముల శిరముల ప్రజలు పూలు విరజిమ్మిరి —
హనుమంతుడు, అంగదుడు జాంబవంత సుషేణులు
చతుస్సముద్ర జలములను శరవేగమ్మున దెచ్చిరి

వశిష్ఠుండు, వామదేవ, వాల్మీకి, గౌతమముని
మంత్రమ్ముల, కుశాగ్రముల, తులసీ గంధాదులచే
రాముని పట్టాభిషిక్తు గావించిరి ప్రజమెచ్చిరి
కిన్నర కింపురుషాదులు శ్రీరాముని కీర్తించిరి
పుష్పవృష్టి కురిసెనపుడు దేవదుందుభులు మ్రోగెను —
గోదానము, భూదానము, వివిధ వస్త్ర ఫలదానము
విరివిగ చేసెను రాముడు విప్రవరుల కెల్లరకహా —
రాముడు సుగ్రీవు మెడను రత్నహారమును వేసెను
భుజకీర్తులు అంగదునకు బహూకరణ మొనరించెను
మెడగల మణిరత్నహార మును రాముని అనుమతితో
మారుతి కిచ్చెను సీత అతని సేవలకు గుర్తుగ —
రాముడతని మెచ్చి వరము కోరుకొనుము హనుమా! యన
నిత్యము నా నాలుకపై నీ నామమ్ముండునట్లు
నీ పవిత్ర చరిత్రమ్ము ఈ భువినున్నంతవఱకు
నీ స్మరణను నాదేహం నిలుపుము యీ జగతి ననెను —
"భళి భక్తా! హనుమంతా! చిరంజీవ చిరంజీవ
కల్పాంతము వఱకు బ్రతుకు వేల్పుగ పూజలనందుము" —
వరముల బడసిన మారుతి రామాజ్ఞను పొంది తపము
చేసికొనగ హిమవంతము చేరెను సంతుష్టుండై —
గుహుని బిలిచి శ్రీరాముడు "మిత్రమ ధర్మజ్ఞుడవై
శృంగిబేర పురము కేగి సుపరిపాలనము జేయుము
అంత మందు నాదు దివ్య సాయుజ్యము నందగలవు"
అని అతనికి తన దీవన లందజేసి సాగనంపె —

విభీషణ, జాంబవంత, రుమ తారలు వానరులు
రామునిచే పూజితులై తమతమ నెలవులు చేరిరి —

అనుజులు ముువ్వురు భక్తిని అన్నను సేవించుచుండ
వత్సల భావమున ప్రజల రాముడు పాలించుచుండె —

శ్రీరాముని పాలనలో ఛిద్రమ్ముల 26 ఊసులేదు
అర్ధాంతర చావులకు అవకాశము అసలులేదు
రోగభయము, సర్పభయము, చోరభయము బహుదూరము
సకాలమున వర్షమ్ములు సమృద్ధిగ పాడిపంట
ఆనందమె ఎటుచూసిన అందఱిముఖముల మోదమె
నాలుగు పాదముల ధర్మ దేవత నడయాడుచుండె —

ఆధ్యాత్మ గేయ రామాయణం

యుద్ధకాండ సమాప్తం



# ఉత్తరకాండ

## సీతా పరిత్యాగం

శ్రీరాముండొక దినమున శయ్యను విశ్రాంతి నుండ
పతి పాదమ్ముల నొత్తుచు పడతి సీత పలికె నిటుల
"నాథా! దేవతలు వచ్చి దీనముగా అర్థించిరి
చిరకాలము యిట నుండుట వైకుంఠము శూన్యమయ్యె
ఇకనైనా దయచేసి మమ్ముల ధన్యుల జేయుడు
అని వేడిరి పరాత్పరా! తమ దృష్టికి తెచ్చుచుంటి" —

"అవును భూమి నవతరించి కాలాతీతమ్మయినది
వేగమె పోవలయు దాని కుపాయమును చెప్పెద విను
లోక ప్రవాదము మిషగా నటన పరిష్కార మిపుడు"
అని జానకి పతి పలికి సభా భవనమును జేరెను —

సింహాసన మధిష్ఠించి గూఢ చారులను బిలిచి
జన నిందలు ఏమున్నా జంకక తెలుపుడు నాకన
"దేవా మీపరిపాలన ధర్మ దేవతే మెచ్చెను
ఎటువిన్నా ప్రశంశలే నిందనునది లేదుగాని
లేకిమాట సరకు జేయ వలదెవ్వరు పలికిననూ
రావణ అపహృత సీతను తెచ్చుకొనుట తప్పేమిటి?"
అని 'విజయుడు' గూఢచారి అతివినయముగా పలికెను —

అది విని సభ చాలించి రాముడు లక్ష్మణుని పిలిచి
"తమ్ముడ! లోకాపవాద మును నీవే వింటివికద!

వనముల రేపె సీతను వదలిపెట్టిరమ్ము" అనెను
అన్నా ! యిది ఏమి ఘోర మన, ఇది నా అజ్ఞ, బదులు
పలికిన నాపై ఒట్టు నను వధించి తిన్నట్టునె —
మాఱాడక మలి ప్రొద్దున వదినను రథమున నిడుకొని
వాల్మీకాశ్రమ ప్రాంతపు వనభూముల విడిచిపెట్టి
"వదినా లోకాపవాద మునకు జడిసి అన్నగారు
అడవుల నిను వదలిరమ్మ టంచు నాకు ఆనతిచ్చె"
అని దుఃఖించుచు లక్ష్మణు డామె 27నొగ్గి వెడలిపోయె —
బిత్తర పోయిన సీతకు లోకమె శూన్యమ్ముగాగ
పూర్ణ గర్భిణిని యిట్టుల సేయనేమి ధర్మమ్మని
బిగ్గరగా విలపించుచు రోదించుచు మూర్ఛ నొందె —
పడతి రోదనము చెవిబడ పరుగున వాల్మీకి వచ్చి
ఆమె సీతగా నెఱింగి ఆశ్రమముకు తోడ్తెచ్చెను
సీతా సాక్షాత్ లక్ష్మి అని అంతా అనురక్తిని
సాదర భక్తి ప్రపత్తుల సాకిరి ఉపచర్యలతో —
అన్నకెదురు చెప్పలేక వదిన నడవి విడిచి వచ్చి
మనసు వికలమై వ్యథతో మథన పడెడు తమ్మునిగని
"ప్రాపంచిక విషయాలను పట్టించుకు బాధపడకు
తమ్ముడ యీమాయలోన మరల మునిగినావేమిటి ?
దేహాత్మా పరమాత్మల దోబూచుల ప్రహసనమిది

## రామగీత

దేహము గేహము వంటిది జీవాత్ముడు లోపలుండు
అహంభావ మతని యందు గృహ అభిమానము పెంచును

ఇట్లు గేహ అభిమానము పొందిన జీవుడు దానికి
సంబంధిత పుత్ర, దార, ధనాదులకు వశుడగును
చిత్తమునకు బానిసయై చింతలలో చిక్కుకొనును —
సత్త్వ రజస్తమో గుణములను త్రిగుణము అందురు గద!
సత్త్వ గుణము ఉత్తమము, రజోగుణము మధ్యమము,
తమోగుణము అధమమ్ము ఈ గుణములె అహమన బడు
తమోగుణుడు క్రిమికీటక జన్మల పొందుచు నుండును
రజోగుణుడు ఇహలోకము నందు మానవుడుగ బుట్టు
సత్త్వ గుణుడు జ్ఞానముతో స్వర్గలోకమును జేరును
త్రిగుణమ్ముల కతీతులుగ సంచరించు వారంతా
పరమోన్నతి పొంది తుదకు పరమాత్ముని చేరుదురు —
పూర్వ జన్మ కర్మలు భువి పుట్టుకలకు కారణములు
మరలను యీ జీవితమున అనురాగము పెంచుకుని
కర్మల నెన్నో చేయుచు తిరిగి జన్మలెత్తుదురు —
కర్మకు కారణము వ్యక్తి అహంకార మజ్ఞానము
దీనిని ఛేదించుటకిల జ్ఞానమొక్కటే మార్గము
జ్ఞానము కలిగిననాడే మాయవీడి పోగలదు
కర్తృత్వపు బుద్ధిపోయి సుజ్ఞానిగ మాఱగలడు —
కర్తృత్వమ్మని అంటే 'నేను' అనే 'తను' భావము
'తను' భావము విడిచినచో కర్మకు చోటేలేదు
నాదను స్వార్థమె కర్మ త్యాగరూపమే జ్ఞానము —
దేహము, ప్రాణము, మనస్సు, ఇంద్రియములు చిదాత్మతో
కలిసి బుద్ధులను మార్చును అదె అజ్ఞానము అనబడు

జ్ఞాని వీని నధిగమించి  ఆత్మబోధ స్వీకరించు
మధుర ఫలములను భుజించి  పిప్పిపాఱవేసినట్లు —
"నజాయతే నక్షీయతే నాపి వివర్ధతేఽనవః"
పుట్టుట పెరుగుట చచ్చుట  ఆత్మకు లేనేలేవు
దుఃఖము, సుఖమూ, భోగము  దేహాపు సంబంధములే —

అద్దము ఉంచిన ఎదురుగ  ప్రతిబింబము కనిపించును
అద్దము తొలగించినచో  అసలు వస్తువే మిగులును
అట్లె దేహ మనిత్యము  ఆత్మే నిత్యము సత్యము
ఇనుము నీరు పీల్చుకొనున?  అగ్నిని కూడిన పీల్చును
కానీ వాస్తవమునకది  భ్రాంతి, సుంత నిజములేదు —

దేహమందు దాగియున్న  జీవాత్మే పరమాత్మ
మాయ ఆవరించగనే  మధ్య అడ్డుతెరపడును
అది తొలగిన జీవాత్మా  పరమాత్మా ఒక్కటియే
ఈ ఆత్మ జ్ఞానమునే  అధ్యాత్మని పిలిచెదరు —

ఇంద్రియముల వశపఱచుకు  డెందము నిశ్చలమొనర్చి
రాగద్వేష మమతాదుల  దూరముగా తఱిమికొట్టి
కేవల సుజ్ఞాన దృష్టి  ఆత్మను కేంద్రీకరించి
గురుముఖమున జిజ్ఞాసువు  సాధన చేయగవలెను
గురుర్బ్రహ్మ గురుర్విష్ణుః  గురుర్దేవో మహేశ్వరః
గురుస్సాక్షాత్ పరంబ్రహ్మ  గురుస్థానము గుర్తెఱుగుము
నేనిటగురువును నీకు  వేద బాట నామాట —

సకల చరాచర జగము ఓంకారామృత జన్యము
ఓంకారమ్మన 'అ'కార 'ఉ'కారమ్ము 'మ' కారము
ఇంద్రియముల క (అ) కారము శరీరమున కు (ఉ) కారము
మాయకు "మ" ప్రతీకలుగ ఓం కారము ఉద్భవించె
ఇది ప్రణవం ఈ స్మరణం జీవుని దేవుని జేయును
నీవు చూచునది అంతా బొమ్మలాటలో భాగము
నీవిందున ఒక బొమ్మ సూత్రధారి వేఱొకరు
జగన్నాటకమున కథ అంతా "నే" ననుకొను చే
నీదేమిటి గంట పాత్ర నిర్వహణ, నిష్క్రమణే —
వలదు తమ్ముడా చింత విధి నిర్దేశము అంతా" —

## లవణ వధ

ఇట్లు తత్వబోధ నుండ మునులు వచ్చి మొఱపెట్టిరి
"రావణు రెండవ సోదరి 'కుంభీనసి' భర్త 'మధువు'
రుద్రుని ప్రార్థింప ఆత్మ రక్షణకై శూలమిచ్చె
ఆ శూలము ఎవరిపైన ప్రయోగింతువో వారలు
వెంటనే భస్మమ్మగుదురు అని త్రిశూలి వరమిచ్చెను —
అతని కొడుకు 'లవణుడిపుడు ఆ శూలము చేత బట్టి
మమ్మందఱ బాధించుచు వేధించుచు నుండె ప్రభూ!" —
"అంతేగద భయములేదు నేనాతని మడియించెద"
అని తమ్ముల బిలిచి వాని వధకెవ్వరు వెళ్ళుదురన
"స్వామీ నాకానతిందు నే చేసుకు వచ్చెదను"

భరతుడిట్లు పలుకగనే శత్రుఘ్నుండును లేచి
"అన్నా యీ అవకాశము నన్నా నాకిడుమన్నా
చిన్నినన్నగు లక్ష్మణుండు వనముల నిను సేవించెను
భరతుడు పదునాలుగేండ్లు నీ పాదుకలర్చించెను
ఏమిచేయకుండ మిన్న కున్నవాడ నేనొక్కడ
ఈ ఖండనమునకంపిన నా భాగ్యముగా నెంతును"
"చిన్ని తమ్ముడా! మెచ్చితి నీవే వెళ్ళెదవుగాక
లవణుని వధియించి అచట మధురానగరమునుగట్టి
ఆ రాజ్యము పాలింపుము రాజు జేతు నిన్నిప్పుడె"
అని అందఱి సమక్షమున మధురను పట్టము గట్టి
'నారాయణ' శరము నిచ్చె లవణుని సంహారమునకు
"లవణుడు శూలము ఇంటనె వదలి వెళ్ళి వనము నుండి
తిరిగిరాక మునుపె నీవు నగర ద్వారమున నిలిచి
సమరము ప్రకటించినచో సులువుగ వధియించగలవు"
అని తమ్ముని పంపెనతని ముదమున అశీర్వదించి
శత్రుఘ్నుండును అట్లే సంహరించె నా లవణుని
రాముడు చెప్పిన విధమున రాజ్యము పాలించుచుండె—

## కుశలవుల జననం

ఇచ్చట సీతాసాధ్వి ఇరువురు పుత్రుల గనెను
కుశలవులని వాల్మీకి నామకరణములు జేసెను
ఉజ్జ్వలముగ వెలుగు వారి కుపనయన మొనర్చి వేద
అధ్యయనము చేయించి రామాయణమును నేర్పెను

తంత్రి తాళ నృత్యరాగ గీతికగా రామచరిత
మధుర మంజులముగ పాడి ముని పల్లెల మెప్పించిరి —

## శ్రీరాముని అశ్వమేధ యాగం

అయోధ్యలో శ్రీరాముడు అశ్వమేధయాగాదుల
స్వర్ణ సీత ప్రతిమతోడ కర్మాచరణము తలచెను
దానికి మునిపుంగవులు, రాజర్షులు, బ్రహ్మర్షులు
ప్రజ్ఞానులు, సుజ్ఞానులు, ప్రముఖులు విచ్చేయుచుండె
వాల్మీకియు కుశలవులను వెంట తీసికొని పోయి
ఋషి వాటిక మునిపుంగవు లుండు చోట విడిదిచేసె —

మఱునాడా మునివరుండు ముద్దుగ కుశలవుల బిలిచి
బిడ్డలార మీ గానం పట్టణమున వినిపింపుడు
పరమాత్ముని చరితమ్మును ప్రజాంకితము గావింపుడు
పుణ్యము పురుషార్థము యీ ప్రజాకోటి కందగలదు
తత్కారణమున మీరలు ధన్యులగుదురని పంపెను —

అయోధ్యలో వీథులందు వీనుల విందులు చేయుచు
మధుర గాత్రముల బాలురు రామకథను పాడుచుండ
రామునికది తెలిసి వారి రప్పించుకు సభజేసెను
విజ్ఞప్రాజ్ఞరసజ్ఞులు, విశిష్టులు, పండితులు
ఆగానము కబ్బురపడి మేను మఱచి వినుచుండిరి —

అపరాహ్ణము నందు రామ భద్రుడు భరతుని పిలిచి
బంగారపు నాణెములను బహుమానముగా నిమ్మన

"రాజా ! ఆశ్రమ వాసుల కీ స్వర్ణము పనిఏమి ?"
వలదని వారించి గురువు వాల్మీకిని చేరుకొనిరి —

## సీత భూప్రవేశం

తన చరితను మధురముగా గానము చేసిన దానికి
విస్మయుడై శ్రీరాముడు విభీషణుని, శత్రుఘ్నుని,
సుషేణాంగదుల బిలిచి "వాల్మీకిని దర్శించుడు
సీతాసహితముగ ఋషిని రా ప్రార్థన చేయుడు" అనె —

వారల్లే వెళ్ళి రామ వాక్యమ్ముల నివేదింప
"స్త్రీలకు పతియే దైవము సీతమహా పతివ్రత
భర్తమాట కాదనదు కర్తవ్యము నెఱవేర్చును"
అని ముని పలికిన పలుకుల తెలిపిరి శ్రీరామునకు

ఈ వార్తకు ప్రజలందఱు అమితానందము నొందిరి
సీత రాక కొఱకు ఎదురు తెన్నులు చూచుచు నుండిరి —

మరునాడా రామసభ కిటకిట లాడుచు నుండెను
వాల్మీకిమహర్షి వెంట సీత సభను ప్రవేశింప
జయ జయ ధ్వానములు మిన్ను ముట్టెను సభ దద్దరిల్లె —

"దాశరథీ ! సీత మహా పతివ్రతా శిరోమణి
అపవాదపు భీతిని నీ విడువ బిడ్డగా బెంచితి
గంధర్వుల మించెడు యీ బిడ్డలు నీ కుమారులు
ప్రచేతసుని పుత్రుడను అనృత మెన్నడు పలుకను
నా తపస్సుపై ఒట్టిడి చెప్పుచుంటి నిది సత్యము" —

"ముని శ్రేష్ఠా! మీ మాటలు నమ్మని వారెవరుందురు?
కానీ స్వచ్ఛందశీల ప్రకటన పాలకులకు విధి"
అను పతిమాటకు దీటుగ అవని జాత స్పందించెను
అంజలి ఘటియించి సీత రాముని తప్పించి అన్య
పురుషునినే మనమునందు తలచని దాననె అయితే
భూమాతా! నీ ఒడిలో నన్ను జేర్చు కొమ్మనగా
ఛళ్ళున పగిలెను నేల "బిడ్డా!" అని భూదేవి
పైకి వచ్చి ప్రియమారగ అమ్మా! రమ్మని పిలిచి
హృదయానికి హత్తుకొని రసాతలమునకు జనియెను
'సాధు సాధు సీతే' అని సర్వులు ఘోషలు సల్పిరి
హా సీతా! అని రాముడు దుఃఖాంబుధి మునిగి పోవ
ఋత్విక్కులు ఓదార్చి యాగ సమాప్తిని జేసిరి —
కళ్ళల్లో కడలి కట్టి త్రెంచుకు ప్రవహించుచుండ
నిశ్చేష్టితులై నిలిచిన పుత్రులగని రఘు తిలకుడు
తన చేష్టకు నొచ్చుకొనుచు వారల కన్నీరు తుడిచి
గాఢ పరిష్వంగమ్మున బిడ్డల నక్కున జేర్చుకు
సేదదీర్చి నిజసౌధము లోనికి గొనిపోయెవారి —

## కౌశల్యకు మోక్షోపదేశం

శ్రీరాముడు నాటినుండి విరక్తుడై చింతనతో
కాలము ఏకాంతమందె గడుపుట ప్రారంభించెను
వృద్ధమాత కౌసల్య సిద్ధికోరి ప్రశ్నించెను
"రామా! పరమాత్ముడవు సృష్టి స్థితుల కతీతుడవు
నాదు పుణ్య వశమున నా సుతుడుగ జన్మించినావు

నాకవసానము వచ్చెను జ్ఞాన భిక్ష ప్రసాదించు
మోక్షమార్గమును జెప్పి మము తరింప జేయుము" అనె —
ఆత్మదేహములు రెండూ అమ్మా వేఱని తెలియుము
నీరు, నిప్పు, నేల, గాలి, నింగి మిశ్రమము దేహము
దేహమందు ఆత్మ భావ ముండుటె ఒక పెనుమాయ
దీనిచేత సంసారం పరికల్పన జరుగుతోంది
భార్యాపుత్రులు మిత్రులు దేహపు సంబంధములే
నిత్యమైన జీవాత్మకు అంటదగిలి ఉండవు అవి
విజ్ఞానపు రాహిత్యం దీని తెలియరానీయదు —
అహంకారమును వదలుటె ఇహమున జ్ఞానము అనబడు
సర్వప్రాణులను ప్రేమను సేవించుట సత్కర్మ
భగవంతుని నిష్ఠతోడ భజియించుటయే భక్తి
జ్ఞాన, కర్మ, భక్తి యోగ ములె ముక్తికి మార్గములు
అందున అతి సులభము తుది భక్తియోగమే తల్లీ
ఆ భక్తిని గుణరీత్యా త్రివిధమ్ములుగా చెప్పిరి
డాంబిక మాత్సర్య హింస భేదదృష్టి ప్రదర్శనల
భక్తినాచరించువారు తామసభక్తులు తెలియుము
ధన ధాన్యము యశస్సును ప్రతిఫల మాశించి చేయు
భక్తే రాజసభక్తి భువిసుఖములె దాని పరిధి
కర్తవ్యముగానెంచి కొలుచుట సాత్వికభక్తి
పుణ్యగతుల నందగలుగు టనునది దానికి అవధి —

## నిర్గుణ భక్తి

ఏ కోరిక లేకుండా నిర్మలాత్మ నర్పించెడు

నిష్కామాచరణభక్తి నిర్గుణ భక్తొకటున్నది
ఇదియే ఉత్తమభక్తి హేతువుకందని ప్రవృత్తి
సాలోక్యము, సామీప్యము, సారూప్యము, సాయుజ్యము
కూడ వారు కోరుకొనరు అంకితభావము తప్ప
ఇదియె యోగ్యమగు భక్తి జీవునకందించు ముక్తి —
ఇది ఎట్లన ప్రతినిత్యము మది దేవుని మూర్తి నిలిపి
స్మృతుల, స్తుతుల, పూజలతో పునీతుండు గావలయును
సర్వభూతములయందూ సర్వేశ్వరు దర్శించుచు
సత్యవ్రతము పాటించుచు సత్పురుషుల సేవించుచు
పీడితులను తాడితులను ప్రేమ నాదుకొనవలెను
వేదాంతపు వాక్యమ్ముల శ్రవణ, మనన, పఠనలతో
సద్వర్తన, సంకీర్తన, సత్సాంగత్యము నెఱపుచు
అహమువిడిచి పరమాత్మను అహరహమ్ము స్మరించాలి
పరిశుద్ధాత్మను నిత్యము వీనిని పాటించువారు
కామిత మోక్షమును పొంద గలరటంచు బోధించెను —
ఇనకులేశు జ్ఞానబోధ వినినతల్లి విరాగియై
నిర్గుణభక్తిని బంధము లన్నీ వదలించుకొని
త్రిగుణమ్ముల ఛేదించి కైవల్యము పొందె నామె —
అక్కవలెనె కైకచేసి భర్తను స్వర్గమున కలిసె
అదేరీతి సుమిత్రయు దశరథు చెంతకు చేరెను —

## రాజ్య విస్తరణ

భరతుని అనుంగు మేన మామ 'యుధాజిత్తు' పిలువ
రాముడు ఆజ్ఞాపించగ సైన్యసమేతముగ వెళ్ళి

గంధర్వుల గెలిచి రెండు నగరములను వశపఱుచుకు
"పుష్కరావతీ" నగరికి పెద్దకొడుకు "పుష్కరు" నీ
"తక్షశిలా" నగరమునకు చిన్నకొడుకు 'తక్షుడి' నీ
అన్న ఆజ్ఞమేర భరతు డధిపతులను గావించి
రాజధాని తిరిగివచ్చి రాముని సేవించుచుండె —
శ్రీరాముడు సౌమిత్రిని పిలిచిచెప్పె నొకనాడు
"పశ్చిమదిశ భిల్లులు అతి నీచులుగా దుర్వృత్తిని
ప్రజలను పీడించుచుండె వారి పీచమణచి నీదు
బిడ్డలు అంగదుడు, చిత్ర కేతుల నభిషేకించుము
అన లక్ష్మణుడట్లె చేసి వచ్చి రామ విభుని జేరె —

## కాలుని రాక

కొంతకాలమిట్లు గడువ కాలుడు ఋషిగావచ్చి
శ్రీరాముని దర్శించి శుభ వందన మాచరించె
స్వామీ మీ సందేశము శలవిండని రాముడడుగ
నీకూ నాకూ తప్ప యితరులకిది తెలియరాదు
చాటుగ మాటాడవలయు ఇటనెవ్వరు నుండరాదు
మధ్యను ఎవ్వరు వచ్చిన మరణ శిక్ష వేయాలనె —
సరే యని లక్ష్మణుని ద్వారము కడ నుండుమని
"ఎవ్వరు రాకుండ చూడు వచ్చిన వధ తప్పబోదు"
అని రాముడు శాసన మిడ 'ఆజ్ఞ' అనుచు అతడు వెడలె —
"కాలుండను నేను ప్రభూ! కారణజన్ముడవీవు
ఏకాదశ వేలవత్స రాలే యీ అవతారము
గడువు పూర్తి అగుచున్నది మీ మతమేమో చెప్పుడు" —

"సంతోషము పయనమునకు సిద్ధముగా నుంటినిలే"
అని సంభాషించు తఱిని దూర్వాసుడు ద్వారము కడ
"లక్ష్మణ! నారాకను మీ అన్నకెఱింగించుము" అనె —
"ఒక ముహూర్త మాగవలయు రాముని చూడగ మీరు"
అనగా ముని ఉగ్రుండై నీ విప్పుడె చెప్పకున్న
మీ వంశము నంతటినీ భస్మము చేసెద చూడన
వంశమంత పోయినాక నా ఒక్కడి బ్రతుకెందుకు ?
నేనుపోయి వంశమంత రక్షించుట మంచిది అని
లక్ష్మణుండు లోనికేగి దూర్వాసుని రాక చెప్పె —

## లక్ష్మణ బహిష్కారం

రాము డెదురుగావచ్చి ప్రణామమ్ము లాచరించి
మునివర మీ పని ఏమిటి ? తెలుపుడు చేసెదననెను —
వేయివత్సరములనుండి చేసెడి ఉపవాస దీక్ష
రామా ! ఈ నాటి తోడ పరిసమాప్తి గావించితి
కనుక నేడు భోజనమ్ము నీ యింటను [28]కుడువ వస్తి" —
అన రాముడు ఆనందము తోడ షడ్రసోపేతపు
విందునిచ్చి దూర్వాసుని అభినందన లందుకొనెను —
కానీ రాముని హృదయము ఖేదముతో నిండిపోయె
లక్ష్మణుడానతి మీఱిన శిక్షయె వేధించుచుండె —
అన్నా ! ఆలోచించకు మాటయె మన ఆభరణము
నన్వధించి ప్రతిన నిలుపు కోమని లక్ష్మణుడు పచ్చె —
అయ్యో ! రాచఱికమెంత రాక్షసమని విచారించి
మంత్రులనూ, గురువులనూ, మునీంద్రులను మహాజనుల
రావించీ రఘురాముడు ప్రజాసభకు నివేదించె —

వసిష్ఠాది మునులు ధర్మ విశ్లేషణతో బల్కిరి
"సత్పురుషుల త్యజించుట వధియించుట ఒకటే యని
శిక్షాస్మృతి ఘోషించెడు గాన నతని పరిత్యజింప" —
అనగా రాముడు వ్యథతో బహిష్కరణ ప్రకటించెను —
కండ్లనీరు గ్రుక్కుకొనుచు లక్ష్మణుడేగెను బయటికి
సరయూనదిచేరి మూసె నవరంధ్రమ్ముల శ్వాసను
బ్రహ్మరంధ్రమున జీవుడు పరలోకము చేరుకొనెను —

## కుశలవుల పట్టాభిషేకం

లక్ష్మణుండు వెడలగనే రాముడందఱిని పిలిచి
తమ్ముని భరతుని రాజ్యము నభిషేకించుండనగా
భరతుడందు కియ్యకొనక రామసేవయే కోరుచు
కుశలవులకు యీభారము ఒప్పగించు టుచితమనెను
అందఱు సమ్మతి తెలిపిరి ఆనందము వెలిబుచ్చిరి —
రాజ్యము రెండుగజేసి బిడ్డలిరువురకు యిచ్చి
పట్టముకట్టిరి వారికి ప్రభువులజేసిరి వానికి —

## మహాభి నిష్క్రమణ

అనంతరము శ్రీరాముడు తన వైకుంఠపు యాత్రను
అందఱికీ ఎఱింగించి శత్రుఘ్నుని కొఱకంపెను
శత్రుఘ్నుండంత విని తన యిరువురు పుత్రులలో
పెద్దకొడుకు "సుబాహు"నికి "మధురా" నగరమునిచ్చి
"విదిశా" నగరము రెండవ కొడుకు "యూపకేతు" కిచ్చి
శ్రీరాముని దర్శించగ సరగు నయోధ్యకు వచ్చెను —
ఈ వార్తను వినిన జనులు హా! యని నేలను బడగా
లేవనెత్తి వారికోర్కె లను దీర్చగ సిద్ధపడెను

ఆతనితో వెంటవత్తు మని వారలు కోరగనే
అట్లే అని ప్రస్థానము ప్రారంభించెను రాముడు —
"అన్నా! నిను విడచి మేము అవని నుండుటా? కల్ల
అనుచు భరత, శత్రుఘ్నులు అనుసరించె రఘురాముని —
కిష్కింధకు అంగదుని రాజుగ నభిషేకించి
సుగ్రీవుడు కూడ వచ్చి రామునితో బయలుదేఱె —
విభీషణుడు తాను గూడ వచ్చుచుంటినన రాముడు
సూర్యచంద్రులూ భూమి నిలిచి యుండు నంతవఱకు
పాలన సాగింతు వనుచు పలికెతి నానాడు గాన
కల్పాంతము వఱకు నీవు ఉండక తప్పదు భువిపై
అనంతరము తప్పక నను చేరగలవు విభీషణా!" —
అని హనుమంతుని పిలిచి "నీవు కూడ రావద్దు
నానామము భువిని నాశ మగు వఱకు వేచి యుండు
నాభక్తుల రక్షించుచు చిరంజీవిగా బ్రతుకుము" —
"నాతో యుద్ధము చేయా లనియెడి నీకోర్కెదీర్ప
వచ్చెద ద్వాపర యుగమున వేచియుండు జాంబవంత!"
అని మిగిలిన వారందఱ వెంట తీసికొనిపోయి
సరయూ నదిలో దిగెను విష్ణురూపమును పొందెను —
భరతుడు శత్రుఘ్నుండును మాఱె శంఖ చక్రములుగ
లక్ష్మణుండు శేషుడుగా, సీత లక్ష్మిగా రాగా
విష్ణువు వారందఱితో వైకుంఠమ్మును చేరెను —

అధ్యాత్మ గేయ రామాయణం ఉత్తరకాండ సమాప్తం



# ఫలశ్రుతి

"వినాదానం వినాధ్యానం వినా తీర్థావగాహనమ్
రామగీతాం నరోఽధీత్య తదనన్త ఫలం లభేత్"

ఇది పార్వతి కోరికపై పరమశివుడు చెప్పెనాడు
దీని చదివినా, విన్నా దొరకు ఫలము అనంతము —

సంతానము కోరికున్న చక్కని బిడ్డలు పుడుదురు
పెళ్ళికాని పిల్లలను కళ్యాణము కోరివచ్చు
ప్రయత్నములు ఫలించును మనోరథము లీడేరును
బాధలన్ని తొలగిపోయి భాగ్యములకు తెరతీయును
పాపమ్ముల పరిహరించి మోక్షము ముంగిట వ్రాలును —

రామనవమి శుభదినమున బాలకాండ పఠియించిన
సకల పుణ్య తీర్థములను మునిగిన పుణ్యము వచ్చును
సుందరకాండను ఎప్పుడు చదివిననూ శుభముకలుగు
రామకృపకు పాత్రులగుట తథ్యము ఏ కొంతవిన్న
భక్తి, ముక్తి, జ్ఞానములను ప్రబోధించు సద్గ్రంథము
అధ్యాత్మిక రామాయణ మనునిది గేయ ప్రబంథము—

శ్రీ మదధ్యాత్మ రామాయణ గేయ కావ్యం సంపూర్ణం

## మంగళం

"మంగళం కోసలేంద్రాయ మహనీయ గుణాత్మనే
చక్రవర్తి తనూజాయ సార్వభౌమాయ మంగళం"



# సవరణలు

| పేజి | లైను | పదము | సవరణ |
|---|---|---|---|
| 15 | 15 | ముద్వాడ | ముద్దాడి |
| 31 | 1 | దేహోము | దేహము |
| 46 | 19 | స్మృతి హీనుడై | స్మృతి విహీనుడై |
| 50 | 6 | పెదలార | పెద్దలార |
| 59 | 9 | గార్శమము | గార్శమము |
| 64 | 9 | మావవుడె | మానవుడె |
| 73 | 16 | వేథసే | వేథసే |
| 73 | 17 | పతయే కుభ్యం | పతే తుభ్యం |
| 75 | 12 | నీ భక్తుల | నా భక్తుల |
| 77 | 7 | రవముల | రవములతో |
| 78 | 21 | నిడుకొచి | నిడుకొని |
| 83 | 17 | పెర్దగ | పెద్దగ |
| 87 | 9 | ఘొల్లు | ఘొల్లు |
| 88 | 3 | అహంకార | అహంకారాది |
| 88 | 13 | సంసారవు | సంసారపు |
| 88 | 22 | పార్థిప | పార్థివ |
| 93 | 16 | భకి | భక్తి |
| 104 | 6 | ఊర్ధ్వదృష్టి ఊర్ధ్వదృష్టి | ఒకపదం తీసేయాలి |
| 104 | 10 | శ్రీఘం | శీఘ్రం |
| 104 | 15 | వార్మ | వార్త |
| 108 | 14 | ధర్మాత్మజ | ధరాత్మజ |
| 109 | 20 | హీనచర్యం | హీనచర్య |

| పేజి | లైను | పదము | సవరణ |
|---|---|---|---|
| 113 | 16 | కూర్చెనెదరు | కూర్చెనెవరు |
| 114 | 13 | అంగుశీయకము | అంగుళీయకము |
| 116 | 18 | హచుమానుడు | హనుమానుడు |
| 117 | 18 | చెప్పిన | చెప్పిన |
| 119 | 22 | సర్వేశకర్త | సర్వేశ కర్త |
| 122 | 7 | ప్రశ్నించెను | ప్రశ్నించెను |
| 126 | 13 | ఎగుడాత్మ | నిగూఢాత్మ |
| 131 | 5 | యెముకలు | మెముకలు |
| 138 | 17 | కతయేమిటి | కతమేమిటి |
| 148 | 19 | జరిపించన | జరిపించిన |
| 152 | 10 | సమరము అని | అని సమరము |
| 153 | 4 | మాతలిని | మాతలిని. |
| 164 | 22 | దిప్య | దివ్య |
| 167 | 3 | తిన్నట్టునె | తిన్నట్టనె |
| 177 | 14 | నందేశము | సందేశము |



